# అమిత సౌందర్యము కొరకు

మీ చర్మమును యౌవనంగాను, ఉల్లాసితంగాను-
పరిశుభ్రంగాను, మనోహరంగాను ఉంచుకొనుడు. సంవత్స
రాంతమున్ను మనోహరమైన సహజ సౌందర్యమును
రూఢిగా పొందుడు. "హేజ్‌లైన్'స్నో" మీ
చర్మమును చల్లగాను, కాంతివంతముగాను,
సుందరముగా నొనర్చును. ఇది చోర-నిరోధక
సీలుతో ప్యాక్ చేయబడి వచ్చుచున్నది.




## "'HAZELINE' SNOW"

(TRADE MARK)



"'హేజ్‌లైన్' స్నో" (ట్రేడ్ మార్కు)

బరోస్ వెల్కమ్ ప్రొడక్ట్

సంవత్సర చందా
రు. 13-0-0
విడిపత్రిక 25న.పై

# ఆంధ్రపత్రిక

సచిత్ర వారపత్రిక

సంపుటము 52
సంచిక 23
29-1-58

**Founder : K. NAGESWARA RAO**

హేవిళంబి పుష్య, శుద్ధ నవమి బుధవారం


## ★ విషయానుక్రమణిక ★



ముఖచిత్రం:

"గంగాగౌరీ సంవాదం"లో జానకి



★ ★



మద్రాసు (గిండీ)లో నిర్మించిన గాంధిస్మారకమందిర బాహ్య దృశ్యం

## జనవరి, 30

# బాపుజీ దశమవర్ధంతి

[ శ్రీలక్ష్మీకాంత మోహన్ ]



దేశముకోసము అసువుల నిస్తివ ధీరుడవో గాంధీ!
నీవే వీరుడవో గాంధీ!
కులమతభేదాల్ కూడ దనుచు బహు
గోలకెత్తి ఘోషించావా!
ఎల్లప్రజలునూ సోదరులని మా
కెల్లరకూ బోధించావా! దేశము...
భరతమాత చెర విముక్తికై అన
వరతము కష్టించావయ్యా
కొరతలేక భుక్తికి ప్రజకేమియు
కరువులు పోవాలన్నావా! దేశము...
కృషితో నాస్తి దుర్భిక్షమ్మని
ఋషి సందేశం బిచ్చావా!
అహింసా పరమోధర్మం బని
అహరహ మాక్రోశించావా!...దేశము...
భారతీయులను బిడ్డలె యనుకొని
పరమానందం బందేవా!
ఎట్టకేల కొక భారతీయుడే
అట్టిమహాత్ముని చంపేడా!...దేశము...



గాంధి మందిర
అంతర్భాగం







ఫొటోలు :
కేశవశర్మ





గోడలపై లతాశిల్పం



ద్వారంవద్ద భద్రగజశిల్పం



మరొకచోట మయూరశిల్పం



న్యా॥ కోకా సుబ్బారావు



ఆంధ్రప్రదేశ్ హైకోర్టు ప్రధాన న్యాయమూర్తి శ్రీ కోకా సుబ్బారావు సుప్రీంకోర్టు న్యాయమూర్తిగా నియమితులైనారు. మళ్లీ ఉత్తరువులు జారీ అయ్యేవరకూ ఆంధ్రప్రదేశ్ ప్రధాన న్యాయమూర్తిగా న్యా॥ శ్రీ పి. చంద్రారెడ్డి పనిచేస్తారు.





న్యా॥ పి. చంద్రారెడ్డి




# తిండి కొరతకు బాధ్యు లెవరు?

భారతదేశం చూడవచ్చిన మొట్టమొదటి బ్రిటిష్ ప్రధాని హెరాల్డ్ మాక్మిలన్. బ్రిటిష్ రాజు అయిదవ జార్జి ఈ దేశం వచ్చి ఢిల్లీలో పట్టాభిషేకం చేసుకున్నాడు. అయన్నయితే మనం మరిచిపోవచ్చును గాని, భారతరాజధానిని ఢిల్లీకి మార్చింది ఆయనే. వేల్సుయువరాజులుగా ఏడవ ఎడ్వర్డు, అయిదవజార్జి, ఎనిమిదవ ఎడ్వర్డు, యార్కుయువ రాజుగా ఆరవ జార్జి న్యూఢిల్లీ దర్శించారు. ఆరవ జార్జి కాలంలోనే భారతదేశం స్వతంత్రమైంది. ఎలిజబెత్ రాణి భారతదేశం రాలేదు గాని ఆమె ప్రధాని మాక్మిలన్ ఇప్పుడీదేశం వచ్చారు. వీరి రాకతో భారత బ్రిటిష్ స్నేహ సంబంధాలు దృఢతరమైనాయి.

* * *

షేక్ మహమద్ అబ్దుల్లాను విడిచి పెట్టడం, విడుదల తరవాత ఈ మహానుభావుడు చేస్తున్న ఉపన్యాసాలూ గమనిస్తుంటే, అసలాయన్ని ఖయిదు చెయ్యటంలో భారతప్రభుత్వం ఎంత తెలివైన పని చేసిందో అవగతమవుతుంది. ఈయన ఉపన్యాసాలు వట్టింట్లో దివిటీల నాట్యంమల్లే ఉన్నాయి. భారతదేశంలో మళ్ళీ మతకలహాగ్ని రగిలించాలనీ, భారతీయ ముసల్మానులను ఇరుకున పెట్టె అసంతృప్తి రెచ్చగొట్టాలని గావును ఈయన ప్రయత్నం. దేశవిభజనతో రేచ్చిన మత వైషమ్యాలు ఇప్పుడిప్పుడే సద్దుకుంటున్నాయి. ఈ సమయంలో మళ్ళీ ఈయన!

తను ఏ నిచ్చెన మీదెక్కి ఇప్పటి పలుకుబడిలోకి వచ్చాడో ఆ నిచ్చెననే తన్ని పడేద్దామని అబ్దుల్లా చూస్తున్నాడు. మధ్యప్రాచ్య రాజకీయాల్లాంటివి కాశ్మీర్ లోకి లాక్కురావాలని చూస్తున్నాడు. మశీదులో వేదిక ఎక్కి మాట్లాడేస్తే అధికారం తనకైవస మవుతుందని ఈయన ఊహ. కాశ్మీరీ మునిములు, ముఖ్యంగా శ్రీమతి మృదులా సారాభాయీ, భారతదేశానికి విధేయులుగా ఉండటమో, అబ్దుల్లాకు విధేయులుగా ఉండటమో తేల్చుకోవాలి. అబ్దుల్లామాత్రం భారత దేశానికి ఇక మీద విధేయుడుగా ఉండేది లేదని తేలిపోయింది. అసలీయన తనకి తను తప్ప ఎవరికి విధేయుడో కూడా తెలియటం లేదు. 'వ్యక్తి ఆరాధన, చాలా అపాయకరమైన అలవాటు. షేక్ అబ్దుల్లా ఇందుకొక ఉదాహరణ.

* * *

వ్యవసాయోత్పత్తి దృష్ట్యా దేశంలో ఆహార పరిస్థితిని జాతీయాభివృద్ధి మండలి స్థాయీ సంఘం ఇటీవల కూలంకషంగా చర్చించింది. సమస్యల్లో కల్లా తీవ్రమైన ఈ సమస్యను విమర్శనాత్మక బుద్ధితో ఎవరూ పరిశీలించక పోవటం బాధగా ఉంది.

**శ్రీకృష్ణ**
[ఆంధ్రపత్రిక ప్రతినిధి]

దాదాపు పదిహేనేళ్ళనించీ అధికాహారోత్పత్తి ఉద్యమం ఈ దేశాన్ని పట్టుకుని పీల్చి పిప్పిచేసింది. బాగా పంటలు పండిన ఏడాది ఈ ఉద్యమం గొప్ప "విజయం" సాధించేస్తుంది. ఇహ మనకి తిండికి ఢోకా లేదని, ఇదంతా ఉద్యమప్రభావమే ననీ బాజా బజాయింపు హోరెత్తిపోతుంది. కాని వానలు కురవనప్పుడు "ఎక్కడి కప్పలక్కడే, గప్‌చిప్" అన్నట్లు పంటలుపండని ఏడాది ఈ ఉద్యమం ఎక్కడ తలదాచుకొంటోందో ఎవడికీ తెలియదు. అయినా దానికయ్యే ఖర్చు అవుతూనే ఉంటుంది.

స్వాతంత్ర్యం రాగానే నెహ్రూ ప్రభుత్వం శ్రీ పురుషోత్తమదాస్ ఠాకుర్దాస్ అధ్యక్షతన ఒక ఆహారధాన్యాల సంఘం వేసింది. ఈ సంఘంలోని 14 గురు సభ్యుల్లో శ్రీ జి. డి. బిర్లా, శ్రీ శ్రీరాం కూడా ఉన్నారు. ప్రభుత్వం సప్లయి చేసిన లెక్కలు చూసి మురిసిపోయి ఈ సంఘం ఒక పదేళ్ళలో అనగా 1957 నాటికి, 1,87,10,000 ఎకరాలకు నీటివసతు లభిస్తాయని అంచనా వేసుకుంది పాపం!

చిన్న, పెద్ద నీటిపారుదల ప్రాజెక్టుల మూలంగా 85 లక్షల ఎకరాలకు అదనంగా నీరు సరఫరా అవుతుందని మొదటి ప్రణాళికలో అంచనా. బాగానే ఉంది. కాని రెండో ప్రణాళిక ముసాయిదా తయారుచేసే సమయంలో వివిధ రాష్ట్రాలు అందజేసిన లెక్కల్ని బట్టి 63 లక్షల ఎకరాలకే అదనంగా నీరు అందినట్లు (అనుకున్న దానికంటే 22 లక్షలు తక్కువ) తేలింది. పోనీలే అనుకుందాం. కాని ప్లానింగు సంఘం భారత ప్రభుత్వానికి అందజేసిన నివేదికల్ని బట్టి నిజానికి 40 లక్షల ఎకరాలకిమాత్రమే అదనంగా నీరు అందినట్లు (అనుకున్న దానికంటే 45 లక్షలు తక్కువ) స్పష్టమైంది. 1956 మార్చి నాటికి 75 లక్షల ఎకరాలకు నీరు సరఫరా చేయటానికి అవకాశమున్నా, ఎవరికి వారు ఊరుకున్నారు. అంటే మొదటి ప్రణాళిక కాలంలో 35లక్షల ఎకరాలకు నీటిసరఫరా సదుపాయాలను రాష్ట్రాలు ఉపయోగించుకోలేదన్న మాట. ఇహపోతే రెండవ ప్రణాళికలో 120 లక్షల ఎకరాలకు నీరు సప్లయి చెయ్యాలని సంకల్పం. కాని 1956-57 సం|| పు పరిస్థితి చూడండి. 18 లక్షల 80 వేల ఎకరాలకి నీరు సప్లయి చెయ్యాలని సంకల్పించి 7 లక్షలకుమాత్రమే నీరు సప్లయి చేయగలిగారు.

నదీలోయ ప్రాజెక్టుల మూలంగా కార్మికులకు పని, విదేశీ యాత్రికులకు వినోదం కల్పించటంతప్ప మరేమీ జరగటం లేదు. కోట్లకొద్దీ డబ్బు ఖర్చవటంతప్పితే దమ్మిడీ లాభం లేదు. రాష్ట్రప్రభుత్వాలకు తిండికొరత సమస్య లేదు. ఎందుకంటే కేంద్ర ఆహారశాఖ ఉందిగా-విదేశాలనుంచి ధాన్యాలు దిగుమతి చేసి రాష్ట్రాలకి పంచిపెట్టేందుకు! ఈలోగా కమ్యూనిస్టులు ప్రాజెక్టులలో పనిచేసే కార్మి

(48-వ పేజీ చూడండి)



# అడుగడుక్కీ...

కొమ్మూరి వేణుగోపాలరావు

"నేనివాళనుంచి అబద్ధం చెప్పను" అనుకున్నాడు ఆనందరావు పొద్దున్న ఆవులించి.

'అవును నిజం నేనబద్ధం చెప్పనే చెప్పను' అనుకున్నాడు.

"అయ్యగారు యిప్పుడా నిద్రలేవటం. గడియారం వైపు చూడండి కాస్త. ఎనిమిదయింది" అంది భార్య సుగుణ ఎత్తిపొడుస్తూ.

ఈ యెత్తిపొడుపుకు ఆనందరావు చిన్నబుచ్చుకున్నాడు. "రాత్రి పన్నెండింటి వరకూ పాడు ఆఫీసు కాయితాలు చూసి పడుకున్నానా?" అన్నాడు.

"ఎంత తడుముకోకుండా వస్తాయండీ అబద్ధాలు?" అని అతని ముఖంమీదకు వంగి "రాత్రి ఎన్నిగంటలకి?" అని అడిగింది.

ఆనందరావుకు సిగ్గుతో చచ్చిన చావయింది. "పో నువ్వు" అని దుప్పటి కప్పుకున్నాడు ముఖంమీద. అతనికి ఉక్కపోసింది. "ఛ ఛ నోరు జారిపోయింది. ఇహ అబద్ధం చెప్పను" అనుకున్నాడు.



"రాత్రి ఎన్నిగంటలకి!"

అంది సుగుణ

ఆనందరావు స్నానంచేసి యివతలకు వస్తూండేసరికి పరంధామయ్యగారు ఊడిపడి "యివాళయినా యిచ్చేదుందా? ఎగనామమేనా?" అన్నారు.

"అయ్యా పపగారూ ఒక్క మనవి" అన్నాడు ఆనందరావు గుటకలు మ్రింగి.

"పప ఏమిటయ్యా పప. లక్షణంగా పేరు పెట్టి పిలవలేవూ. ఈ జారుముడిగాణ్ణి చూస్తే అంత ఎకసెక్కమా?" అన్నాడాయన ఆగ్రహించి. ఆయన పూర్తిపేరు పరమాత్ముల పరంధామయ్యగారు.

"క్షమించాలి. పరంధామయ్యగారూ. ఈ పీటముడిగాణ్ణి కాస్త కనికరించాలి. జీతాలింకా రాలేదు. మా సెక్రటరీ సెలవుమీద వున్నాడు. రెండు రోజులాగితే?" అంటూ ఆనందరావు నసిగాడు.

శాస్త్రయుక్తంగా ఒక బస్తాడు తిట్లు తిట్టి, ఛందస్సు తప్పకుండా ముప్ఫయి



వార్నింగులిచ్చి నిష్క్రమించాడు పరంధామయ్య.

వార్నింగులిచ్చి రంగంమీద నుంచి నిష్క్రమించాడు పరంధామయ్యగారు.

వాస్తవిక జీవితంలో ఎలా వున్నా యిది కథ క్రింద చెప్పకుంటున్నాం. కాబట్టి కథానాయకుడు ఆనందరావు మంచివాడని ఒప్పుకొని అతన్ని పరంధామయ్యలాంటి విలన్లు చాల బాధలు పెడుతున్నందుకు మనమందరమూ కోపగించుకోవాలి.

"అమ్మయ్య" అనుకున్నాడు ఆనందరావు.

"నిన్ననే కదుట్రా లక్షణంగా నూటయాభయి రూపాయలూ జీతం పుచ్చుకున్నావు" అని ఘోష పెట్టింది అతగాడి అంతరాత్మ.

తను అసలు అబద్ధమాడుతున్నాడనే అనుకోలేదు. అనుకున్నా ఎవరూ వినలేదని ఆనందించాడు. కాని ఖర్మ. అంతరాత్మ వింది.

ఇదివరకు లేదు గాని ఈమధ్య సినిమాలు చూడటం ఎక్కువయాక చీటికీమాటికీ దర్శనమిస్తోంది అతగాడి అంతరాత్మ.

"ఇదే ఆఖరిసారి. యింక చెప్పను" అని చెంపలు వాయించుకుని బుద్ధిమంతుడిలా లోపలకు నడిచాడు.

చాలామంది కథానాయకుల లాగానే యితనికి ఒక చక్కని భార్యతోపాటూ ఆరోళ్ళకుంటడు, రోగంతో మూల్గే తండ్రి, కోడలుపైని అధికారం చలాయించే తల్లి వున్నారు.

"నల్లమందురా నాయనా" అన్నాడు తండ్రి.

"ఇంకా పెర్మిట్ రాలేదు. దానికోసమే చూస్తున్నా" నన్నాడు ఆనందరావు.

వెంటనే అంతరాత్మ వీపుమీద ఒకటి వడ్డించింది.

"కోడల్ని తీసుకెళ్ళమని వాళ్ళకు ఉత్తరం రాశావట్రా?" అంది తల్లి.

"ఆఁ నిన్ననే రాశాకదరు."

"కవరెందుకు యీమాత్రం భాగ్యానికి?



మాౘ్ ఆర్గన్ కావాలన్న కొడుకుతో...

ఈమధ్య రెండు పైసలు పెరిగిందిట కూడాను." అని ఆమె విసుక్కుంది.

"నువ్వేన్నయినా చెప్పు. వాడికి పొదుపు తెలియకే" అంటూ తండ్రి అందుకున్నాడు.

ఆనందరావు తల పట్టుకుని యివతలకు వచ్చాడు. ఈ నాలికను కోసిపారెయ్యాలని పించింది. ఛీ. అనుకోకుండా అన్నీ అబద్ధాలు. తప్పట్లా.

ఇంతలో కొడుకు వచ్చి "నాన్నా! మాతీఆర్గన్ కనుక్కున్నావు నిన్న?" అని చిక్కు ప్రశ్న వేశాడు. వాడికి దానిమీద ఫారిన్ మ్యూజిక్కు వాయించాలని మోజు.

"అవతారం, షాపులో నిన్న కనుకున్నానురా నాన్నా. ఇంకా బొంబాయినుంచి రాలేదుట" అన్నాడు అభాగ్యుడు.

హఠాత్తుగా యీ అబద్ధంలోకి అవతారం కూడా కొట్టుకువచ్చాడు న్యాచురల్‌గా వుండేందుకు.

"పో. నువ్వెప్పుడూ యింతే" అని కుమార రత్నం ముఖం ముడుచుకుని వెళ్ళిపోయాడు.

"ఆనందరావు అన్నం ముందు కూర్చుని అదిరిపడ్డాడు.

"కడుపనుకున్నావా? కళ్ళెపల్లి చెరువనుకున్నావా?" అన్నాడు. అతను బందరు ప్రాంతంనుంచి వచ్చాడు.

సుగుణ తణుకు తాలూకా మనిషి. "కాదు. ఖండవిల్లి మడుగనుకున్నాను" అంటూ నవ్వింది

ఆనందరావు చక్కా భోంచేసి ఆఫీసుకు బయల్దేరాడు. పోస్టాఫీసు ఎదురైంది. పోష్టుమేన్ చుట్టూ మనుషులు ఉత్తరాలకోసం గుమికూడారు. ఆనందరావు కూడా తల దూర్చాడు. "నాకేమైనా ఉత్తరాలున్నాయేమో చప్పున చూడు నాంచారయ్యా. అర్జంటు పనివుంది పోవాలి" అంటూ అడిగాడు.

వెంటనే నాలికకరచుకున్నాడు. అర్జంటు పని వుందని ఎందుకు చెప్పాడు? ఆఫీసుకు పోవాలని ఎందుకు చెప్పలేదు.

ఆనందరావుకు ఉత్తరం వచ్చింది.

అందులో అతని చెల్లాయి యిట్లా రాసింది. "అన్నాయ్, మీ బావకు జబ్బు యింకా తగ్గలేదు. డబ్బులేక చాలా యిబ్బంది పడుతున్నాము-ఓ పాతిక రూపాయలు పంపించవూ?"

ఆనిక్క దానికి జవాబు ఎలా రాయాలో ఆలోచిస్తున్నాడు ఆనందరావు. కొత్త కొత్త కారణాలు. తనకు యీ నెలజీతం రాకపోవటమూ, అబ్బాయిని స్కూల్లో చేరిపించటమూ, అర్జంటుగా స్నేహితుడి భార్య చచ్చిపోవడమూ యిత్యాదులు.

అతను ఆఫీసుకు చేరేసరికి రోజూకన్న అరగంట ఆలస్యమైంది. సెక్రటరి తల ఎత్తి ఉరిమిచూచాడు. ఆనందరావు వొణుకుతున్న గొంతుకతో "డాక్టర్ వేణుగోపాలరావు దగ్గర ఆలశ్యమైపోయిందండి. ఆయన సాయంత్రాలు డిస్పెన్సరీ తెరవడు. మా మిసెస్‌కు సుస్తీగావుంటే?" అన్నాడు.

"ఊఁ" అన్నాడు సెక్రెటరీ భావయుక్తంగా.

ఒక అయిదు నిమిషాలు గడిచాక ప్రక్క సీట్లోని సుందర్రావు నవ్వాడు గర్వంగా. ఆనందరావు తలత్రిప్పి ఏమిటి అన్నట్లు చూశాడు.

"అందుకే యీ అబద్ధాలంటే నాకు అంత గౌరవం, అపేక్ష. మనను రక్షించాలన్నా, మన పరువులు కాపాడాలన్న ఇవే దిక్కు. నేనైతే వాటిని ఆరాధిస్తాను" అన్నాడు సుందర్రావు.

"మరి మన రామాయణం, భాగవతం, పురాణాలు?" అన్నాడు ఆనందరావు ఆశ్చర్యంగా.

"చిట్టికోయ్యా" అన్నాడు సుందర్రావు దర్పంగా. "ఈ భారత భాగవతాలు ఎందుకు పనికివస్తయ్యో తెలుసా? అప్రయోజకులు, అమాయకులు తగినన్ని ఉదాహరణలు చూపించుకునేందుకు."

ఈనాటికి సుందర్రావు కొత్త సత్యం కనిపెట్టాడు. ఆనందరావు పనిలో పడ్డాడు. అతని కలం వణికింది. చెయ్యి వణికింది. ఆలోచన వణికింది.

అతని ముఖం ఎరుపుకన్నా ఎర్రగా మారింది.

"అబద్ధానికి, మనిషికీ అంతదగ్గర సంబంధమా?" అని ప్రశ్నించుకున్నాడు.

"అనువు" అనుకున్నాడు.

"కాదు" అనుకున్నాడు.

తను యివాళ నిద్రలేవగానే ఏమి నిశ్చ




సంజాయిషీ అడిగిన సెక్రటరీ ఎదుట...

యించుకున్నాడు? చస్తే అబద్ధం చెప్పకూడదనుకున్నాడుగా.

ఏమయినాసరే, ఆ నియమం పాటించాలి. "అక్కర్లేదు" అంటున్నాడు సుందర్రావు.

రాత్రి ఏడుగంటలకు యింటివైపు నడుస్తున్నాడు. ఇప్పుడింటికిపోవాలి. వెళ్ళగానే భార్యతో ఒకటి, తనయుడితో ఒకటి, అమ్మతో ఒకటి, నాన్నతో ఒకటి. అబద్ధాలు, అబద్ధాలు.

ఆనందరావు చీకట్లో నవ్వుకున్నాడు. ఆ నవ్వు నల్లగా వుంది.

మరి ఇన్నీ తెలిసే, యిన్నీ ఆలోచించే, అలా నల్లగా నవ్వగలగటం చాతనై వుంటే మరునాడు లేస్తూనే అతను "కనీసం ఇవాళ్ళనుంచయితే అబద్ధం చెప్పను" అనుకున్నాడు. ★


## తెల్ల వెంట్రుక లుండవు

(GOVT REGD).

రంగులనుచూచి మోసపోవద్దు, అది తాత్కాలికము. మా సువాసన "విశ్వకళ్యాన్ తైలం" అనేక వనమూలికలతో ఆయుర్వేద పద్ధతిలో తయారైనది. 50 సం॥ల వయస్సువరకు వెంట్రుకలను నల్లగా వుంచును. ఇదిగాక మెదడుకు చల్లదనమునిచ్చును ఉన్మాదము, తలనొప్పి వగైరా జబ్బుల రానీయదు. "జ్ఞాపకశక్తి"ని కంటిచూపును వృద్ధి చేయును. కొద్దిగా నెరసివుంటే ఒక సీసా రు. 5/- 3 సీసాలు రు. 12, సగము నెరసివుంటే ఒకసీసా రు.6/- 3 సీసాలు రు.15/- పూర్తిగ నెరసివుంటే ఒక సీసా రు. 7/-లు 3 సీసాలు రు. 18/- లు పని చేయలేదని ఋజువుపర్చిన పూర్తి సొమ్ము వాపసు చేయబడును. కోరినవారికి ఫ్రీ.

MODERN DRUGS CORPN
(106) P. O. Pakribardwan (Gaya)




[ఉద్యోగపర్వం నుండి]

క. సారథ్యం బొనరింపు మ, పార కృపాలీల నెల్ల భంగుల నాకీ
గౌరవమును జిరకాలము, గోరిన యది దీని నిమ్ము గుణరత్ననిధీ.

క. అనినఁ గిరీటికి హరి యి, ట్లను నీ దగు కోర్కి దీర్చుటది నాకు వ్రతం
బనఘా తగ సారథ్యం, బొనరించెద నీకు నసమ యుద్ధక్రీడన్.

క. అని యూఱడించి నరుఁ దో, డ్కొని ధర్మతనూజు నొద్దకుం బ్రియ మెసగం
జనుదెంచెం గార్యాలో, చనమును దగఁ జేయుబుద్ధి శౌరి గడంకన్

వ. అంత నట శల్యుపాలికిం బోయిన దూత లతనిం గని సముచితాలాపంబుల సమర సహాయత్వంబునకుఁ గోరి పిలిచినం బ్రీతుండై యతండును బుత్త్ర మిత్త్ర సమేతంబుగాఁ నానాసేనాతిసంకులంబుగా గదలి పాండవు లున్న యెడకు నిత్యప్రయాణంబుల నడచుసమయంబున.

## దుర్యోధనుండు శల్యసాహాయ్యంబు గోరుట

తే. ఇంతయును విని కౌరవాధీశ్వరుండు, దక్షు లగు నాప్తజనముల దక్షిణంబ
మద్రనాథుని చనియెడు మార్గమునకు, బుచ్చి యెడ నెడ నతుల విభూతి మెఱయ.

సీ. అరుదారు మేలుకట్లాయితంబై చూడ, నొప్పారి తనుపగు చప్పరములు
బరపైన చెలువంబు గరగరికయుఁ దియ్య, తెలినీరు గలిగిన దీర్ఘికలును
బాడవైన మువ్వంచఁ బొలుచునట్లుగ నేనుఁ, గులకు గుఱ్ఱములకుఁ గొట్టములును
ముందర బయలైన చందంబు జతురాభి, మతమైన యాస్థాన మండపములు

ఆ. బియ్యములును నేయి, బెరుగును గూరగా, యలును వంటకట్టియలును గడ్డి
కవణములును బెల్లు గా నొడగూర్చి ని, గూఢవృత్తి దాను గూడ నడిచె.

వ. ఇవ్విధంబున విడిదలపయనంపు సంపదలు పొంపిరివోవం దనకు సమకట్టిన సమస్తవస్తువులయనైకల్యంబునకు శల్యుండు సంతుష్టాంతరంగుండై నిజపరిజనంబులం జూచి యిట్లు చతురంబుగా మనకు వలయువాని సంపాదించుటకుఁ బ్రవర్తకులైన యుధిష్ఠిరామాత్యు లెవ్వారు వారలం దోడ్కొని రండు వారలు ప్రసాదదానంబున కర్హు లని పలుకు నవసరంబున నటమున్న పలుదెఱంగులఁ బనులు సేయుచున్న తన పల్లాయనంబువారిలోఁ గలసి మఱువడి యున్న కౌరవేశ్వరుం డమ్మాటలు విని యతనికిం బొడసూప విదియ సమయం బని సముచితప్రకారంబున దన్నెఱింగించికొని వినయంబునఁ గనిన నతండును సంభ్రమంబున గాఢాలింగనంబు సేసి కనకాసనంబున నునిచి యింతయు నిమ్మహాత్ము నుద్యోగంబున నయ్యెంగావలయు నని తలంచి విస్మయం బంది నీ కెయ్యది యిష్టంబు గోరు మిచ్చెద ననిన గాంధారీ నందనుండు పరమానందంబునం బొంది యిట్లనియె.

క. సత్యసరస్వతి వగు మా, చిత్యవిశారదము నీదు చిత్తము నియమా
దాత్త్వంబు మెఱయ నాకు న, మాత్యుడవై పూని నడపు మత్సైన్యంబున్.

ఆ. తలఁపఁ బాండవులును, ధార్తరాష్ట్రులు నీకు, నొక్కరూప భక్తియుక్తి జాల
నీవు నన్ను మాన నీయుడు గాఁగ న, నుగ్రహించి తగఁ బరిగ్రహింపు.

చ. అనవుడు శల్యుఁ డియ్యకొని యట్టిద కాదె విభేద వృత్తి నా
మనమున లేదు పాండవసమాజము మీరును నొక్కరూప కా

వున నిది లెస్సమాట దగవుం దలపోయఁగ మున్ను బ్రీతి గాం
చిన నిను నెమ్మి గూడుటయ చేయుదు నిట్టుల యెల్లభంగులన్.

ఉ. దాన గొఱంత లే దభిమతం బిది గాకయుఁ గల్గెనేనియుం
బూని యొన ర్తు నన్నుఁ గురుపుంగవుఁ డెంతయుఁ బొంగి నీవు న
మ్మానము సేసి నా కిటు లమాత్యుఁడ వైన పదంబుకంటె మే
లై నుతి కెక్కు కోర్కి యెటు, లారసి చూచిన నొండు గల్గునే.

వ. అనిన విని వికచవదనుం డగుచు మద్రేశ్వరుండు.

క. చను నీవు హస్తినగరం, బున కేనును బాండుభూప పుత్త్రుల బ్రీతిం
గని యట వత్తు నవశ్యం, బును వారలఁ జూడవలయుఁ బోయెద ననినన్.

ఆ. అట్ల కాక వేగ మట పోయి మరలుండు, వరము మఱవ కుండ వలయు మిమ్ము
జేరి నెగడువాడ గారుణ్యమున నిట, యరసి యుండుఁ డనియె గురువిభుండు.

వ. అనవుడు,

క. దరహాసముతో మద్రేశ్వరుఁ డాలింగనము సేసి సందియపడ కీ
వరుగు మని పనుప నాతఁడు, కరిపురికిం జనియె మది వికాసము బొందన్.

## శల్యుఁడు పాండవులంజూడ నుపప్లావ్యంబునకు వచ్చుట

వ అంత శల్యుండు నుపప్లావ్యంబునకుం జని స్కంధావారంబు దఱియం జొచ్చి ధర్మనందను నివాసంబున కరిగిన నతండు దమ్ములుం దానును ద్రౌపదీసుభద్రలు నభిమన్యుప్రభృతిపుత్రవర్గంబును నెదురు వచ్చి కృతప్రణాముండై తోడ్కొని పోయి కాంచనాసనంబున నునిచి యర్ఘ్యపాద్యంబు లిచ్చి కుశలం బడిగిన సర్వంబును గుశలసంపన్నంబ యని వారల నందఱ నభినందించి యుధిష్ఠిరుం బునరాలింగనంబు సేసి యిట్లనియె.

క. జనరహితం బగు వనమున, ననుజన్ములు ద్రుపదభూవరాత్మజయును నీ
వును నింతకాల మలయక, యునికి కడుం దుష్కరము మహోదాత్తమతీ.

ఆ. దానికంటె నరిది దలపోయ నజ్ఞాత, వాస ముజ్జ్వలాంగ భాసమాను
లైన మీకుమీ దయా సూనృతాదుల, పెంపు మిమ్ముఁ గడవఁ బెట్టకున్నె.

క. ఇమ్మహి యెల్లను నీ మది, యుమ్మలికకుఁ జాల నొచ్చె నుర్వీవర నీ
విమ్మెయి నిప్పు డఖిలదురి, తమ్ములుఁ గడచుటకు నమ్మ దమ్మునఁ బొదలెన్,

వ. అని యుచితసంభాషణంబులు సేసి దుర్యోధనుండు దన్నుం గాంచినవిధంబును నతండు ప్రార్థించిన తెఱంగును దానికిఁ దా నియ్యకొనుటయుం జెప్పిన ధర్మనందనుం డతని కిట్లనియె.

తే. మేలు సేసితి రొక్కరి మెచ్చి వారి, కోర్కి దీర్చుట పెద్దల గుణము కాదె
యది మదీయచిత్తమునకు హర్షకరము, తివిరి యొక్కటి వేఁడెద నవధరింపు.

వ. పార్థునకుఁ గృష్ణుండు సారథ్యంబు సేయువాడై యున్నవాఁడు. కర్ణుండు పార్థుతో నెప్పుడు మచ్చరించుచు నుండు వీ రిరువురకు సంగ్రామంబైనయప్పుడు కృష్ణునకుఁ బ్రతిసారథ్యం బొనరింప మీర కాని యక్కడం దక్కొరుండు లేఁడు గావున నవశ్యంబును మీకుం గర్ణసారథ్యంబు గర్తవ్యంబు గాఁగలయది సమర సమయంబున నిరాకరించి పలికి కర్ణుచిత్తంబునకుఁ గలంక పుట్టించి పార్థురక్షింపవలయు నకృత్యం బని యనుమానింపక మత్ప్రార్థనంబున నెల్లభంగుల నివ్విధం బనుష్ఠించువార లని యభ్యర్థించిన సమ్మతించి శల్యుం డిట్లనియె.

క. అగు నిది పోలును నాకుం, దగ వట్టిద కర్ణునకు రథంబు గడప నీ
వగు దని కోరిన కౌరవ, జగతీశ్వరు ప్రార్థనంబు నలుపఁగ వలయున్.

క. కర్ణునిసారథి నైనను, నిర్ణయమున నేను బార్థునిం గాచెద నా
దుర్ణయవిచారు నెమ్మెయిఁ గర్ణకఠోరంబు లాడి కలఁతుం బోరన్.

తే. దర్పమును దేజమును మాయఁ దలరఁ బలికి, చిక్కువఱిచిన నేయంగఁ జేతులాడ
కునికి రాధాతనూజు నర్జునుఁడు దీవ్ర, బహుళ బాణపరంపర పాలు పఱచు

చ. ఇది యొకఁ డేల నీవు మది నెయ్యది గోరినఁ జేయువాఁడ నాఁ
డదయత సూతసూతి సభ నాడినమాటకుఁ జాల నొచ్చి మా
హృదయము లెల్ల నీవలన నెంతయుఁ బత్తము సేయు నక్కటా
యదియును గాక మీాపడిన యాపద లెవ్వరి నొవ్వఁ జేయవే.

ఆ. ఇట్లు వడితి ననుచు నెడ నీవు వగవకు, గారవమున నీ మనోరథమ్ము
ఫలము వొందు నెల్ల భంగుల దేవత, లయినఁ బడుదు రొక్క యవసరమున.

*** *** ***

వ అనిన విని ధర్మనందనుండు మద్రపతిం బ్రస్తుతించి మహానుభావా భవదీయభాషణశ్రవణంబునఁ జిత్తంబు కలంక దేఱె నని సంభావించి యతనికి సముచితంబు లగు మజ్జన భోజనంబు లొనరించి యనంతరంబ యతండు పయనంబునకు నుద్యోగించిన.

ఆ. అతని ననుప నేఁగి యధిక సంప్రీతి నే, తెంచు నవ్వు డయ్యుధిష్ఠిరుండు
రణములోన మీారు రాధేయుఁ బలుకుట, మఱవకుండవలయు మమ్ముఁదలఁచి.

క. అనుటయు మద్రేశ్వరుఁ డా, తని నూఱడఁ బలికి గాఢ తరముగ నాలిం
గన మొనరించి చనియె హ, స్తినాపురికి బలముతో నతి త్వరితగతిన్.

వ అట్టి యవసరంబున.

మ. సకలారాతి భయంకరుం డగుచు నుత్సాహంబు వాటించి నే
లకు వ్రేఁ గయ్యెడుభంగి వచ్చె రణలీలాకౌతుకం బొప్పఁ దా
నొక యక్షోహిణితోడఁ బాండవబలం బుల్లాసముం బొంద సా
త్యకి బాహాబలగర్వనిర్వహణవిద్యాప్రౌఢి సంరూఢుఁ డై.

వ. అంతం జేదిపతి యగు ధృష్టకేతుండును జరాసంధనందనుం డగు సహదేవుండును జె ఱొక్కయక్షోహిణితోడం జనుదెంచిరి సహోదరు లేవు రగు కేకయపతులు నేకాక్షోహిణీసమేతు లై యేగుదెంచిరి తదనంతరంబ.

క. కొడుకులుఁ దానును గుఱ్ఱపు, దడములఁ గరిఘటల భటరథవ్రాతములం
బుడమి చలింపఁగ ద్రుపదుఁడు, గడు వేడుకఁ దోడు సూపెఁ గౌంతేయులకున్.

వ. అదియును నొక యక్షోహిణికిం గలిగి యొప్పె నయ్యవసరంబున ననుజతనుజసమేతుండును బార్వతీయమహీపాలసహితుండును నై యొక్కయక్షోహిణి యొద్దనంబు దీర్చి.

క. చిందములు మ్రోతఁ బగతుర, డెందంబుల నోడ దిక్తటీసంధులు నం
దంద పగులంగఁ గుంతీ, నందనులకుఁ దోడు మత్స్యనాథుఁడు సూపెన్.

వ. పాండ్యవిభుండు లోనుగాఁ బలుదెసలనుండి వచ్చినబలం బొక్క యక్షోహిణికిం గలిగి యొప్పె.

క. ఏ డక్షోహిణు లిమ్మెయిఁ, గూడెం బాండునృపసుతులఁ గ్రూరాహవ సం
క్రీడావినోదమునకుం, దోడుపడం బూని యతికుతూహలవృత్తిన్.

వ. ఇవ్విధంబునం గూడి పెరిఁగి యుధిష్ఠిరుసైన్యంబు గయ్యంబునకుం గాలుద్రవ్వుచు నుండె నంత నక్కడం గిరాత కాంచన సైన్యనిచయంబులం గూర్చికొని సమరంబునకు నమరి యొక్కయక్షోహిణి గల భగదత్తుండు సుయోధనుం గలిసె. భూరిపరాక్రముం డయిన భూరిశ్రవుండును మహాబలుఁ డయిన శల్యుండును నేకాక్షోహిణీసమేతంబుగా నేతెంచిరి. వారలయట్ల సన్నద్ధుఁడై కాంభోజనాథుండైన సుదక్షిణుం డను యవనేశ్వరుండును వచ్చె నత్తెఱంగున సమకట్టి జయద్రథ ప్రముఖు లైన సింధుసౌవీరనరపతు లరుగుదెంచిరి. మాహిష్మతీపతి యగు నీలుండు యాదవవీరుండగు కృతవర్మయు నవంతీశ్వరులు సోదరులు నగు విందానువిందు లిరువురునుం గా ని న్నలువురు నొక్కొక్కయక్షోహిణితోడఁ జనుదెంచిరి. మఱియునుం బలుదెసలనుండి వచ్చి కూడిన వాహినులు మూఁడక్షోహిణులకుం గలిగె ధార్తరాష్ట్రులకుఁ దోడుపడం బూనిన యవి పదునొకం డక్షౌహిణు లయ్యె నట్టియెడ.

క. నవరణల నొప్పి యనిఁ బొం, డవబలముల మార్కొనం గడంగుచు నత్యు
త్సవమునఁ బేర్చిన సేనల, కవకాశము లేదు విడియ హాస్తిపురమునన్.

క. నానాముఖముల విడియం, గా నియమించెను బలంబుఁ గౌరవపతి యా
సేనలదొరలకు నిలువఁగ, నైనను నెడ లేమి నధిక హర్షం బెసఁగన్.

వ. ఇత్తెఱంగునం గురుజాంగలంబున రౌహితకారణ్యంబున మరుదేశంబున నహిచ్ఛత్త్రంబున గాలకూటంబున గంగాకూలంబున వారణావతంబున వటస్థానంబున విచ్చలవిడి విడిసి ధనధాన్యాదిసమస్తవస్తువుల కలిమిం జేసి యెలమి మిగిలియున్నంత.

క. పాంచాలమహీవల్లభు, పంచిన భూదేవుఁ డుచితభంగి నగరి కే
తెంచి ధృతరాష్ట్రుఁ బ్రీతిం, గాంచి కృపద్రోణవిదురగంగాసుతులన్.

వ. వారివారి మందిరంబులకుం జని కని సముచితాలాపంబులం బ్రసన్నచిత్తులం జేసి దుర్యోధనసందర్శనంబును నిర్వర్తించి నిత్యనిపుణారాధనంబున ధృతరాష్ట్రు నభిముఖుం గావించి యొక్కనాఁ డక్కౌరవేశ్వరు పేరోలగంబున సప్తసేనాపతులం గలయం గనుంగొని యిట్లనియె.

సీ. ధృతరాష్ట్రపాండుభూపతులు సహోదరు, లగుటయు వారల యాత్మజులకుఁ
దమతమతండ్రుల ధనములు గైకొనఁ, దగుటయు మీకు నందఱకుఁ జూడ
నుచితంబ కాదె యట్లుండెఁ దొల్లింటి చం, దంబును మనకుఁ దెల్లంబ కాదె
ప్రాణగొడ్డము లగు పనుల వారలఁ దిర్పఁ, దలఁచినఁ బుణ్యంబు కలిమిఁ జేసి
తే. బాహుబల మొప్ప నిజరాజ్యపదవిఁ బొంది
యున్న వంచనమెయి మహిఁ గొన్న తెఱఁగు
నెఱుఁగుదుర కాదె దీనికి నెల్ల నియ్యు
కొనియె నీ పెద్దరాజు నే మనఁగ నేర్తు.

శా. నారీరత్నము నట్లు దెచ్చి సభలో న న్వారలుం జూడఁగాఁ
జీరల్ ప్రోవులు గాఁగ నొల్చుటయు లచ్చిం బుచ్చికోలున్ మహో
గ్రారణ్యస్థలి నిల్పఁ బంచుటయు దైన్యవ్యక్తిమైపల్కులుక్
సైరింపం జనుపాండవేయులకు నీ సంధిక్రమం బొప్పదే.

క. వీరల వృత్తముఁ బొందుకు, మారులవర్తనము తెఱఁగు మాత్సర్యము లే
కారసి ధృతరాష్ట్రునకుఁ, గారవమున బుద్ధి సెప్పఁ గాఁ దగు మీకున్.

తే. పాండవులు గౌరవులతోడి పగకు నొల్ల, రఖిల భూప్రజానాశన మగుట జేసి
వార లస దని తలఁపంగ వలవ దధిక, ధర్మపరులైనకతమున దగవు నడచె.

వ. అందుఁ గూడినవి యే డక్షౌహిణు లిందు గూడినవి పదునొకం డక్షౌహిణు లని తలంతురేని వినుండు.

క. బాహుబలఘనుఁడు భీముఁడు, సాహసరసికాత్ముఁ డయిన సాత్యకియు మహో
గ్రాహవభూమి సహస్రా, క్షౌహిణు లట్లగుట మీరు సూడరె యెందున్.

క. గాండీవధన్వ నాహవ, పాండిత్యముఁ దలఁప నతని భండనమున మా
ర్కొండు నని యొకఁడు గడఁగుట, కొండం గని తగరు దాఁకఁ గోరుట గాదే.

క. ఆబీభత్సుని భూరిభు, జాబలమును దుర్నివార శౌర్యము శరవి
ద్యాబహుళతయును బందికి, నై బవరముఁ జేసినట్టి హరుఁడ యెఱుంగున్.

వ. అదియునుం గాక.

మ. వివిధోపాయపరాయణుండు రిపుదోర్వీర్యాపహారక్రియా
ప్రవణోద్యోగుఁడు మంత్రరక్షణకళాప్రావీణ్యగణ్యుండు ధై
ర్యవివేకాదిగుణోత్తరుం డఖిలవిద్యాజాలసంవేది మా
ధవుఁ డా దిక్కై పాండవేయుల కసాధ్యం బెద్దియుం గల్గునే.

ఆ. అదను దప్పకుండ నమ్మహాత్ముల నెమ్మి, బిలువ బంచి హితము బ్రియము రెండు
పక్షములకు నగుట పాటించి తగవుమైఁ, గొంత భూమి యిచ్చి కూడి మనుడు.

# మహాభారత ప్రచురణ

## వారపత్రిక పాఠకుల అభిప్రాయాలు

ఆంధ్ర వారపత్రిక సంపాదకులకు,

ఆర్యా!

తమ పత్రిక ద్వారా మహాభారత ముఖ్యఘట్టములను వారం, వారం అందచేయటం చాల ఉదాత్తమైన సాహిత్య సేవ. ప్రస్తుత పరిస్థితులలో ఇది ఎంతేని అవసరం. మహాకావ్యాలను (భారత రామాయణాదులు) మరచిన ఈ రోజులలో మీరు ప్రారంభించిన ఉత్కృష్ట కార్యం తప్పక సత్ఫలితాలను ఇస్తుందని మా ఆశ. ఈ సందర్భములో తమకు కొన్ని సూచనల నివ్వ సాహసిస్తున్నందులకు క్షమించ ప్రార్థన.

ఒకటి: నాలుపేజీలు కేటాయించటం చాలసంతోషం. ఆ నాల్గుపేజీలను పత్రిక మధ్యలో వేయటం ముఖ్యం. ఇంతకంటె ముఖ్యమైన విషయం ఆ నాల్గుపేజీలు కొంచెం మంచిపేపరు వేస్తే చదువరులకు నిజంగా ఉపయోగపడుతుంది.

రెండు: మీరు చెప్పినటు ఉపాఖ్యానాలను వదిలటం అవసరమే. అయితే పూర్వాపరాల గుర్తుకోసం ఆ వదలిన వానిని సూచించటం అవసరం.

మూడు: మంచి పేపరు వేయటం (ఆ నాల్గుపేజీలు) కష్టమైనచో తక్కిన పేజీలలో రెండు పేజీలు తగ్గించటమో లేదా మరో కష్టములేని పద్ధతిని ఆ నాల్గు పేజీలు కొత్త మంచి పేపరు వేయటమో చేసిన మీ సాహిత్య సేవ నిజముగా సార్థక మగును.

కనుక మా ఈ సూచనలను, మన్నింతురని మా ఆశ. మీ సహృదయత, విశాల హృదయము, మీ సాహితీ సేవ మా ఈ లేఖకు ముఖ్య కారణములు.

—ఉమామహేశ్వరరావు,
జొన్నలగడ్డ.

* * *

ఆర్యా,

తమ ఆంధ్ర వారపత్రికలో మహాభారతమును ప్రకటించుట చాల ప్రశంసనీయము. ఈ క్రింది సలహాలను గమనింప గోరెదను.

1. క్రమమైన పాఠనిర్ణయం చేయించవలెను. ఈ విషయము చాలకాలము నుండి పండితుల చర్చలో నున్నది. తమ వంటివారు పూనుకొనుట యుక్తము.

2. కామాలు, సెమికోలన్లు, మొదలైన గుర్తుల వేయించవలెను.

3. యతిస్థానమును తెలుపుటకు గుర్తును తప్పకుండ వేయించవలెను. పాఠకులకు ఇది మిక్కిలి సహాయపడును.

తాండూరి గోపాలకృష్ణ,
కొవ్వూరు.

* * *

ఆర్యా,

"ఆంధ్రపత్రిక" సచిత్ర వారపత్రికలో, సంక్రాంతి సంచికనుంచి ఆంధ్ర మహాభారతము నుండి ముఖ్య ఘట్టములను ప్రచురించబూనటం పాఠకులందరు ఏకగ్రీవంగా హర్షించగలసందర్భం.

కాని ఆంధ్ర మహాభారతము అందరు అర్థము చేసుకుని ఆనందించవలయునన్న, ప్రతిపద్యమునకు టీక వ్రాయుట అంత తేలికపని కాకపోవచ్చు. దాని స్థానే, ఆ పద్యముయొక్క స్వాభావిక పటుత్వం పాఠకుల మనస్సులకు హత్తుకునేలా, చక్కటి చిక్కటి తాత్పర్యమునుగూడ ప్రచురించినచో యెంతో వుపయోగముగా యుండును. ఇన్నేళ్లుగా అమలులోయున్న విద్యా సంప్రదాయమువల్లనేమి, మరి యే యితర కారణములవల్లనేమి, గద్యమునే సరిగా అర్థమయ్యేలాగ చదువలేని చాలమందిమి మేము, భారతములాంటి కావ్యమును అసలు సరిగా పైకి చదువగలమా యని సందేహము. అట్టి యీ సమయములో, మీరు మన వాఙ్మయమును తెరచాటునుండి తీసి మాకు చూపించటం మరువరాని మేలు. కనుక, స్థలాభావమగునని విచారించక, తాత్పర్య సహితముగా వచ్చే సంచికలనుండి ప్రచురించగలరని ఆశిస్తున్నాను.

'ఒక పాఠకుడు'

* * *

[వచ్చేవారం: మరికొన్ని లేఖలు, సమాధానం]


మెక్లీన్సు యింతకు ముందుకంటె పళ్లను తెల్లగా శుభ్రపరుచును!



# ఆశీర్వాదాలు

లక్ష్మీనరసింహశాస్త్రి



పుట్టిన ఆడపిల్ల చచ్చిపోయిందని నర్సు వచ్చి చెప్పేటప్పటికి మూర్తికి గుండె ఆగినంతపనయింది. చప్పున జయ ఆవేదన అంతా, తనను ఆవహించినట్లయింది. గభాలున డాక్టరు దగ్గరకు పరుగెత్తుకు వెళ్లాడు.

ఆమెగారు ఒక్కసారిగా చూసి 'ఎందుకట్లా వణికిపోతున్నారు, జయకొచ్చిన ప్రమాదం యేంలేదు, ఆడవాళ్ళకు యిది మామూలే...' అన్నది అతి సామాన్యంగా తన పనేమిటో చూసుకుంటూనే.

'అదిగాదండీ' అనబోయి, ఆమెగారి ముఖం చూసేటప్పటికి వెనక్కుతగ్గాడు మూర్తి.

'ఇంకా అదృష్టవంతులే. తల్లికి గండంతప్పింది. ఇంకే భయం లేదు. అమ్మాయిని సుఖంగా యింటికి తీసుకెళ్లొచ్చు. పాపం పుట్టినపిల్లను బ్రతికించలేకపోయాము,' అన్నది ముక్తసరిగా.

ఈ మాత్రం, మాట్లాడితే చొరవ తీసుకుందా మనుకున్న మూర్తికి మంచి సమయం దొరికింది.

'పాపం మీరుమాత్రం యేం చేస్తారు! చెయ్యగలిగిందేమిటో చేశారు. ఇక మా అదృష్టం... మీతో ఒక్కమాట...' నీళ్లు నమిలాడు.

ఆమె యే కళనుందో చప్పున కుర్చీలోంచి లేచివచ్చింది, ఇద్దరూ ప్రక్క గదిలోకి వెళ్లారు.

'జయను బ్రతికించండి ... ఎట్లాగైనా బ్రతికించండి...' తడబడుతూ అన్నాడు.

'మీ మగవాళ్లు వట్టి పిరికివాళ్లు, ఈ మాత్రానికే యింత యిదవాలటండీ. నేను చెప్పానుగదా; మీ కింకా భయం యెందుకంట!' డాక్టరు ఎంతో తేలికగా అన్నది.

'జయ పిల్లలకోసం కలవరించిపోతూ వుంటుంది. తెల్లారి లేచినప్పటినుంచి ప్రక్క పిల్లల్ని పెట్టుకుని ఆడుకుంటూ వుంటుంది. పిల్లలంటే అంత మోజు. ఆమె గర్భవతి అయినప్పటినుంచి ఆమె సంతోషానికి అంతే లేదు. తాను కూడా తల్లిని అవబోతున్నా నని పుప్పొంగిపోయింది. అడది, సంతానం లేకపోయిన తర్వాత జీవించటం యెందుకంటుంది! ఏమో ఆమె మనస్సు నాకు అర్థం కావటంలేదు. పిల్లలంటే అంతప్రాణం... అలాంటిది స్పృహ తెలియంగానే యీ విషయం తెలుస్తే, యెక్కడ అవుతుం దో అని నాకు చెడ్డభయంగా వుందండి. నా కేమీ తోచటంలేదు...' ఆయాస పడుతూ

ఆమెగారి వంక చూశాడు మూర్తి.

'అవులే నన్నేం చెయ్యమంటారు... పిల్ల పుట్టే చచ్చిపోయింది...' కటువుగా అన్నది.

ఈ మాట విని మూర్తి యింకా ఆవేదన పడుతున్నాడు.

'ఎట్లాగైనా ఓ దార్చి చెప్పాలిమీరు. మీ కేయింత యిదయిపోతూ వుంటే అద

డి, ఆ అమ్మాయి బొట్టు

#  అభావాలు 

నిభాయించుకొంటుంది! ఏదో ఆలోచించండి ఉపాయం...' ఆమె వెళ్లిపోతూ అన్నది.

'మీరంత తేలికగా అంటే కాదు. జయ సంగతి మీకు తెలీదు...వట్టి భయస్థురాలు. ఆమెకు గుండె నిబ్బరం తక్కువ. నా కేమీ పాలుపోవటంలేదు. ఎట్లాగైనా జయను కాపాడండి...' మూర్తి ప్రాధేయపడ్డాడు.

ఆమెగారు ఆలోచిస్తూ మూర్తి వంక చూస్తూ నిలబడిపోయింది. మూర్తి ఊపిరి పీల్చుకున్నాడు. ఆమె తల ఊపుతూ తనగదిలోకి వెళ్లిపోయింది. మూర్తి వరండాలో పచార్లు చేస్తున్నాడు. తన బుర్రలో యెన్నెన్నో ఆలోచనలు గిర్రున తిరిగి పోతున్నాయి. జయకు సంతానం మీద యింతమోజని తెలుస్తే మాత్రం ఆమెను ఒక్కనాటికీ పెళ్లిచేసుకునేవాడు కాదు. కాలేజీలో చదువుకుంటూ, హాయిగా తిరుగుతూ, పలుగురితో పరిచయం చేసుకుంటూ, పలుగురి నోళ్లల్లో పడ్డమూర్తికి, పెళ్లితొందర యే విధంగానూ లేదు. అయితే తల్లిదండ్రులు గట్టిపట్టుపట్టి, 'మళ్లా కట్నాలబిల్లు వస్తోంది, యింతకాలం ఆగి, యింతచదువు చెప్పించటం వృధా అవుతుం'దనే ఆ వేదనలో, మూర్తిని బిగించేశారు. తల్లిదండ్రుల మనస్తత్వంతో యేకీభవించక పోయినా, తప్పనిసరిగా పెళ్లికొడుకయి కూర్చున్నాడు. అసలు ఆ పెళ్లి జరగటమే చాలా విచిత్రంగా జరిగింది. మూడుముళ్లు పడేదాకనమ్మకం లేకపోయింది. ఏక్షణాన ఏవరొచ్చి, మూర్తిని రచ్చకీడుస్తారో అని అందరూ భయపడుతూనే వున్నారు. పుకార్లకేం, యిష్టంవచ్చినట్లు చెలరేగిపోయినాయి; ఎక్కువమందికి తెలీకుండా యీ పెళ్లి జరిగిపోవటంవలన, అభాసు కాలేదని కొంతమంది అనుకున్నా, అవతలపార్టీవాళ్లు సంఘంలోవున్న అంతస్థులను బట్టి మెదలకుండా వూరుకుండి వుంటారు అనుకున్నారు కొందరు. ఏమైతేనేం, పెళ్లి వుతే సలక్షణంగానే జరిగిపోయింది. అందులో పెళ్లవంగానే ఆవూరు మకా మెత్తి వెళ్లిపోయారు. దాంతో వేడంతా చల్లారిపోయింది. అయితే, వృద్ధులిద్దరు కోడలు యింట్లోకి రావాలి అని మళ్లీ ఒక పట్టు పట్టారు. మూర్తి తన మొండితనాన్ని బలాన్ని, ధైర్యాన్ని ప్రదర్శించుకున్నాడు. కాని ఆత్మహత్య చేసుకుంటామని బెదిరించేటప్పటికి, తల్లిదండ్రుల మాట వినక తప్పిందికాదు; జయ కాపరానికి వచ్చినప్పటినుంచి, మూర్తి అదోవిధంగా వుండటం మొదలుపెట్టాడు. కొత్తగా భార్య కాపరానికి వచ్చినప్పుడు, భర్తకు వుండాలసిన లక్షణాలేవీ, మూర్తిలో కనిపించలా. ఉన్న వూరవుతే ఆ స్నేహితుడని యీ స్నేహితుడని అటూ ఇటూ అల్లరిచిల్లరిగా తిరుగుతూ వుంటే, వూరుమార్చారు. ఊరు మార్చారు గాని, మూర్తి బుద్ధిమార్చగలిగారు. దీపం ముందర కునుకుపడుతూ జయమ్మ కూర్చుంటే, ఏ పన్నెండింటికో, ఏ ఒంటిగంటకో తలుపు తట్టుకుని దక్కొస్తాడు లోపలికి. 'ఏమండీ యింత ఆలస్యమయింది' అని కొత్తలో అడిగింది కాని, రోజూ వున్న అలవాటుకు యేమని అడుగుతుంది. ఎంతో విసుగ్గా వస్తాడు. అన్నం తిన్నవాడు తింటాడు. లేనివాడు లేదు. 'అబ్బ! నా ప్రాణం విసిగించక కాసేపు పడుకోనీ' అంటూ జయను విదిలించికొడుతూవుంటాడు. చప్పున జడలో పూలదండలాగి విసిరికొట్టి, తనదిండు తాను తీసుకుని దూరంగా వెళ్ళి పడుకుంటుంది బాగా కోపం వచ్చినప్పుడు. ఒక్కొక్కప్పుడు యెంతసేపో బతిమాలుతుంది. 'ఈ వయస్సులో మనకు పిల్లలేమిటి! ఓపద్దేళ్ళదాకా మనకు పిల్లలు కలగకూడదు' అని ఒకసారి ఎగతాళి క్రింద అనేటప్పటికి జయ ఆనాడు అన్నం ముట్టలేదు. నిద్రపోలేదు. రాతి ముడుచుకుని కూర్చుంది. దగ్గర వెళ్లి బతిమాలుదామనుకుంటే, కత్తికక్కుతుందేమో నని భయం. అసలు మాట్లాడక పోతే, మనస్సొప్పటం లేదు. చాలాసేపు తికమకపడి యేదో విధంగా నచ్చచెప్పటానికి ప్రయత్నం చేశాడు. జయ, ఎంత సేపటికి, ఏ పిల్ల కనిపించినా చప్పున చంకలోకి తీసుకొని ముద్దుపెట్టుకొని తన మురిపాన్ని చెల్లించుకుంటుంది. మూర్తి చూస్తే మాత్రం

టీచర్: "నీవు రేపు మాఇంటికి వచ్చితివి" — అనే వాక్యం రైటా, తప్పా?
విద్యార్థి: తప్పండి.
టీచర్: ఎందుచేత?
విద్యార్థి: మీ ఇల్లెక్కడో నాకు తెలియదుకదండి?

* * *

యజమాని: (నౌకరుతో) మన ఇంట్లో దొంగలు పడితే ఏం చేస్తావురా?
నౌకరు: అయ్యా! కిటికీలోనుండి దూకి పారిపోతానండి.

—గవ్వ కన్నారావు, విజయనగరం.


హెచ్చరిక!
మీబిడ్డ జలుబు ప్రమాదకరంగావచ్చు!
జలుబు ముదిరి, ప్రమాదకరమైన వ్యాధి రింపకముందే మూ పైన పూత మందుతో జలుబు బాధలు నివారించుకోండి:
జలుబును 2 విధాల నివారిస్తుంది!

1 ముక్కు ద్వారా పనిచేస్తుంది.
2 చర్మం ద్వారా పని చేస్తుంది.


విక్స్ వేపోరబ్
రొమ్ము, గొంతు వీపులపై రుద్దండి!

చిటచిటలాడిపోతాడు. తన మొహాన్ని ఎక్కడ చూస్తుందో అని తప్పించుక వెడతాడు. రోజు రోజుకు యింట్లో పోరు యెక్కువయిపోతోంది. చిట్టచివరకు మూర్తి మానసికంగానూ, శారీరకంగాను జయకు లొంగిపోవాలసివచ్చింది.

జయ గర్భవతి అయినప్పటినుంచి, క్రింద నిలవటంలేదు. అప్పటికప్పుడే బొమ్మలని, చిన్న చిన్న చొక్కాలని, యేమేమిటో తెమ్మంటూనే వుంది. చిన్న చిన్న వస్తువులు యేవి చూసినా, ఆమె సంతోషానికి అంతు లేదు. ఎప్పుడు తన పాపను చేతుల్లోకి యెత్తుకుంటానా అంటూ యెదురుచూస్తున్నట్లు ఆ ముహూర్తంకోసం నిరీక్షిస్తోంది. ఆమె చేష్టలు రోజురోజూ మూర్తికి ఆశ్చర్యాన్ని కలిగిస్తున్నాయి. లోకంలో తనభార్యే బిడ్డను కనబోతోందా, లేక బిడ్డను కనబోయేవాళ్ళందరు మొదట యిట్లాగే వుంటారా అని అనుకుంటూ వుంటాడు. ఏమయితేనేం ఆ ఘడియ రానే వచ్చింది. పిల్ల పుట్టటం అయింది, చావటమూ అయింది. ఈవిషయం జయకు తెలుస్తే, ఆమెను పట్టగలమా! దుఃఖాన్ని ఆపుకోగలదా? ఆ ఆవేశంలో యేమి చేస్తుందో ఎవరూ వూహించలేరు. అయితే డాకరు ఆలోచనగా తలవూపింది. కారణం యేమయివుంటుంది? ఎంత డాక్టరయితే మాత్రం, పోయిన ప్రాణాన్ని తీసుకు రాగలదా? ఇంకా జయకు కొన్నాళ్లపాటు స్పృహ రాకుండా వుంటే బాగుండును. ఇదే మాలోచన! జయ త్వరగా కోలుకోవాలి. ముందర యీ గండం గడిచే దెట్లా? ఈ కబురు యేవిధంగా చెప్పటం! ఎవరిపిల్లనైనా తీసుకువస్తే! ఏతల్లి వూరుకుంటుంది. తనపిల్లను ఇచ్చెయ్యటానికి! బుర్ర వేడెక్కిపోతోంది. మూర్తికి ఎటూఆలోచన పోవటం లేదు.

ఒకటి రెండుసార్లు తొంగిచూశాడు గదిలోకి. ఆమెగారు యింకా యేమిటో చూస్తూనే వుంది. వెళ్లి పిలుద్దామనుకున్నాడు. లోపల అయిదారుగు రున్నారు. వాళ్లెవ్వరికీ తన ఆదుర్దా తెలియటం యిష్టంలేదు. టైము చూసుకొంటున్నాడు. ఈలోపల జయకు స్పృహవచ్చి, నా బిడ్డ యెక్కడంటే యేమని చెప్పటం! తెగించి లోపలకు వెళ్ళాడు. డాక్టరు కుర్చీలో లేదు. 'లోపలకు వెళ్లారు. ఇప్పుడే వస్తారు. కూర్చోండి' అన్నాడు అందులో ఒకడు. గత్యంతరంలేక అక్కడే కూర్చున్నాడు. టైము నడిచిపోతోంది కాని, ఆమెగారు లోపల్నుంచి రానేరావటంలేదు. తాను సాహసించి లోపలకు వెళ్ళే పరిస్థితి కాదు. ఉక్కిరి బిక్కిరయిపోతున్నాడు. ఆమెగారు ఎప్పుడు వస్తుందా అని కళ్ళు విప్పుకుని చూస్తున్నాడు. గభాలున తలుపు తెరుచుకుని రానేవచ్చింది. చప్పున లేచి నిలబడ్డాడు. ఆమె సంజ్ఞచేసింది. చక్రున ప్రక్కగదిలోకి యిద్దరూ వెళ్లారు.

'ముందర ప్రమాణం చెయ్యండి, ఎవరితోనూ చెప్పనని...' డాక్టరు గంభీరంగా మూర్తి మొహంలోకి చూసింది.

ఏమిటని అడిగే ఆలోచన లేకుండా 'అట్లాగే' అన్నాడు.

'మీ జయకు ఏమీ ప్రమాదంలేదు. పైగా బిడ్డకూడా బ్రతికేవుంటుంది...' ఆమె చెప్పటంలో కొంచెం ఆలస్యం చేసింది.

'మరి ఆ పిల్ల చచ్చిపోలేదన్నమాట!...' ఆదుర్దాగా అడిగాడు.

'ఆ పిల్ల పుట్టంగానే చచ్చిపోయింది... కాని...నీకొక రహస్యం చెబుతాను. దానికే నిన్ను ప్రమాణం చెయ్యమన్నది. పట్నంనుంచి ఒక అమ్మాయి మా ఆసుపత్రిలో చేరింది. పెళ్ళి కాలేదు. అయితే పిల్లను కన్నది. ఇది ఒక రహస్యం. గొప్పింటివాళ్ళమ్మాయి, కాలు జారింది. తన వూళ్ళో తెలిసిపోతుందని అక్కడా యిక్కడా కాలక్షేపం చేస్తోంది. పెద్ద చదువుకని బొంబాయి వెళ్ళిందని చెప్పించారుట. ఇక్కడేమో నాదగ్గర వాగ్దానం తీసుకుని ఆసుపత్రిలో చేరింది. నేను ఒప్పుకున్నాను. పుట్టినపిల్ల విషయమై నేను చూసుకుంటానని. ఆమె ఆడపిల్లనే కన్నది.


ఉత్సాహ పూరితమైన
రెమి
స్నో పౌడర్
Remy
BORATED TALCUM POWDER
Remy SNOW
Aykan

"ఇష్టపై విరుందు"—ప్రతిశుక్రవారము రేడియో సిలోన్ 41 72 మీటర్లమీద సాయంత్రం 6-30 నుండి 6-45 వరకు విని ఆనందించండి.

 అభావాలు 

ఆ రాత్రినుంచి నా ఆలోచనలకు అంతు లేకుండా వున్నది. మా యిద్దరికీ తప్ప యీ రహస్యము యింకొక్కళ్లకు తెలీదు...ఇంకా నేను విపులంగా చెప్పక్కర్లేదనుకుంటా...' ఆమె గారు తీవ్రంగా మూర్తి మొహంలోకి చూసింది.

మూర్తికి గుక్క తిప్పుకునేటట్లు లేదు. ఆ క్షణాన ఏమాలోచించాలో తోచటం లేదు. చప్పున తల వూపాడు — చేతుల్లో పాపాయిని పెట్టుకుని, డాక్టరు జయ మంచం దగ్గరకు వస్తుంటే, నర్సు ఆశ్చర్యపోయింది. డాక్టరు కనుసంజ్ఞ చేసింది నర్సును చూసి. మూర్తి లోపలికి వచ్చేటప్పటికి, నర్సు తలెత్తి చూడలేకపోయింది. అతను గ్రహించాడు. జయకు స్పృహవచ్చే టైము కూడా అవుతోంది. మెల్లిగా ప్రక్కలో కదిలింది. మూర్తి సంతోషానికి అంతులేదు; కళ్లు బలవంతాన తెరుచుకుంది. జయకు తెలివి వచ్చింది. ఎదురుగా భర్త కనిపించాడు. సిగ్గుతో కళ్ళుమూసుకుంది. అటూ యిటూ చూసుకుంటూ వత్తిగిలింది. పక్కలో పాప చేతులు కాళ్లు కదులుతున్నాయి. జయ సంతోషం పట్టలేకపోయింది. పాపకళ్లల్లోకి చూసి, మురిసిపోయింది. ఆనందబాష్పాలు వచ్చినాయి. వళ్ళు పులకరించింది. గుండె దడదడ కొట్టుకుంది. ఎంతో భిడియం వేసింది నలుగురు చూస్తుండగా పాపను దగ్గరకు తీసుకోవటానికి. మూర్తి కొంచెం దూరంగా వుండి చేతులు బారజాచాడు, పాపను యివ్వమంటున్నట్టు. జయ పెద్ద నిట్టూర్పు విడిచింది.

పాపను చూసి, అచ్చగా తల్లి పోలికని కొందరు, అమ్మక్క, అకన్నా, అచ్చు తండ్రే, ఆడపిల్లకు తండ్రిపోలికవస్తే మంచిదంటారని కొందరు అనుకుంటున్నారు. అన్నీ విని వూరుకుంటున్నాడు మూర్తి. జయ మెల్లిగా కోలుకుంటోంది. డాక్టరు కూడా వస్తున్నది. 'మేమిచ్చే మందుల కవుతే యింత త్వరగా ఆరోగ్యం చేకూరేది కాదని 'అవును ఆమెకంత గాఢమైన ప్రేమ సంతానం అంటే అందుకనే నేను భయపడింది.' అన్నాడు మూర్తి.

'అమ్మయ్య గండం గడిచిందనుకున్నారు' డాక్టరూ, మూర్తి. 'ఒక్క వుపాయంతో రెండు సమస్యలు పరిష్కృతమయినా'యని యిద్దరూ సంతోషపడ్డారు.

'ఇక యింటికి తీసుకెళ్ళచ్చు' అని డాక్టరు చెప్పింది. మూర్తి సన్నాహాలు చేసుకున్నాడు యింటికి తీసుకు పోవటానికి. ఆ సాయంత్రమే ప్రయాణం. మూర్తి ఆసుపత్రికి వచ్చేటప్పటికి బాగా చీకటిపడింది. వచ్చి గుమ్మంముందు నిలబడేటప్పటికి లోపలగా గుసగుసలు వినిపిస్తున్నాయి. చప్పున ఆగాడు. ఏమిటో వినిపిస్తున్నాయన్న మాటేగాని, ఏమీ అర్థంకావటంలేదు. అయితే డాక్టరు గొంతుక మాత్రం గుర్తుపట్ట కలిగాడు. చప్పున తలుపు తెరుచుకొని డాక్టరు బైటకువచ్చింది. అటూ యిటూ పరీక్షగా చూసింది. మూర్తి తలుపు చాటున వదిగాడు. ఇక్కడ రెవ్వరూ లేరని గట్టిగా నమ్మకంఏర్పడింది. డాక్టరు సంజ్ఞ చేసింది. గదిలోంచి ఇరవై యేళ్ళలోపు నవ యౌవనవతి, కంపిస్తూ అతిభయంగా తొందర తొందరగా వచ్చేస్తోంది. ఎలెక్ట్రిక్ లైట్ల ముందర సరోజిని మొహం స్పష్టంగా కనిపించింది మూర్తికి. వెన్ను మీద కొట్టినటయింది. ఉలికిపడ్డాడు. శరీరం అంతా వేడెక్కిపోయింది. కళ్ళు మూసుకుపోయినాయి. రెండుక్షణాల్లో తెప్పరిల్లాడు. అప్పటికి డాక్టరు వాకిట్లోంచి తనగదిలోకి వస్తోంది. మూర్తిని చూసి, ఆమె ఒక్కడుగు వెనక్కు వేసింది. చప్పున తమాయించుకుని ఎప్పుడు వచ్చారు అన్నది. మూర్తి ఏమీ మాట్లాడ లేదు. ఏమిటి అట్లా చూస్తున్నారు అన్నది ఆవేశంగా. అప్పటికీ అతను సమాధానం చెప్పలేదు రెండుక్షణాలు అట్లాగే నిలబడి 'ఆ అమ్మాయి ఎవ్వరూ' అన్నాడు మూర్తి.

'నేను మీకు చెప్పిన అమ్మాయే! ఇవ్వాళే వాళ్ళవూరు వెళ్ళిపోతోంది. మిమ్మల్ని చూపిస్తానన్నా కూడా "నేను ఎవ్వరినీ చూడను. నేను యిక్కడవున్నట్లు ఎవ్వరికీ తెలియకూడదు. వారికి కృతజ్ఞతలు చెప్పండి. నేనుచేసిన తప్పుకు పసిపిల్ల ఏవిధమైనబాధ అనుభవించకూడదు. వాళ్ళు తీసుకొన్న తర్వాత, వాళ్ళ పిల్లమాదిరిగానే పెంచుతారని అనుకుని వెళ్ళిపోతున్నాను. అంతకంటె నేను చెప్పేది లేదు...నేనేమి చెప్పలేను" అంటూ వెళ్ళిపోయింది సరోజిని...మా పిల్ల చచ్చిపోయినా... కళ్ళు తుడుచుకుంటూ, గద్గదస్వరంతో డాక్టరు ఏదో అనబోయింది.

అమాంతంగా మూర్తి, రెండుచేతులు మొహాన కప్పుకొని, 'నాపిల చచ్చిపోలేదు ...నాకూతురు బ్రతికేవుంది...నా కూతురు బ్రతికేవుంది.' గొణుక్కుంటూ చకచక గదిలోకి నడిచాడు. ★

[ఉదయం]

మేష్టరు : అరే, రేపట్నుంచీ ఆలస్యంగా వచ్చేవంటే ఎముక లిరగకొడతా......

[ఆ సాయంత్రం]

మే : ఏరా? మళ్ళీ ఆలస్యంగా వచ్చావ్? డొక్క చీల్చేస్తానన్నానా?

కుర్రాడు : రేపట్నుంచి అన్నారు కదండీ మరి......

—కె. గోకుల్ చంద్, విజయవాడ.


శ్రేష్ఠమైనవి...
సావరిన్
మిఠాయీలు, టాఫీలు
దేశమంతటా ఆదరించబడినవి.



# భూమి గుండ్రంగా ఉంది

[నాటిక]

## మధిర భానుమూర్తి

**ఇందలి పాత్రలు:**

| | |
|---|---|
| కరణం | సుబ్బయ్యకొడుకు |
| కామరాజు | కూరమ్మ |
| లచ్చయ్య | సుబ్బమ్మ |
| సుబ్బయ్య | నరసమ్మ |
| శారిగాడు | వెంకమ్మ |

కరణం : అయితే, ఇది విన్నావా బావా!

కామరాజు : ఏదయ్యా?

కరణం : అదే! మన సుబ్బయ్య కూతురు లేదూ?

కామరాజు : ఎందుకు లేదు! నిక్షేపంలా ఉంది!

కరణం : ఆ అమ్మాయి పెళ్ళిమాట!

కామరాజు : ఓ! ఆ మాటా!...అది ఇప్పుడు వినటమేం? ఇదివరకే విన్నాను.

కరణం : అయితే నేనేనా ఏమిటి ఆఖరున విన్నది?...సా...రి!...మీ అందరికీ ఎప్పుడు తెలిసిందయ్యా?

లచ్చయ్య : అదేమిటయ్యా! కరణం గారూ!-అన్నీ విడ్డూరంగానే చెప్తావ్!... సుబ్బయ్య కూతురు పెళ్ళికథ నీకు తెలియదంటే ఎవరు నమ్ముతారు?...ఆ విషయం ఈ ఊళ్ళో ఆ బాలగోపాలానికీ తెలిస్తే నీకేనా తెలియనిది?

కామరాజు : అయినా, మమ్మల్ని టోకరా కొట్టించాలనిగాని, ఈ ఊళ్ళో నీకు తెలియని సంగతు లుంటాయా!

కరణం : మీరు నమ్మటం లేదుగాని, నిజంగా చెప్తున్నాను... నేను ఈ మాట నిన్ననే విన్నాను. ఏ ఒట్టు బడితే ఆ ఒట్టూ?

కామ : ఈ మాత్రానికి ఒట్లూ,సత్యాలూ ఎందుకులే?...

కరణం : మరి మీరు నమ్మకపోతే ఏం చెయ్యను? మీ కిదివరకే తెలిసిందేమోగాని, నాకు నిన్న రాత్రివరకూ తెలియదు. ఆమాట విని చాలా ఆశ్చర్యపోయాను. ఇందులో ఆశ్చర్యపడవలసింది ఉందని కాదుగాని, చెప్పొద్దూ! ఆ అమ్మాయికి పెళ్లికుదిరిందంటే నేను చాలాసేపటివరకూ నమ్మలేక పోయాననుకో!

కామ: (ఖంగారుగా)...ఆఁ!...ఏమిటి?

లచ్చయ్య : (ఆశ్చర్యంగా)...పెళ్ళా!... ఎవరికి?

కరణం : అవును...సుబ్బయ్య కూతురికి పెళ్లి కుదిరిందట:

కామ : నిజంగా?...

కరణం : నిజమే! అదేం? అలా ఖంగారు పడతారేం?

లచ్చయ్య : పెళ్ళి కుదిరిందా?

కరణం : అంత ఆశ్చర్యపడుతున్నారేం?. పెళ్లి కుదిరింది. నిజమే!

కామ : ఎవరికయ్యా! వివరంగా చెప్పూ.. మమ్మల్ని చంపుకు తినక!

కరణం : చెప్పేందుకేముంది? మన సుబ్బయ్యకూతురు కామాక్షికి.

కామ: కామాక్షికే? నీకు బాగా తెలుసా?

కరణం : నన్ను అడుగుతారేం?...మీకు నాకంటె ముందే తెలిసిందన్నారుగా?

లచ్చయ్య : బాగుంది! ఇది మాకేం తెలుసు? ఆ అమ్మాయికి ఏ సంబంధమూ నచ్చటంలేదని, అందుచేత ఇక పెళ్ళియే అవకాశం లేదని నలుగురూ అనుకుంటున్నారని తెలుసు...అంతే గాని, ఆ అమ్మాయికి పెళ్లి కుదిరిందన్నమాట మాకేం తెలుసు?

కామ : కరణం బావగారూ? (కొంచెం గంభీరంగా) ఇది ఎన్ని పెళ్ళు?

కరణం : ఏం?

కామ : అబ్బే! అసలు ఎన్నని?

కరణం : నాలుగు.

కామ : ఇప్పుడో!

కరణం : మూడు!...... అలా అడుగుతున్నావేం?

కామ : అబ్బే! నువ్వు మెలకువగా ఉన్నావో, నిద్రపోతున్నావో నని!

కరణం : అదేమిటయ్యోయ్! పట్టపగలు, రచ్చబండమీద కూచున్న నాకు నిద్రపోయే ఖర్మ మేమిటి?

కామ : మరి కాకపోతే ఏమిటయ్యా?- నువ్వనేమాట?... సుబ్బయ్య కూతురు కామాక్షికి పెళ్ళా? ఇదెవరేనా నమ్మే సంగతేనా?

కరణం : ఓ! అదా! కథ!... నాకు మాత్రం ఏం తెలుసు? నిన్న విన్నాను... నమ్మకం కుదరలేదు. అంచేతే మిమ్మల్ని అడిగాను-మీ కేమైనా తెలుసేమో నని!

లచ్చయ్య : మాకు మాత్రమేం తెలుసు? నువ్వంటే వినటమే... ఇంతవరకూ మాట మాత్రంగానైనా వినలేదు.

కామ : కాని, ఇది నిజమే అయినట్టయితే, చాలా వింతగానే ఉంది.

లచ్చయ్య : వింతా? మరీ వింతా?... నిన్న కాక మొన్ననేగా – నాకు సుబ్బయ్య కనిపించి, పెళ్ళెక్కడా కుదరలేదని చెప్పి, కంట తడిపెట్టుకున్నాడు.

కామ : అంతేనా? నన్ను సంబంధాలేవేనా ఉంటే చూడమనలేదూ?

కరణం: ఈ కథ లన్నీ నేను మాత్రం ఎరగనూ? అందుకనేగా నేనూ నమ్మలేక పోతున్నది!

కామ : దానికేంగాని, ఇదే గనుక నిజమయితే సుబ్బయ్య ధన్యుడే!

లచ్చయ్య : ఆ! ఈ కార్యం కాస్తా అయిపోతే గట్టెక్కుతాడు!...పాపం!... చాలా యాతనలు పడ్డాడు.

కరణం : యాతనా? ఇంకా యాతనా? అందులోనూ అలాంటి పిల్లకి పెళ్ళిచెయ్యటమంటే మరీ కష్టం!

కామ : అయినా, ఒక్కమాట చెప్తాను విను బావా?— (కొంచెం గొంతు తగ్గించి) ఏ వయస్సుకి ఆదయితేనే అందమూ, చందమూను.

లచ్చయ్య : అవుననుకో కాని అతనేం చేస్తాడు?

కరణం : ఏంచేస్తా డేమిటి? ఇంట్లో కంటి కెదురుగా ఉన్న మేనల్లుడిని వదులుకుని పై సంబంధాలకని ఎగబడకూడదు.

లచ్చయ్య : ఏదో సామ్యం చెప్పినట్టుగా ఉంది! అంతా అతనిచేతుల్లోనే ఉన్నట్టు చెప్తావేం?... ఆ పిల్ల ఘటికురాలు! ఎన్నివిధాల చెప్పినా వినిపించుకుంటేనా?

కామ: అందుకే చిన్నపిల్ల లప్పుడే పెళ్ళి చేసెయ్యాలని అంటాను పెద్దయాక పెళ్ళి చెయ్యటం – అందులోనూ ఇప్పటికాలపు పిల్లలకి – మరీ కష్ట మనుకో?

లచ్చయ్య : అవుననుకో! కాని, అతని

## ★ భూమి గుండ్రంగా ఉంది ★

మాటప్రకారం జరగొద్దూ?– మన చాదస్తం గాని!...

సారిగాడు: దండాలండి బాబయ్యా!

కరణం: ఎవరది?... ఓరి!... నువ్వా? ఇదుగోనయ్యా! సమయానికి సుబ్బయ్య పాలేరు సారిగాడు వచ్చాడు...వాడినడిగితే ఇట్టే తెలుస్తుంది... ఒరే! సారిగా! ఏమిట్రా హడావుడిగా ఉన్నట్టున్నావ్?

సారి: హడావుడికాక మరేంటి బాబూ? రేపులేదు ఎల్లుండి పెళ్ళండి! ఈ రేత్తిరికి రేత్తిరి, పందిళ్ళు అవ్వీ తయారవాలని అయ్యగోరు ఘటిగా సెప్పేరండి! ఇదుగో! ఆ హడావుడిలోనే ఉన్నాంబాబూ!

కామ: అవునుగాని, పెళ్ళెవరికిరా?

వాడి: మా అయ్యగోరి అమ్మాయిగారు లేరండీ కామాచ్చమ్మగోరు!...ఆరికి!...

లచ్చయ్య: కామాక్షమ్మకే?...ఎప్పుడు కుదిరిందిరా?

సారి: అయ్యన్నీ నా కెవరు సెప్తారండి? అయ్యగోరు నిన్న ఊరెల్లారు ... ఇయ్యేల వస్తూనే పెళ్ళికుదిరిందని. ఎల్లుండే లగమని అన్నారండి!...అంతే. ఇక మాకు పనిమీద పని! తీరికలేదండి!

కరణం: అవున్రా...మరి...ఇంతకీ పెళ్ళికొడుకెవరు? కట్నం కానుకలేమిటి? వాళ్ళదే ఊరు...ఆఁ!...అవేమీ చెప్పవేం?

సారి: ఏమోనండి నాకా ఇవరాలు తెలవ్వండి!...మరి నాకు సెలవిప్పిత్తే...

కామ: సరెలే! పో...

సారి: సిత్తం దండాలండి!

కరణం: అదయ్యా! కథ! విన్నాంగా!

కామ: ఆఁ! ఇంక అనుమానం లేదు. నిజమేనన్నమాట!

లచ్చయ్య: ఇంకా అన్నమాటేమిటి?... అసలు కరణం చెవుల్లో పడ్డమాటకి అబద్ధం కూడానా?

కరణం: ఇంతకీ సంబంధం ఎవరో తెలిసిందికాదు!

లచ్చయ్య: నీకు అదెంతపని? తలుచుకున్నావంటే క్షణంలో లాగెయ్యవూ?

కామ: అయినా అంత తొందరగా ముంచుకున్న పళాన్న చెయ్యవలసిన అవసరమేమొచ్చిందో!

లచ్చయ్య: అదే అంతుచిక్కటంలేదు... ఇది కూడా నువ్వే తెలుసుకోవాలి!

కరణం: ఇదుగో! ఇప్పుడే వెళ్ళి తేల్చుకువస్తాను...

## 2

[నీలాటిరేవులో నలుగురు ఆడవాళ్ళూ చేరి]

సూరమ్మ: సుబ్బమ్మా! విన్నావా? వాళ్ళ కామాక్షికి పెళ్ళిటా...

సుబ్బమ్మ: మరేనుటా! నేనూ ఇప్పుడిప్పుడే విన్నాను.

వెంకమ్మ: అప్పుడే ఇది మీదాకా కూడా వచ్చిందీ?

వరసమ్మ: అదేమిటమ్మా! ఊరందరికీ తెలియగాలేనిది, ఇక మాకేనా తెలియనిది?

వెంకమ్మ: అది కాదులే! నాతో చెప్పినావిడ "ఇది రహస్యంట! ఎవరితోనూ చెప్పొద్దు!" అందిలే...అందుకని!

సూరమ్మ: మాకూ అలాగే చెప్పారు!

సుబ్బమ్మ: పోనీలెండి! మనమూ రహస్యంగానే ఉంచుదాం!

వరసమ్మ: ఏమిటో! చాదస్తంగాని, ఇవి దాగుతాయా?... పైగా, ఏనాటి కామాక్షమ్మ?...ఎప్పుడవవలసిన పెళ్ళి?

వెంకమ్మ: అందుకే కళ్యాణఘడియ రావాలంటారు.

వరసమ్మ: వచ్చేవరకే! తీరా వచ్చాక ఏముంది? కాళ్ళల్లో నిప్పులు పోసుకు పనులు చెయ్యాలి!

సుబ్బమ్మ: అయినా ఇదేం విడ్డూరమమ్మా బొత్తిగా వ్యవధి లేకుండాను!... నిన్న ఊరునుంచి వచ్చాట్ట! — రేపు పెళ్ళి అంటాడుట! ఆసుబ్బయ్యకేనా కాస్త కష్టం, సుఖం తెలియక్కర్లేదూ? తన కెంత తోస్తే అంతేనా?

వెంకమ్మ: ఏంచేస్తాడు? సంబంధాలకోసం తిరిగి తిరిగి విసుగెత్తి ఉన్నాడు. అంచేత ఎప్పుడయిపోతుందా?-అని ఉన్నాడు.

సుబ్బమ్మ: అనకూడదు గాని, నే నొక్కమాట చెప్తాను వినండి—ఆడపిల్లకి మరీ అంత స్వేచ్ఛ ఇవ్వకూడదు.

సూరమ్మ: ఆఁ!...నీపిచ్చిగాని...అతను స్వేచ్ఛ ఇచ్చేదేమిటమ్మా? ఆతల్లి ప్రోత్సాహమే అంతాను!—

వరసమ్మ: ఎలాగయితేనేం? అవస్థలు మాత్రం ఆయనగారు పడ్డాడు.

సుబ్బమ్మ: ఆబాధ ఆతల్లీకూతుళ్ళకేమైనా ఉంటేనా?

సూరమ్మ: ఇది బాగుంది! వాళ్ళకలాంటి బాధే ఉంటే నిక్షేపంలాంటి సంబంధం—మేనరికం—ఎందుకు వదులుకుంటారు?

వెంకమ్మ: అకుర్రాడు బాగా స్థితిగలున్నవాడేటగా?...

సుబ్బమ్మ: ఆఁ! స్వంతఇల్లు, పదెకరాల పొలం ఉంది...ఉంటేనేం? మరీ పెద్దచదువు కాదుట! అందుకని వీరికి నచ్చలేదు.

వెంకమ్మ: తెలివితక్కువే! అలాంటి సంబంధం వదులుకోకూడదు...చదువు లేం కూడు పెడతాయా? గుడ్డ పెడతాయా? ఈ రోజుల్లో ఇంత భూవసతివున్న సంబంధం మంచిది.

సూరమ్మ: తెలివితక్కువతనం అనకు! పొగరుమోతుతనం అను!...పైగా అంటుందీ "ఆకుర్రాడు ఆపల్లెటూళ్ళో వ్యవసాయం చేసుకుంటూ కూచుంటే మా కామాక్షి అక్కడ ఉండలేదు...కాస్త బస్తీఅయినా కాకపోతే ఎలాగ?..." అని—

సుబ్బమ్మ: ఎన్ని పోకులని?...ఏజిల్లా కలెక్టరో అల్లుడుగా రావాల నుంది ఆవిడకి... మరి అంత అదృష్టం పడుతుందో, పట్టదో గాని!...

వరసమ్మ: ఈపిల—కామాక్షి—ఎంతటిదనుకున్నావ్?...తండ్రి అనేకవిధాల నచ్చచెప్పబోతే-వాడి నేగనక పెళ్ళిచేస్తే ఉరిపోసుకునో, నూతులో దిగో చస్తానంటూ దేవుడిపటం పుచ్చుకు ప్రమాణం చేసిందట కూడాను!...పాపం! ఆయనేం చెయ్యగలడు?

సూరమ్మ: పోన్లెద్దూ! ఆతల్లి, కూతురూ అలాగ అనటమే మంచిదయింది. లేకపోతే ఆకుర్రాడి మెడకి ఈమహాతల్లి గుదిబండయి కూచునేది!

సుబ్బమ్మ: ఆమాట నిజమేలే.

వరసమ్మ: అదికాదు! ఈ చోద్యం చూశారా? వాడికి చదువు చాలదన్నారా?- పోనీ అని సుబ్బయ్య నానాయాతనలూ పడి ఎమ్మే ప్యాసయిన కుర్రాడిని తెస్తే, ఆ కుర్రాడు నల్లగా ఉన్నాడన్నారుట.

సుబ్బమ్మ: అయ్యో! గీరువాణానికి ఏమీ లోటులేదు. మా ఊరు సంబంధమే ఒకటి తీసుకువచ్చాడు-ఆ మధ్యన...కుర్రాడు బాగానే చదువుకున్నాడు...నెలకు మూడు వందలకుపైగా సంపాదిస్తున్నాడు...అన్నీ బాగున్నాయా?...కను ముక్కుతీరు బాగుండలేదని వెటకారం చేశారు...

వెంకమ్మ: అయితే ఈవిడకి ఏమన్మథుడో రావాల్సిందే!

వరసమ్మ: ఈవిడ రతీదేవి కాదుమరీ?

సుబ్బమ్మ: మగవాడన్నవాడినల్లా తీసుకువచ్చాడు. కాని ఎవ్వడూ వాళ్ళకి నచ్చలేదు.

వెంకమ్మ: అయితే ఈ పెళ్ళికొడుకుని చూడవలసిందే! ఎంత అందగాడో, ఏమిటో?...

శ్రీకాఫ్
దగ్గు, ఉబ్బసములకు
దివ్యౌషధము
శ్రీవత్స కెమికల్స్ & డ్రగ్స్
లిమిటెడ్, మదరాసు-30

సూరమ్మ: అసలు ఒక సంవత్సరంనుంచి విసుగెత్తి సంబంధాలు వెతకటం మానుకున్నాడు సుబ్బయ్య...మరి ఇంత హఠాత్తుగా ఎలా కుదిరిందో?

సుబ్బమ్మ: అసలు ఈసంబంధం ఎవరమ్మా

సూరమ్మ: ఏమో! నాకు మాత్రం ఏం తెలుసు?

వరసమ్మ: అదే తెలియటం లేదు—ఎంత ఆచూకీ తీసినాగాని...మా ఇంట్లో నిన్నటి నుంచి చూస్తున్నారు ఈ విషయం తెలుసుకోవాలని...ఏమీ తెలియటం లేదు...

సూరమ్మ: మీ వారికే తెలియకపోతే ఇంకెవరికి తెలుస్తుంది?

సుబ్బమ్మ: కరణంగారికి కూడా తెలియలేదంటే వింత కాదూ మరి?

వరసమ్మ: కాని, ఈవిషయంలో మాత్రం మంచి గుట్టుగా ఉన్నారు.

సూరమ్మ: ఉండనీ! ఈ గుట్టు మాత్రం ఇంకెంత సేపు......రేపు ఈపాటికి పెళ్ళి అవదా? పెళ్ళికొడుకుని చూడమా?...ఇప్పుడంటే దాచారుగాని, అప్పుడేం దాస్తారు? ...అదే తెలుస్తుంది!

సుబ్బమ్మ: అదీ అవసరమేలే! పాపం! చాలా రోజులుగా సంబంధాలు కుదరలేదా? అంచేత, ఎలాగో కుదిరిన ఈ సంబంధం పెళ్ళయిందనిపించేవరకూ కాస్త రహస్యంగా ఉంచటం మంచిదే!

వెంకమ్మ: అసలు ఇంత తొందరగా ముహూర్తం పెట్టుకు రావటంలో కూడా ఆంతర్యం అదే అయి ఉంటుంది. ఎలాగో ఒక లాగు పిల్ల, తల్లీ ఒప్పుకున్నాక వెంటనే పెళ్ళి చేసెయ్యకపోతే, ఏ క్షణాన్నయినా ఆతల్లీ, కూతుళ్ళ మనస్సులు మారవచ్చని సుబ్బయ్యకి భయమయి ఉంటుంది!

సూరమ్మ: అదీ నిజమే లే! వాళ్ళు ఎంత కేసా తగినవాళ్ళ!

## 3

కామరాజు: ఏం!—లచ్చయ్యా! సుబ్బయ్య ఇంట్లో పెళ్ళికి పిలుపువచ్చిందా?

లచ్చయ్య: అదేమిటయ్యోయ్!—కామరాజా! పిలుపు కూడా రాకుండా ఉండాలీ?

కామ: అంటే పిలుపు రాదని కాదు... నువ్వు వెడుతున్నావా? అని!

లచ్చయ్య: ఏం? నువ్వు రావా?

కామ: రాకేం? నలుగురం కలిసి వెళ్ళొచ్చుగదా అని అడిగాను.

లచ్చయ్య: నేనూ అందుకే ఆగాను. కరణంగారు కూడా వస్తానన్నాడు.

కామ: అయితే ఇంతకీ పెళ్ళికొడుకు మాట ఏమయినా...

లచ్చయ్య: అదే అంతు చిక్కటంలేదు. అక్కడికీ సుబ్బయ్యని అడిగాను.

కామ: ఏం? వెనకటి సుబ్బయ్యే ననుకుంటున్నావా?—చాలా మారిపోయాడు... నేనూ అడిగాను...ఆమాట ఒక్కటీ తప్పించి [illegible] మాట్లాడుతున్నాడు.

లచ్చయ్య: నా దగ్గర కూడా అలాగే చేశాడు.

కామ: పోనీలే! ఇప్పుడిక తొందరెందుకు? ఇంక కాస్సేపట్లో పెళ్ళిపందిట్లో ఎలాగూ తేలుస్తుంది!....అడుగో కరణం! రావయ్యా! రా!

కరణం: ఆ!...వచ్చేశా! మీ రిద్దరూ సిద్ధంగానే ఉన్నారే?

లచ్చయ్య: నీ రాక కోసం ఎదురు చూస్తూ కూచున్నామనుకో!

కరణం: ఇక్కడికనే బయలుదేరుతున్నాను. ఇంతలోకి ఎవరో వచ్చారు. అంచేత కాస్త ఆలస్య మయింది.

లచ్చయ్య: అయితేనేం? ఫరవాలేదు! ఇంక ఆలస్యం చెయ్యకండి!..సుముహూర్తం దగ్గర పడుతోంది.

కరణం: ఇంక ఆలస్యమేముంది?... పదండి!...

## 4

[పెళ్ళిపందిరిలో స్పష్టాస్పష్టంగా మాటలు, మంగళవాద్యాలు, వివాహ మంత్రోచ్చారణ]

సుబ్బయ్య: రండి! రండి! ఆఁ! కరణం గారూ! వచ్చారా? బాగుంది!...రండి కామరాజు గారూ?...ఏం లచ్చయ్యా? నువ్వు ఇంత ఆలస్యంగానా రావటం?... ఒరే! పెద్దాడా?...వీరందరికీ కాఫీ, ఫలహారం ఇప్పించు-లోపలకి తీసుకెళ్ళి...

ఒక గొంతు: (దూరాన్నుంచి) ఆఁ!... (తరువాత దగిరగా) రండి! లోపలకి రండి-ఇలాగ!...

కరణం: అబ్బే! ఎందుకండీ! అవన్నీను!.. ఇప్పుడు ఇంటిదగ్గరనుంచేగా-వస్తూంటా?...

సుబ్బయ్య: ఆఁ! ఏకులు వేస్తే బుట్ట చిరిగిందా ఏమిటి? పరవాలేదు లెండి!

కామ: ఉండండి! వరుణ్ణి చూసి...

లచ్చయ్య: అరె! ఈ అబ్బాయిని ఎక్కడో చూసినట్టుందే?...

కరణం: ఓ!...ఈ అబ్బాయి...మీ... మేనల్లుడు కాదూ?

సుబ్బయ్య: అవునండీ!...వాడే!... ఏదో మీ అందరి ఆశీర్వచనంవల్లా అయిందనిపించేస్తున్నాను...మరి నేను అలాగ వెళ్ళిరానా?

కరణం: అయ్యో! తప్పకుండాను! మీరు మాతో కూచుంటే ఎలాగ?

సుబ్బయ్య: మీరు కాఫీ, ఫలహారం పుచ్చుకోవాలి సుమండీ!

లచ్చయ్య: ఓ! తప్పకుండాను! అందులోనూ కరణం అసలు వదలడు.

[నలుగురూ నవ్వుతారు]

కరణం: [కొంచెం గొంతు తగ్గించి] అవునుగాని, ఇదేమిటయ్యా! ఈ సంబంధం ఎలా కుదిరిందంటావ్?

కామ: మరి వెనక ఈ అబ్బాయికిస్తానంటేనేగా—ప్రాణత్యాగం చేస్తానంది—ఈ పెళ్ళికూతురు?

లచ్చయ్య: ఆఁ!...ఆ అబ్బాయే ఈ అబ్బాయి!

కామ: మరి ఇప్పుడో?...

లచ్చయ్య: ఇప్పుడేముంది? నిక్షేపంలాగ వాడినే పెళ్ళాడుతోంది.

కరణం: పిల్ల ఇష్టపడిందంటావా?

లచ్చయ్య: ఇంకా నీ వెర్రి నీకు వదలలేదన్న మాట! ఇష్టపడక ఏం చేస్తుందయ్యా? ఇంకా గొప్పవాడిని పెళ్ళాడాలని మొదట్లో వీడిని కాదంది!...ఎన్నో సంబంధాలు చూస్తే ఏ ఒక్కటీ నచ్చక పోగా, చివరకి పెళ్ళియేయోగమే కనిపించలేదు కాబోలు!.. ఏం చేస్తుంది? చివరకి వీడినే పెళ్ళాడేందుకు ఒప్పుకుని ఉంటుంది!...

కామ: అందుకే రహస్యంగా ఉంచి ఉంటారు!

కరణం: అయితే, తిరిగి, తిరిగి బయలు దేరిన చోటికే వచ్చిందన్న మాట!

లచ్చయ్య: మరి భూమి గుండ్రంగా ఉంది కాదూ?

కరణం: మహా బాగా చెప్పావులే!

[అందరూ నవ్వుతారు]




లల్లూరాం అండ్ కంపెనీ
(స్థాపితము 1928.)
ఎన్నో సంవత్సరాలుగా మన్నికకు, నాణ్యతకు, సరసమైన ధరలకు ప్రసిద్ధి చెందిన
* ఇనుప పెట్టెలు * ఉక్కు బీరువాలు * క్యాషు బాక్సులు
లల్లూరాం అండ్ కో,
వెలగలేటివారి వీధి, విజయవాడ - 1.
క్రొత్త షోరూమ్: మారుతిసినిమా ఎదురుగా.
మద్రాసు బ్రాంచి: 2/156, బ్రాడ్వే, మద్రాసు-1.
NVKR VJA




# "హాస్యరచయిత మరణించాడు"

రచన — తురగా కృష్ణమోహన్‌రావు

ఒక చిన్న ఉపోద్ఘాతం: ఈ కథ పేరు 'హాస్యరచయిత మరణించాడు.' నిజంగా మరణించలేదు. అంతా ఉట్టుట్టిదే. కథ గదా మరి!

కథ: నాకీ కథ ఎలా ప్రారంభించాలో అర్థం కావడంలేదు. ఈ కథంతా విన్న తరువాత మీరు బహుశః ఇది కథే కాదని అంటారేమో! అసలు నాకు కథలు రాయడం చేతకాదు. కాని ఈ రోజుల్లో ప్రతివాడూ కథ రాసేవాడే! ఆ పక్కింటి అబ్బాయిని గురించి సగం కథ, ఈ పక్కింటి అమ్మాయిని గురించి సగంకథ తీసుకొని; సగం జరిగింది, సగం జరగంది కథలల్లేస్తున్నారు మన వాళ్ళందరూ. నాలో అసూయ, బ్రద్దలకానికి సిద్ధంగా ఉన్న అగ్నిపర్వతంలోలా రగిలింది. నేను కూడా కథ రాయాలని నిశ్చయించుకొన్నాను. కథ రాయాలని కూచుంటే, బుర్ర కాజుయల్ లీవుకి దరఖాస్తు పెడుతుందని మీకు తెలుసు. అందుకని ఆంధ్రదేశపు రచయితల అడుగుజాడలను అనుసరించి, మా పక్కింటి అబ్బాయిని గురించి సగంకథ, అటు పక్కింటి అమ్మాయిని గురించి సగం కథ తీసుకొని; జరిగింది సగం, జరగంది సగం కలిపి కథ రాసేశాను. అంతా విని, మీరు ఇది కథ కాదంటే, నేను చేయగలిగింది ఏమీ లేదు. మీరు ఇది కథ అని అంగీకరిస్తే మాత్రం, వినండి, ఈ కథాంతంలో నా కథానాయకుడు విషం తిని చనిపోయాడు. ఇది కథే కనక అయితే, విషాదాంత కథ ఔతుంది.

నేనిక్కడికి విచారభారంతో క్రుంగిపోతూ వచ్చాను. కారణం — ప్రఖ్యాత హాస్యరచయిత, యువకుడు, నటుడు, ముందు ఇంకా వృద్ధిలోనికి రావలసినవాడు కృష్ణమోహనరావు, ఈ నాళ్ - అంటే డిసెంబరు 22 వ తేదీ-మధ్యాహ్నం రెండు గంటలకు విషం తీసుకొని మరణించాడు. అతను చనిపోయేవరకు నేను అతనితోనే ఉన్నాను. బ్రతికున్నరోజుల్లో అతనికళ్ళు బారెడేసి ఉండేవి. నిజానికి అతను విషం తిని చనిపోడానికి తగినంత కారణమేమీ లేదు. ఈ ప్రపంచంలో అతనికంటె ఎక్కువ కష్టాలు పడ్డవాళ్ళున్నారు. ఆ సంగతి నాకూ తెలుసు, అతనికీ తెలుసు. 'నేను హాస్యంగా బ్రతుకుతున్నాను కనుక ఎన్నడో హాస్యంగానే, కారణంలేకుండానే, చనిపోతాను' అంటూండేవాడు నాతో. నేనీమాటలు హాస్యానికి అంటున్నాడు అనుకొన్నాను కాని, నిజంగానే అంటున్నాడని ఆఖరి క్షణంవరకు గ్రహించలేకపోయాను. 'హాస్యరచయితలో హాస్యం మరణిస్తే, హాస్యరచయిత మరణించినట్టే!' అనేవాడు నాతో. అందువల్ల తనలో హాస్యం మరణించకముందే ఈ లోకం వీడిపోతాననేవాడు. ఏమైతేనేం? ప్రఖ్యాత హాస్యరచయిత మరణించాడు. అతనికళ్ళు బారెడేసి ఉండేవి. నేను విచారభారంతో క్రుంగిపోతున్నాను. కథగా మీరు అంగీకరిస్తే, విషాదాంత కథ ఔతుంది ఇది: నేనూ తృప్తిగా కళ్ళు మూస్తాను.

కృష్ణమోహన్‌రావు మా ఇంటి పక్కనే ఉండేవాడు. అతను విషం పుచ్చుకొనే ముందు నాతో చెప్పి మరీ పుచ్చుకొన్నాడు. నే నతన్ని నిలదీసి అడిగాను: 'ఇంతకీ నువ్వు ఇప్పుడు చచ్చిపోడం దేనికి?' అని. 'చచ్చిపోడం అందరికీ తప్పనిసరి! హాస్యరచయితైనా ఎప్పుడో అప్పుడు గుటుక్కుమనవలసిందే! అదంతా సరే— ఇప్పుడు నువ్వు చచ్చిపోడందేనికి?' అని అడిగాను. 'అదంతా ఓ పెద్దగాథలే!' అన్నాడు ఓ నిట్టూర్పువిడిచి. నాకు వళ్ళు మండుకొచ్చింది; నాలుగు తిట్లు తిట్టాను. 'మహా చెప్పావులేవోయ్. చచ్చేదేమిటో ఊరికే చస్తున్నావా? నాలుగు పుస్తకాలు రాసిపడేసి చస్తున్నావ్. ఎవడికైనా నీ జీవిత చరిత్ర రాయాలని బుద్ధి పుట్టిందనుకో. ఎవడికో ఏమిటి? నాకే బుద్ధి పుడుతుంది రేపు. ఈ వివరాలన్నీ ఎక్కడ వెతుక్కోమంటావ్? ఎందుకు చస్తున్నావో చెప్పి మరీ చచ్చిపో!' అని దబాయించాను. అతను దీనంగా మొహం పెట్టాడు. పెట్టి, 'ఆ పక్కింటి అమ్మాయి లేదూ? శారద! ఆమె రేడియోలో పాట పాడింది. అదీ కారణం!' అన్నాడు. హాస్యరచయితలకు

మెదడు కొద్దిగా తక్కువుంటుందని మీకు తెలుసు. (మామూలు రచయితలైతే చాలా తక్కువుంటుంది) నేను మోహన్‌రావుని గట్టిగా కేకలేశాను. 'ఇంకా నయమే! ముందుగా చెప్పావ్?' అన్నాను. 'అనవసరంగా ఆత్మహత్య చేసుకొన్నావా? మందో వనకో ఎప్పుడో అప్పుడు పోలీసువాళ్ళు అరెస్టుచేస్తారు!' అని బెదిరించాను. 'అమ్మ బాబోయ్! నిజమేనా?' అన్నాడు. మొత్తమ్మీద భయపడ్డాడు పెద్దమనిషి. అతని చేతులోంచి విషం సీసా తీసుకొని బల్లమీద పెట్టాను. సీసాకి గట్టిగా బిరడా పెట్టాను. కథ చెప్పమన్నాను. చెప్పాడు. శాంతంగా కథ విన్నాక నే, సీసా అతనికి తిరిగిఇచ్చాను. అతను మరణించాడు. నేను విచారభారంతో కృంగిపోయి ఇలా వచ్చాను. నాకు చాలా బాధగా ఉంది: అతని కళ్ళు చారెడేసి ఉండేవి.

మా ఇంటికి ఇటుపక్క కృష్ణమోహన్‌రావు వాళ్ళు ఉండేవారు. అతను హాస్యరచయితే కాదు; పత్రికావిలేఖరి కూడా. సాధారణంగా పత్రికా విలేఖరులకి తెలిసిన విషయాలు తక్కువ. తెలియదని ఒప్పుకొనే విషయాలు మరీ తక్కువ. ప్రతీ విషయాన్ని గురించి ప్రశ్న వేస్తారు. ప్రతీ విషయాన్ని గురించి మాట్లాడతారు. ఈ బుద్ధే కృష్ణమోహన్‌రావు కొంపతీసింది చివరికి.

మా ఇంటికి అటుపక్క శారదమ్మ ఉంటుంది. మనిషి బాగుంటుంది. చాలా బాగా పాడుతుంది. హైదరాబాదు రేడియోలో చాలాసార్లు పాడింది. ఇదుగో ఆమెకున్న ఈ పాడుబుద్ధే కృష్ణమోహన్‌రావు కొంప తీసింది చివరికి!

ఉన్నవాళ్లు ఉన్నట్టుండక, ఆలిండియా రేడియోవాళ్లు శారదమ్మని పాటపాడమని పిలిచారు – సరిగ్గా రెణ్నెల్లక్రితం, అక్టోబరు 22 వ తేదీన. ఆమె పాడింది. పాడింది గదా అని నాలుగు డబ్బులు చేతిలో పడితే ఏమైంది చెప్పండి. వాళ్లో పెద్ద చెక్కు రాసిచ్చారు. చెక్కులు తెచ్చిపెట్టే చిక్కులకు లెక్కలేదు నిజానికి. ఆమె కనక రేడియోలో పాడనంటే; పోనీ పాడినా, వాళ్లు చెక్కు రాసియ్యకపోతే, కృష్ణమోహన్‌రావు కీ చిక్కులొచ్చిపడేవి కాదు. 'మీ అబ్బాయిచేత ఇది కాస్త మార్పించి పెడతారా?" అందిట ఆవిడ. అడిగిందే చాలనుకొని, తటాలున చెక్కు తీసుకొని, సంతకం పెట్టి, పక్క జేబులో పెట్టుకొన్నాడు మన వాడు. అందులోనూ లాల్చీ పక్క జేబులో, 'పత్రికా విలేఖరి దగ్గర డబ్బెవరు కొట్టేస్తారులే?' అని ధైర్యం కాబోలు – ఆ చెక్కు, కొంత డబ్బు కలిపి పక్క జేబులో పెట్టుకొన్నాడు. పెట్టుకొని, సముద్రంలా పొంగి పొరలుతున్న జనం మధ్య మునిగితేలి, బస్సు ఎక్కాడు చిక్కడపల్లి దగ్గర.

ఆ జనంలో బస్సు ఎక్కడం ఒక చిన్న యుద్ధం చేసినంత పని. చెప్పుకోతగ్గ గాయాలేమీ తగలకుండానే బస్సు ఎక్కాడు అతను. బస్సు కదిలింది. బస్సు కదలగానే జ్ఞాపకం వచ్చింది హఠాత్తుగా తన జేబులో డబ్బు ఉన్న సంగతి. కుడిజేబులోకి చెయ్యి పోనిచ్చి చూసుకున్నాడు.

నెలకు ఇన్ని కేసులు పట్టుకోవాలని పోలీసువాళ్లకి ఒక రూలు ఉందిట. అలాగే నెలకు ఇన్ని జేబులు కొట్టేయాలని దొంగాళ్లకి ఒక రూలు ఉండి ఉండచ్చు. నెలాఖరు వరకూ ఊరుకొని, హఠాత్తుగా ఒక అరడజను కేసులు పట్టుకొని, పోలీసువాళ్లు డయరీలు నింపుకొంటారట. దొంగలు సాధారణంగా జాగ్రత్తపరులు! నెల మొదట్లోనే ఒక అరడజను జేబులు కొట్టేసి తమ జేబులు నింపుకొంటారు. లేకపోతే, దొంగల సమాజంలో వాళ్ల పేరుప్రతిష్ఠలు నిలవ్వు. ఈ సంగతి మనకు ముందే తెలుసు. అందుకని మొదటివారంలో చాలా జాగ్రత్తగా ఉంటాం – మన జేబులో డబ్బున్నా, లేకపోయినా. డబ్బుంటే పోవచ్చు. డబ్బు లేకున్నా జేబే పోవచ్చు. డబ్బు లేనప్పుడు పోయిన జేబును కుట్టించుకోడానికి డబ్బెక్కడ్నించి వస్తుంది?

నేను చెప్పిన సంఘటన వారంరోజుల క్రితం డిసెంబరు 16 వ తేదీన జరిగింది. మన కథానాయకుడు, కృష్ణమోహనరావు, బస్సు ఎక్కేటప్పుడే జేబులు సరిగా చూసుకోవలసింది. చూసుకోలేదు. బస్సు ఎక్కిన తర్వాత జ్ఞాపకం వచ్చింది. అప్పటికే బస్సు దీపక్‌మహల్ బస్‌స్టాండువద్దకు వచ్చేసింది. జనం చాలమంది దిగిపోయారు. కృష్ణమోహన్‌రావు జేబులు తడిమి చూసుకొన్నాడు. అతను జేబులో పెటుకొన్న ఎనభై రూపాయల డబ్బు, డబ్భైఅయిదు రూపాయల చెక్కు–భద్రంగా ఉన్నాయి!

కృష్ణమోహన్‌రావు చిక్కడపల్లి బస్సుస్టాండువద్ద నిలబడ్డప్పుడే–దీపక్ మహల్ స్టాండువద్ద మరో వ్యక్తి విచారాన్ని సూచించే ముఖంతో నిలబడిఉన్నాడు. చార్‌మినార్ సిగరెట్టు కాలుస్తున్నాడు కాని సిగరెట్టుమీదలేదు దృష్టి అతనిది. బస్సుకోసం నిలబడ్డ ఇద్దరు ముగ్గురు వ్యక్తుల వైపు సాభిప్రాయంగా చూస్తున్నాడు. అతడు జేబుదొంగ: సందేహంలేదు: రావణాసురుడి తలకాయల్లా అతని కోటుకి పేంటుకి షర్టుకి ఎక్కడచూసినా జేబులే! అతనలా విచారంగా చూస్తూండగానే బస్సు వచ్చేసింది. బస్సులోంచి తుఫానులా దిగారు జనం, మన మిత్రుడు–జేబుదొంగ అని మనం నిశ్చయం చేసుకొన్న మిత్రుడు–జనాన్ని దూసుకొని బస్సులోకి ఎక్కబోయాడు. 'జేబులు జాగ్రత్త బాబూ!' అన్నాడు కండక్టరు దిగేవాళ్ళ నుద్దేశించి (కండక్టర్లు సర్వజ్ఞులు: వాళ్ళకన్నీ తెలుసు. వాళ్ళకి జేబుదొంగ లందరూ కంఠతః వచ్చు.) అందరూ జేబులు తడుముకొన్నారు. మన మిత్రుడు కూడా తడుముకొన్నాడు. కృష్ణమోహన్‌రావు కూడా తడుముకొన్నాడు, బస్సులో నిలబడి జేబులోంచి డబ్బు పైకితీసి చూసుకొన్నాడు; తృప్తిగా మళ్ళీ జేబులో పెట్టుకొన్నాడు. బస్సు కదిలింది. కథానాయకుడు ఆనాటి పేపరు తీసి తలపంకిస్తూ చదవడం ప్రారంభించాడు.

ఆ తరువాత కథ ఎలా చెప్పాలో నాకు అర్థం కావడంలేదు. మనమిత్రుడు బస్సులో ప్రవేశించడం, పుత్లీబావుడీవరకు టిక్కెట్టు తీసుకోడం, కథానాయకుడి వద్దకు వచ్చి 'జరా హటియే!' అని పక్కన కూచోడం, తరువాత పుత్లీబావుడే రాకుండానే కాచిగూడా చౌరస్తాదగ్గరే దిగిపోడం—ఇవన్నీ చెప్పకుండా వదిలేస్తేనే మంచిదేమో! నాకు కథలు రాయడం చేతకాదు. అందులోనూ విచారభారంతో క్రుంగిపోయి ఉన్నాను. ఇదంతా ఎలా చెప్పాలో అర్థం కావడంలేదు. చివర్ని ఏం జరిగిందో మీరు గ్రహించే ఉంటారు.

మన మిత్రుడు కాచీగూడా చౌరస్తా దగ్గర బస్సుదిగిపోయాడు. అతను బస్సు దిగుతూంటే, మరోమిత్రుడు బస్సెక్కాడు.

చరిత్రాధ్యాపకులు: ఓరేకృష్ణా నీకు తెలిసినమట్టుకి ఇపుడు యుద్ధము ఎవరెవరికి జరుగుతోంది.? ఎవరికి జయము రావచ్చు?

కృష్ణ: ఒకగంట క్రితము ఇంటివద్ద మా అమ్మకు, మా నాన్నకి యుద్ధము జరుగుతూవుందండి. మాఅమ్మకు అప్పడాలకఱ్ఱ, చీపురుకట్ట, రోకలి, మొదలయిన ఆయుధాలు వుండుటచేత మా అమ్మకే జయము రావచ్చునండి.

—గవ్వా కన్నారావు, విజయనగరం

# "హాస్యరచయిత మరణించాడు"

బస్సెక్కి, ఇతన్ని చూసి వెనక్కి తిరిగి నవ్వాడు. ఇద్దరూ స్నేహితులయ్యుండాలి.

కండక్టరు కృష్ణమోహన్‌రావు దగ్గరకు వచ్చాడు. 'మీ దగ్గర ఏమైనా డబ్బుందా? పోయిందా?' అన్నాడు. కృష్ణమోహన్‌రావు చటుక్కున జేబు తడుముకున్నాడు. డబ్బుపోయింది. 'ఉంది; లేదు' అన్నాడు అదోలా మొహంపెట్టి. కండక్టరు ఒక నవ్వు నవ్వాడు. 'వాడో జేబుదొంగ లెండి. నాకు తెలుసు. అందుకనే అడిగాను' అన్నాడు. అని వెళ్ళి బెల్లు నొక్కాడు. నొక్కగానే బస్సు కదిలింది.

'ఉంది; లేదు' అనడంలో కృష్ణమోహన్‌రావు ఉద్దేశం: 'డబ్బు అసలు ఉంది కాని, ఇప్పుడు లేదు' అని. 'డబ్బు ఉంది; పోలేదు' అని ఇతనన్నాడని అతి ననుకొన్నాడు. అను కొని. నవ్వి, వెళ్ళి బెల్లునొక్కాడు. నొక్కగానే బస్సుకదిలింది.

కృష్ణమోహన్‌రావు మహానటుడే కావచ్చు! అతను నాటకీయంగా 'హా! చచ్చితి చచ్చితి. ఇప్పుడేమి చేతు! కటకటా! దైవమా! హాత విధీ! నాకేలరా దుర్గతి తెచ్చిపెట్టితివి? నా ధనమంతయు పోయెనే?' అని అరిచినట్లయితే, కండక్టరు బెలునొక్కేవాడు కాదు. అతను ఒకటోరకం అమెచ్యూర్ వేదాంతిలా మొహంపెట్టాడు. పెట్టేసరికి, డబ్బు పోలేదు కాబోలనుకున్నాడు కండక్టరు. జీవితంలో ఉపయోగపడని నటనవల్ల ప్రయోజనంఏమిటి చెప్పండి!

కృష్ణమోహన్‌రావు కండక్టరుదగ్గరకు వెళ్ళి, 'బస్సు ఆపు!' అన్నాడు. 'ఏం?' అన్నాడు కండక్టరు. 'డబ్బుపోయింది' అన్నాడు మన వాడు. 'మరి-ఇందాకా చెప్పలేదేం?' అన్నాడు కండక్టరు. అంటూనే బెల్లు నొక్కాడు. బస్సు ఆగింది. 'ఎంత?' అన్నాడు ఒక ప్యాసింజరు. 'ఎప్పుడు?' అన్నాడు మరో ప్యాసింజరు. 'ఏమిటి?' అని అడిగింది ఒక లేడీ ప్యాసెంజరు. 'డబ్బు పోయిందట!' అంది మరో లేడీ ప్యాసెంజరు. 'ఎంతట?' అంది మూడో లేడీ ప్యాసింజరు. 'పేసెంజరతో మాట్లాడుతూ, బస్సు ఆపుతావేమిటి?' అని గదమాయించాడు డ్రైవరు. 'ఇంతకూ ఎవరు కొట్టేశారు?' అని అడిగాడు ఒక లాయరు, ఆకావాదిలా మొహంపెట్టి 'దొంగాట' అంది, ఆయన పెళ్ళాం కాబోలు, మెరుస్తున్న కళ్ళతో, 'హరి నీ ఇల్లు బంగారంకాను!...ఉత్తి గద్దరోజులమ్మా ఇవి.' అంది అవిడ అత్తగారి లాంటావిడ ఒకావిడ.

'బస్సుపోనియ్యి!' అన్నాడు కృష్ణమోహనరావు, క్లుప్తంగా, కండక్టరుతో.

ప్రథమ పురుషలో కథ చెప్పేటప్పుడు తనకు తెలియడానికి వీలులేని విషయాలను గురించి చెప్పకూడదని ఏదో పుస్తకంలో చదివాను. కాని ఆ విషయాలనుగురించి చెప్పకపోతే ఇప్పుడు కథ నడువదు. ఐనా మీరు అందరూ నా స్నేహితులే కాబట్టి చెప్పేస్తాను.

మనమిత్రుడు-జేబుదొంగ-బస్సు దిగానే మొదట చేసినపని ఒక రిక్షాపిలిచి కాచిగూడా స్టేషనుకి పోవడం. అసలు అతను చాలా మంచివాడు. తను దొంగలసమాజానికి ప్రెసిడెంటు కాబట్టి, అప్పుడప్పుడు దొంగతనం చేయకపోతే సమాజంలో అప్రతిష్ఠ అని కాకపోతే - అతని కది కుతరామూ ఇష్టం లేదు.

బస్సులో అతనికి ఒక మూర్ఖుడు డబ్బు లెక్కచూసుకొంటూ కనపడ్డాడు. (మూర్ఖుడు-ఎవరో తెలుసుగా?) ఎందుకైనా మంచిదని అతని జేబులో చెయ్యిపెట్టాడు పక్కన కూచొని. ఐదురూపాయలకట్ట చేతికొస్తే అది తన జేబులోకి బదిలీచేశాడు. 'అదృష్టవంతుణ్ణి ఈవాళ' అనుకొంటూ రిక్షా ఎక్కి కాచిగూడా వచ్చేశాడు. వచ్చి తీరా జేబుచూసుకొనేసరికి ఐదురూపాయల కట్ట మాయమైంది. 'ఏమా?' అని ఆలోచించేసరికి తను బస్సు దిగేటప్పుడు బస్సు ఎక్కిన పెద్దమనిషి జ్ఞాపకం వచ్చాడు. మనసు చివుక్కుమంది అతనికి. పోలీసువాళ్ళకి రిపోర్టు చేద్దామా? అనుకున్నాడు. అయినా డబ్బుపోతే మళ్ళీ దొరుకుతుందా ఏమిటి అనుకొని మాట్లాడకూరుకొన్నాడు. డబ్బుపోగా చెక్కు మిగిలింది. చెక్కుమీద సంతకం పెట్టే ఉంది. కాని చెక్కు పట్టుకెళ్ళి బేంకులో ఇస్తే పోలీసులు తపిమని పట్టుకొంటారని తెలుసు. 'చింపేద్దామా?' అనుకొన్నాడు. కాని ఒక నిముషం ఆగి ఆలోచించాడు. పరధ్యానంగా జేబు రుమాలు తీసి చెక్కును అటూ ఇటూ తుడిచాడు. అల వాట్లన్నీ ఎక్కడికి పోతాయి?

ఈలోగా బస్సు కోఠీవద్ద ఆగింది. కృష్ణమోహన్‌రావు కూడా దిగిపోయాడు. దిగిపోతూ, ఎందుకైనా మంచిదని 'ఆ దొంగాణ్ని ఆనమాలు పట్టగలవా?' అని అడిగాడు కండక్టర్ని, 'ఎల్లాళ్ళయినా గుర్తుపడతా' నన్నాడు కండక్టరు. కృష్ణమోహన్ 'నీపేరు చెప్పు-పోలీసులకి రిపోర్టు చేస్తాను' అన్నాడు. కండక్టరు ఇతన్ని మింగేసేటట్టు చూస్తూ, పళ్ళు పటపట కొరికాడు. పేరడిగితే ఎవరికైనా కోపం వస్తుంది. అందులో ఎవడో కొత్తవాణ్ణి పిలిచి, 'నీపేరు చెప్పు, పోలీసువాళ్ళకి రిపోర్టు చేస్తా!' అంటే ఎందుకు చెబుతాడు? 'నాయనా, నీపేరు చెప్పు. నీసహాయం కావాలి నాకు. దొంగాణ్ణి పట్టుకోవాలి' అంటే చెప్పేవాడు. బహుశః కండక్టరు కళ్ళెర్రచేసి చూస్తూనే, బెల్లు నొక్కేశాడు. బస్సు కదిలిపోయింది. 'క్యా హోగయా?' అంటూమూగారు రిక్షావాళ్ళందరూ రిక్షా జన సహజ కుతూహలంతో. కృష్ణమోహన్‌రావుకి అక్కడే ఉరిపోసుకు చచ్చిపోదామని బుద్ధిపుట్టిందిట. కాని తాడు దొరక్క ఊరుకొన్నాట్ట.

కృష్ణమోహన్‌రావు పత్రికా విలేఖరి




## మేము మీ అదృష్టం చెప్పగలము

నీ భవిష్యత్తులో ఏమి జరుగబోవునదిన్నీ, నీ సరియైన చర్యనుగురించిన్నీ నీవు తెలుసుకొనగోరినట్లయితే ఒక పోస్టు కార్డుపైన నీకు యిష్టమగు ఒక పుష్పము పేరున్నూ, నీవు వ్రాయు తేదీ, వేళ వివరములున్నూ, నీ సరియైన చిరునామాయున్నూ వెంటనే వ్రాసి పంపుము.

జ్యోతిష శాస్త్రములోని రహస్య గణితము మూలముగా మేము గుణించి, నీవు కార్డు వ్రాసిన తేదీ లగాయతు 12 మాసములలోను నీయొక్క అదృష్టము, లాభనష్టములు, జీవితమార్గము, ఏ వ్యవహారములో నీకు జయము కలుగునో, నీ ఉద్యోగం విషయంలో మంచిచెడ్డలు, మార్పులు, ఆరోగ్యవిషయము, పరదేశగమనము, తీర్థయాత్రలు, వివాహము, స్త్రీసుఖము, సంతానము, నిధినిక్షేపములు, లాటరీ, అకస్మాద్రవ్యలాభము మొదలగు వానినిగురించి స్పష్టముగా మాసవారీగా వ్రాసి రు. 1-4-0 లకు మాత్రము వి. పి. గా పంపగలము. (వి. పి. చార్జిలు ప్రత్యేకం) దుష్టగ్రహము లేవయినా వున్న యెడల శాంతిచేయు విధానంకూడా తెలుపగలము. వివరములు మా పూచీపైన పంపబడును. మేము పంపిన భోగట్టా మీకు తృప్తిగా నుండనియెడల సైకము వాపసు చేయబడును. ఒకసారి పరీక్షించి చూడుడు. మీ అడ్రసు ఇంగ్లీషులో వ్రాయండి.

Pt. DevDutt Shastri, Raj Jyotishi (WP-13) Jullundur City.

కాకపోతే చాలా బాగుండేది. అసలు శారదమ్మ రేడియోలో పాడకుండా ఉంటే, చాలా బాగుండేది. ఆమె పాడినా, రేడియో వాళ్లు చెక్కు ఇవ్వకుండా, దబ్బిస్తే చాలా బాగుండేది. మన కథానాయకుడు చనిపోయే వాడు కాదు. శారదమ్మ రేడియోలో పాడింది. ప్రఖ్యాత హాస్య రచయిత మరణించాడు. నేను విచారభారంతో క్రుంగిపోతున్నారు.

మోహన్‌రావు పత్రికా విలేఖరి కాకపోతే, అతనికి పోలీసులకి రిపోర్టుచేయాలని బుద్ధిపుట్టేదికాదు. కాని అతనికి అలా బుద్ధి పుట్టింది. పోలీసు వాళ్ళకి మెదడు కొద్దిగా తక్కువిస్తాడు భగవంతుడు అని లోకంలో ఒక ప్రతీతి ఉంది. ఇది చాలా అన్యాయమేమో? ఎవడు పోలీసువాడౌతాడో, ఎవడు కాడో, ఎంత భగవంతుడైతే మాత్రం, ఎలా తెలుస్తుంది భగవంతుడికి ముందు? అసలు పోలీసు వాళ్ళని ఎన్నుకొనేముందే, మెదడు తక్కువ వాళ్ళని ఎన్నుకొంటారని కొందరు అంటారు. దొంగకనక వెనక్కి తిరిగితే, తటాలున మీదపడి పట్టుకొని కట్టేయగలిగిన వారిని సబిన్‌స్పెక్టర్లుగా ఎన్నుకొంటారని కూడా అంటారు. ఇదంతా ఉత్తి అతిశయోక్తి అనుకొంటాను. కృష్ణమోహన్‌రావు పోలీసులకి రిపోర్టుచేశాడు. 'డబ్బా! పోయిందా? అప్పుడే ఖర్చుపెట్టేసుంటాడు' అన్నాడు సబిన్‌స్పెక్టరు. చెక్కుకూడా పోయిందని చెప్పాడు ఇతను. 'చెక్కు కూడానా? అప్పుడే మార్చేసుంటాడు' అన్నాడు సబిన్‌స్పెకర్. 'బేంకువాళ్ళకి ఫోన్ చెయ్యవయ్యా!' అన్నాడు మనవాడు. 'ఫోనుకేం? చేస్తాను. కాని ఏం లాభంలేదు' అన్నాడు సబిన్‌స్పెక్టరు, తలకాయ అడ్డంగా తిప్పడానికి ప్రయత్నంచేస్తూ.

పోలీసు సేషన్‌నుంచి బయటకు రాగానే, ఆత్మహత్య చేసుకుందామనుకున్నాట కృష్ణమోహన్‌రావు. 'నీ తుపాకీ ఓసారి ఇస్తావా ఆత్మహత్య చేసుకు మళ్ళీ ఇచ్చేస్తాను' అంటే ఇవ్వనన్నాట పోలీసువాడు.

దొంగాడు చాలా మంచివాడని చెప్పాను. ఇంకోడయితే, చింపి అవతల పారేశేవాడు. మంచివాడు కాబట్టి ఒక కవరులో పెట్టి సెంట్రల్ బేంకుకి పంపించాడు. చెక్కు చెదరకుండా వచ్చింది చెక్కు; వస్తూనే తెచ్చిపెట్టింది చిక్కు. దాన్ని ఏంచేయాలో తెలియలేదు గుమాస్తాకి. ఆఫీసరు గారికి కూడా తెలియలేదు. అందుకని ఆయన గుమస్తాని గటిగా కొప్పడ్డాట! తీరా హైదరాబాదు స్టేటుబేంకుకి పంపిస్తే ఆ ఆఫీసరుకి కూడా తెలియలేదుట ఏంచేయాలో. గుమాస్తాకి కూడా తెలియలేదుట అందుకని ఆ ఆఫీసరు గారు ఈ ఆఫీసరుగారిని టెలిఫోనులో పిలిచి తిట్టారట. అక్కడి గుమాస్తా ఇక్కడి గుమాస్తా కొరకొరా చూశాట్ట. ఆలిండియా రేడియోవాళ్ళని టెలిఫోనులో పిలిచి "ఏమంటారు?" అని అడిగితే, వాళ్ళు దొంగాణ్ణి ఒక్కణ్ణే మినహాయించి, మిగిలిన వారి నందరినీ పేరు పేరున తిట్టారట. ఈ పరిస్థితుల్లో ఏంచేయాలో కృష్ణమోహన్‌కి తెలియలేదు. ఆత్మహత్య చేసుకుందామని నిశ్చయించుకున్నాడు. 'నీదగ్గర కాస్త కత్తి ఉంటే ఇస్తావా? మళ్లీ ఇచ్చేస్తాను చచ్చిపోయిన తర్వాత' అని ఎదురుగా ఉన్న బేంకు గుమాస్తా నడిగాడు. అతగాడు కళ్లెర్ర చేసి చూసి, 'చాలు చాలే! బ్రతికి ఉద్ధరించావు! చచ్చి సాధిస్తావు కాబోలు!' అన్నాడు; అని బల్లమీద ఉన్న బ్లేడుతీసి డ్రాయర్లో పడేసుకొన్నాడు.

పత్రికా విలేఖర్లు అప్పుడప్పుడు చచ్చిపోతూనే ఉంటారు కాని, బ్రతికున్నప్పుడు బ్రతికే ఉంటారు. అందుకని దొంగాణ్ని పట్టుకొనే ప్రయత్నం మానలేదు మనవాడు.

ఎట్టకేలకు చెక్కు చిక్కింది అతని చేతికి. 'ఎలా చిక్కింది?' అని అడక్కండి: ఇది బేంకింగ్ సీక్రెట్! మీరూ నేనూ అయితే, చెక్కు చిక్కితే రిక్షాఎక్కి బేంకుకి పరుగెడతాం. కాని మోహన్‌రావు పత్రికా విలేఖరి అన్న సంగతి మనం మరిచిపోకూడదు. చెక్కుమీద వేలుముద్రలేమైనా ఉన్నాయేమో చూడడానికి పోలీసు స్టేషన్‌కి పయనమైనాడు. కళ్ళద్దాల నుంచి భూతద్దాలవరకు అన్నీ పెట్టుకు పరిశీలించారట అందరూ కలిసి. చెక్కుమీద జేబుదొంగ వేలుముద్ర దొరకలేదు. కాని కృష్ణమోహన్‌రావువి, వాళ్లమ్మగారివి, వాళ్లింట్లో అవ్వపిల్లవి, శారదమ్మవి, వాళ్ల అవ్వపిల్లవి, పాతికో పరకో బేంకు గుమాస్తాలవి కనపడ్డాయి. 'వీళ్లందరినీ లాకప్‌లో పెట్టేస్తేనో?' అని మృదువుగా సూచించాడు సహృదయుడు సబిన స్పెక్టరు.

ఆత్మహత్య చేసుకుందామన్న నిశ్చయం దృఢమైంది రావుకి. 'మీదగ్గర కత్రా కత్తీ ఏమైనా ఉంటే ఇస్తారా? మళ్ళీ ఇచ్చేస్తాను మరిచిపోకుండా' అన్నాట అతను. 'మళ్లా మాటాడితే అరెస్టు చేస్తాను'. అన్నాడు సబిన స్పెక్టరు.

కృష్ణమోహన్‌రావు చెక్కు తీసుకొని స్టేటుబేంకుకి వెళ్ళాడు. 'ఏమిటి?' అన్నాట్ట గుమాస్తా. 'చెక్కు' అన్నాట్ట ఇతను. అతను ఇతనివైపు జాలిగాను, చెక్కువైపు తీవ్రంగా చూశాట్ట. 'నాయనా! వెళిపో! ఎందుకు చెబుతున్నానో వెళ్ళిపో. చేతకాని దొంగతనాలు ఇంకెప్పుడూ చెయ్యకు' అన్నాట్ట. 'ఈ చెక్కు నాదేనండీ!' అన్నాట్ట ఇతను. 'పోలీసువాళ్ళను పిలవనా?' అన్నాట్ట అతను అదోలా నవ్వి.

'ఈ పరిస్థితులలో నేను ఆత్మహత్య చేసుకోకేం చేస్తాను?' అని కన్నీరు మున్నీరుగా ఏడ్చాడు కృష్ణమోహన్. అతన్ని చూసి, నాకు కడుపు తరుక్కుపోయింది. 'భేష్!' అని వీపు తట్టాను. నా చేతుల్తో నేనే బిరడాతీసి, విషం సీసా చేతి కందిచ్చాను. అతను విషం తినేసి మరణించాడు.

కృష్ణమోహన్‌రావు, ప్రఖ్యాత హాస్య రచయిత, మరణించాడు. ఆఖరిక్షణంవరకూ నేను అతనితోనే ఉన్నాను. తరువాత విచారభారంతో క్రుంగిపోయి ఇలా వచ్చాను. నాకు చాలా బాధగా ఉంది; అతని కళ్లు చారెడేసి ఉండేవి.

## ఉపసంహారం

ఇది కథ కాదని మీరు ఒప్పుకోరేమో బహుశః. మీరు ఒప్పుకోకపోయినా నేను చేసేది ఏమీలేదు. కాని ఒక్కవిషయం: 'హాస్యరచయిత మరణించాడు' అన్నాను. అంతా ఉత్తిది. నిజంగా బ్రతికేఉన్నాడు. కాని కథంటే అంతేగదా? ★


విషపు కోతగాయములు



జామ్-బక్‌తో త్వరితంగా శమనమగును

కోతగాయములు, వగుళ్లు, కీటక కాటులు, మూడు రోజులలో మానిపోవును. కాలి వాపులు వ్రణములు, పుండ్లు, కాల్పులు, మరియు విషపు గాయములు ఏడు రోజులలో శమనమగును. ఎగ్జిమా మరియు తలగజ్జి తక్షణం రహితమగును. మీరు జామ్-బక్‌తో నివారించుకోగలరు — చర్మ వ్యాధులకు సకల గుణకరమైన మూలికా ఔషధము. ఇందు జంతు క్రొవ్వులుగాని మాదెలుగాని లేవని గ్యారంటీ చేయబడినది.

Zam-Buk




జామ్-బక్
మూలికా బామ్

జామ్ బక్ జిడ్డుగా లేని ఔషధ క్రీమును వాడి చూడుడు ... ఒక్కదాని యందే చర్మ చికిత్స చర్మ సౌందర్యము గలిగించు గుణములు గలది.

మందుల వ్యాపారులందరి వద్దను దొరకును

సి. ఇ. ఫుల్‌ఫోర్డ్ (ఇండియా) ప్రైవేట్ లి.
సోల్ ఏజెంట్లు: దాదా & కంపెనీ,
86, సైనప్ప నాయకన్ వీధి, మద్రాసు-1




[గతవారం తరువాయి]

## 5

పోలినాటి వెలమబిడ పుల్లయ్య పెళ్ళి స్థిరమయ్యింది. ఈ పెళ్ళిగురించి తలోలా అనుకున్నారు. ఆ వూరు చరిత్రలో యిదొక సంచలనాన్ని కలిగించిన ఘట్టం.

రూపురేఖలులేని, గతిలేని బోటికి, రూపురేఖలుండి నలుగురిచేతా శెభాష్ అనిపించుకున్న పాపడికి పెళ్ళి! చుట్టుపట్ల వూళ్ళనించి యెందరు కోరి పిల్లనిస్తామన్నారు? తను అందులో యెవర్ని చేసుకున్నా ఆస్తిపాస్తులు కలిసొచ్చేవే ఇప్పుడు రెండు వేపులా ఖర్చులు తనే భరించాలి.

కొందరు రాత అనుకున్నారు. పెద్దవీథి రాట్నాలసాలలో పాతిక రాట్నాలు తిరుగుతూంటగానే ఆడంగులు ఈ పెళ్ళినిగురించి వూహలాడుకున్నారు.

చివరకు "ఆయమ్మ శాపం వూరకనే పోతాదా? సత్తెం! సత్తెం!" అని ఒక వయసు మళ్ళిన మనిషంది. అందరూ నిజమని తలూపారు.

ఆ స్థలపురాణం ఒక తరంనుంచీ ఇంకో తరంవారికి కథరూపంగా అల్లుకుంది. ఒకప్పుడు ఒక జంట ఆ దారిన వెళ్ళిపోతూంటే, వూళ్ళో కొందరు విరగబడి నవ్వారట! మొగుడు వికారంగా పొట్టిగా వున్నాడు. పెళ్ళాం తీవిగా, అందంగా, జబర్దైన మనిషి! ఈడూజోడూలేని ఈ జంటనుచూసి నవ్వగానే ఆ పెళ్ళాం పతివ్రత అవటంచేత, శాపం ఇచ్చిందట. "ఈ వూరి ఆడపిల్లలకి ఈ వూరే గతి" అని. ఆ నమ్మకంవల్ల సాధారణంగా వూరి పాటకజనం, రైతుకుటుంబాలు, ఈ యింటిపిల్ల ఆ యింటికీ, ఆ యింటిపిల్ల ఈ యింటికి వచ్చేటట్లు చేసుకుంటుంటారు.

ఈ శాపం నీలికి కూడా తగలటంచేత వూళ్ళోనే మొగు డొచ్చాడన్నారు.

పెళ్ళికి నీలి ఒప్పుకుంది. పుల్లయ్య తహ్వ అనుకున్నాడు. సిగ్గులేదూ అని రెట్టించింది. కాలేసింది... పెళ్ళికి ఒప్పుకుందే ... బలే! నోరూరిపోయింది. "పట్టుకుంటానన్నాను... నా పంతం నెగ్గింది. దాన్ని ఇలాగలాగ యెలాగడుగుతాను? మీసాలు తిప్పనా? సిగ్గు నాకా దానికా? ఆ రోజురావాల... రానీ...రానీ!" అని పుల్లయ్య పెదవులు బిగించాడు.

రోజంతా అదే తలపుకువచ్చేది. ఛా ఛా. నాకిప్పుడూ యిలాగ వుండేదికాదే! నోరూరిపోతుంది. నీలి నా మనసులో నిగనిగలాడిపోతుంది. దానికి ఒకంతట లొంగుతానా? దానిమాట దానికప్పచెప్పనా!" తల ఆడించాడు "బలె బలే నాకు కొడుకే! ఈవూరు బంగారం నాకొడుకు బంగారం..."

ఒక్క ఎకురు ఎగిరాడు!

పెళ్ళి రోజువచ్చింది. పెళ్ళికొడుకు ఇంటిముందర పందిర వేశారు. ఆదెమ్మ అప్పుడే పెద్దరికం. అసలు ఈ పెళ్ళిఖర్చులకి రెండు వందలు పద్దూ గిద్దూ లేకండా అలుడితో చెప్పిపుచ్చుకుంది. ఈ గుమ్మలాంటి ఇంట్లో పొందికగానే పెళ్ళి జరిపిద్దామని. పుల్లయ్య పెళ్ళంటే పొన్నూగువాళ్లుకూడా వచ్చారు.

నీలి తల్లితల్లి పళ్ళూడిన ముసలిది-రోజులు లెక్కపెట్టుకు కూర్చుంది. చింపిరిజుత్తుకు ఆదెమ్మప్ప మంచినూనె రాసింది. కొత్త కోక కట్టించింది. ఆ ముసలిదాని కళ్ళు ఈ చివరిదశలో ఆశతో చూస్తున్నయ్ టకోరా మేళంవాగుతూంటే పసందుగా వినిపిస్తోంది.

ఈ ముసలిది ఒకప్పుడు మనుమరాలిలానే వుండేది. మామ్మపోలికే నీలిది. కట్టుకున్న మొగాడు త్రాగుబోతు. ఒళ్లంతా హూనం చేసేవాడు. యెముకకు యెముక విరిచేసేవాడు. ఎవరితోనూ చెప్పుకోలేదు. నీతికి నిజానికి కట్టుబడింది. యౌవనం ఒక్కడికే అనుభవించడానికి అప్పచెప్పింది. పిల్లలు పుట్టారు. పెరిగారు తిండిలేక చచ్చినవాళ్లు చచ్చారు. అదంతా జ్ఞాపకంవస్తే, మని

మంతా గిరగిర చుట్టుకుపోతుంది. వణికిపోతుంది. గుండెదడ పట్టుకుంటుంది.

అంతా చచ్చారు. మిగిలింది ఒక్క కూతురుకూతురే. తననుమాత్రం ఈ పిల్లకోసం బ్రతకనిచ్చాడు దేముడు.

మేళం మోగుతోంది. ముసలిది అరుగుమీద కూర్చుని పెళ్ళిపీటలవైపు చూస్తూంది. ప్రొద్దున్న జరగవలసిన తంతు జరిగిపోయింది.

మధ్యాహ్నం భోజనా లయ్యాయి.

పెళ్ళికొడుకు అలక సాగించాడు. పెళ్ళి పక్కనేవున్న వంగిన చింతమానుమీద కూర్చున్నాడు. తోటిపెళ్ళికొడుకు కూడా చెట్టెక్కాడు. పుల్లయ్య చుట్టూ చూశాడు. ఇక్కడే... ఈ చెటుచాటునే... నీలిరూపు, చూపు... సొంపు, పెంపు చూసి మురిసిపోయాడు. ఆ మెవంటెని తాకి ఉద్రేకంతో ముద్దులాడాడు. చేతిమీదకాటు చూసుకున్నాడు.

"ఇంకెంతసేపు...!"

సాయంత్రం కావస్తోంది. పశువులబీడునుంచి తిరిగివస్తున్న పశువులు సాలలు చేరుకుంటున్నాయ్. ఆడకూతుళ్ళు కడవలతో నీరు తన యెదురుగుండా తీసుకపోతూ పుల్లయ్యవేపు ఒక చూపు పారేస్తున్నారు. నాలుగడుగులు ముందుకు వేసి వూసులాడుకుంటున్నారు. చిన్ననవ్వు నవ్వుకుంటున్నారు. పుల్లయ్యకు సిగ్గు పుట్టుకొచ్చింది. ఆడవాళ్లమీద ఎన్నికబుర్లాడాడు! వాళ్ళని విషం చూసినట్లు చూశాడు. ఇప్పుడో? ఆ ఆడదానికి లొంగిపోతున్నాడు!

వాళ్ళంతా తనను గురించే వూసులాడుకుంటున్నారు. నిజంగా..."ఆడుకోనీ— నాపంతం సెల్లాల. మీసకట్టున్న మొగోణ్ణి నాను!" అనుకున్నాడు.

గలగల గంగమ్మ పారుతోంది. చెట్టుమొదటకూర్చుని యేటివైపు చూస్తున్నాడు. వారధిమీద బళ్ళు, బస్సులు, మేకలమంద, మనుషులు పోతున్నారు. చూస్తున్నాడు.

మేళం వినిపించింది.... వస్తున్నారు...

తోటిపెళ్ళికొడుకు చెట్టుమీదనుంచి ఒక్కంగంతేశాడు.

పుల్లయ్య కొత్త కమీజు, పంచా, జరీవాణీ, తలపాగా సర్దుకున్నాడు!

పొలోపొలో మని ఆడంగుల కిలకిలమంటూ చుట్టుముట్టారు. అందరూ వరసకి వదినెలు...మరదళ్ళు...పుల్లయ్య ముఖం దించేశాడు! తోటిపెళ్ళికొడుకు! "యెత్తరా ముఖం, సిగ్గుపడతా వేంది? ఆడగరాకట్నాలు" అన్నాడు. ఆడమ్మలు "దాసుంచాం!" అన్నారు.

మేళం మోగుతోంది. పుల్లయ్య పెళ్ళికి వూరంతా పెద్దలే! ఈతంతుకు పెళ్లికొడుకు సిగ్గుపడిపోతున్నాడు. రమ్మని యెవడో జాతోడు పిలుస్తున్నాడు! మామవరస... పుల్లయ్యలేచాడు. "కూకుడో! కూకుడో!" అని అరచారు కుర్రాళ్ళు. ఆడాళ్లంతా "ఓ...ఎందుకు కూకోడు!" అంటూ సన్నని స్వరాలు కలిసి వినిపించాయ్.

పుల్లయ్యను బలవంతంచేసి కూర్చోబెట్టారు. ముఖం పక్కకు తిప్పించారు. అలక...ఇది అలకే అన్నట్టుగా ముఖకళను, అందరు కుర్రాళ్ళు అరచి మార్పించారు. మేం నెగ్గామని సగర్వంగా నవ్వుతూ యెగురుతూ యావనుల వేపు చూశారు.

"ఓడిపోనారు!" అని కుర్రాళ్ళు అరచేటప్పటికి ఆడాళ్ళు నవ్వుతూ ముఖాలు చూసుకున్నారు.

పుల్లయ్యకి మరదలు వరస అవుతుంది... ఒక పికపికలాడుతున్న పెళ్లికానిపిల్ల, ఒంటి బింకంతో, కళ్ళ తళుకుతో కళకళ్లాడుతోంది.

పంతంతో ముందుకు పెళ్ళికొడుకుదగ్గరకు వచ్చింది. ఈ నానూగుమీసాల యువకులు మొఖాలు తేలవేసి పెదవులు చప్పరించుకొంటూ పిల్లవైపు చూశారు. బలే... బలే....

గొంతు కత్తింది. కిక్కురు మనకండా వూరుకొన్నారు. పాడుతుంటే ఆమెవైపు కళ్ళప్పచెప్పి చూస్తున్నారు.

"ఏమయ్యా మీరలిగి తోటనున్నారా!
గుఱ్ఱమూ లేదని మీరలిగినారా?
గుడ్డికుక్కున్నాది యెక్కిరావయ్యా!
గంధమూ లేదని మీరలిగినారా?
గిదెపుర్రున్నాది గాసుకోవయ్యా!
ఆకులూ లేవనీ మీరలిగినారా?
చిక్కుడాకు లున్నాయి వేసుకోవయ్యా!
చెక్కలు లేవని మీరలిగినారా?
చింతపిక్కా లున్నాయి వేసుకోవయ్యా!
ఏమయ్యా మీరలిగి తోటనున్నారా?

పాటయ్యింది. పకపక అందరూ నవ్వారు. ఊసులాడుకున్నారు. రెండు పార్టీలవారు వాదించుకుంటున్నారు. ఇంతలో కబురు వచ్చింది. "బాపనబాబు మూర్తం దగ్గిరపడినాది. రమ్మంటున్నారని" పోలో మని అంతా కదిలారు. అల్లుడి అలక పోడానికి ఈ పెళ్ళి అయ్యేవరకూ మామగా అభినయిస్తున్న మనిషి ఏమీ ఇయ్యలేదు. అల్లుడు చిరునవ్వుతో మామ వెంటబడ్డాడు.

పెళ్ళిపందిరి! పీటదగ్గర ఒకపక్క మేడి, మోకు పెట్టారు. రెండోపక్క నన్నెగల్లు. మేళం మోగుతోంది. ముసలమ్మ అరుగుమీద కూర్చుని చూస్తోంది.

సాయంత్రం లగ్నం. అక్షింతలతో వరసయినవాళ్ళు సరసాలాడుకుంటున్నారు. ముత్తయిదువుల కోలాహలం ఇంతా అంతా కాదు. వాళ్ల గొంతుకలదగ్గర మొగాళ్లగొంతుకలు పనికిరాలేదు. పుల్లయ్యపెళ్లి...ఆ గేరాగిరజాలు...ఆ మెలితిరిగిన కండలు...అందరికీ అదో వెర్రి అభిమానం.

తంతుపూర్తయ్యింది. పుల్లయ్య సెతుమానం కట్టాడు. "అచ్చింతాలు యెయ్యండర్రో!" అని ఎవరో అరిచారు. అక్షతలు పడ్డాయి. పెళ్ళికొడుకు పెళ్ళికూతురివైపు ఓ వోరచూపు చూశాడు.

ముఖానికిపసుపు, పసుపుపచ్చనికోక, చేతికి

**గిలిగింతలు**

టీచర్: పిల్లల్లారా! ఎల్లుండి పెద్ద పరీక్షలు గనుక ఏమయినా సందేహాలు వుంటే అడగండి చెబుతాను.

విద్యార్థి: సార్! ఒకే ఒక్క సందేహం. పరీక్షా పత్రాలు ఏ ప్రెస్సులో ప్రింటు అవుతున్నాయండీ?

—గవ్వా కన్నారావు, విజయనగరం.

ప్రఖ్యాతిగాంచిన స్వాన్ బ్రాండ్
ఫ్రూటాల్ & మామిడి పండ్లరసము
స్క్వాష్‌లు, సిరప్‌లు, జామ్‌లు, పైనాపిల్ & మామిడి పండ్ల ముక్కలు
ఎల్లప్పుడు వాడండి.
స్వచ్ఛమైన వెన్నకాచిన నెయ్యికూడ దొరుకును.
దికు ఇండియా కానింగ్ ఇండస్ట్రీస్ లిమిటెడ్,
విజయవాడ—2.
హైదరాబాద్ ఎగ్జిబిషన్‌లో మా స్టాలు నెంబర్సు : 185 నుండి 189 వరకు
Publicity Arts

# ★ దగాపడిన తమ్ముడు ★

గాజులు, చెవులకి కమ్మలు, ముక్కుకి పసరం కమ్మి, మెడలో పగడాలకుత్తికంటు, కాళ్లకు మట్టెలు, కంటికి కాటుక, నుదుట కుంకుమ బొట్టు, నల్లని మెట్టె. పుల్లయ్యసంతోషంతో సర్దుక కూర్చున్నాడు.

ముసలిది పిచ్చిగా నవ్వుకుంటోంది. ఆదమ్మప్ప తన పెదరికం సాఫీగా సాగిపోయిందని మురిసిపోతూంది. అందరి ముఖాలలో కాంతి వెలుగుతున్నది."

బాపనయ్య అరటిపండు వలిచి, పెళ్ళికొడుకు చేతిలో పెట్టాడు. మేళం ఆగిపోయింది. మనుషులు మాట్లాడకండా చూస్తున్నారు. గ్యాస్‌లైట్లకాంతి పందిరిని ప్రకాశవంతం చేస్తోంది.

పుల్లయ్య పురోహితుడు చెప్పినట్లు అరటిపండు సగం కొరికి, మిగతాసగం భార్య నోటిలో పెట్టాడు. ఆమె తిన్నాక బాపనయ్య చెప్తుంటే పుల్లయ్య "ఈ యేళనుంచి నిన్ను నాను పెళ్లాడినందున, యేపనిచేసి తెచ్చిన డబ్బూ సగం నీకు యిస్తాను" అన్నాడు.

ఈసారి ఆమె సగంముక్క కొరికి మిగతా సగం మొగుడి నోటిలో పెట్టి సిగ్గుతో మెల్లిగా: "ఈ యేళనుంచి మిమ్మల్ని నాను పెళాడినందున, యిప్పట్నించీ మా కన్నవారివలనగానీ మిగతా బంధువులవలనగానీ వచ్చిన డబ్బు- నా సర్వస్వం మీ ఆధీనం చేస్తున్నాను," అంది.

ఈ మాటలు అనిపించిన బ్రాహ్మడు ఇద్దరినీ లేవమన్నాడు. లేచినా పుల్లయ్యకు మనసంతా ఆ మాటలతోనే నిండిపోతోంది. ఆ మాటల్లోవున్న సత్యం గుండెకు హత్తుకోవటంవల్ల పెళ్లాం వేపు మాటిమాటికి చూస్తున్నాడు, తన కేదో పవిత్రమైన బంధం దగ్గరకు చేర్చింది. కొద్ది నిముషాల ముందు కన్నా ఇప్పుడామె ఇంకోవిధంగా కనిపిస్తోంది. తన పంతాన్నీ ఆవేశాన్నీ ఈ మూడుముళ్లూ చల్లార్చినట్లనిపించేయి. భార్య వేపు గౌరవంగా చూస్తున్నాడు.

దంపతులు పల్లకియెక్కి వూరేగారు.

## 6

ఏటిఒడ్డున రెల్లుపూలు గాలికి మెల్లిగాకదులుతున్నాయ్. ఒడ్డున కొత్తపెళ్లికొడుకు నోటిలో పలుదోముపుల్ల పెట్టి యెదురుగా కనిపించే వారధివైపు చూస్తున్నాడు. పొద్దుటి యెండలో వంతెన మనోహరంగా కన్పిస్తోంది. నీలాటిరేవులో పల్లెవనితలు, వూసులాడుకుంటూ పుల్లయ్యవేపు ఒక చూపు పారేస్తున్నారు. ఆలమందలు యేటి అవతల ఒడ్డునవున్న బీడులో మేస్తున్నాయ్.

పుల్లయ్య కళ్ళప్పచెప్పి వీటివైపు చూస్తున్నాడే కానీ, నీలితోనే మనసు నింపుకొన్నాడు. రాత్రి పల్లకీలో ముఖమేనా ఎత్తిందికాదు. దానికాటికకళ్ళలోని తళుకులు, చూద్దామని వుబలాటపడ్డాడు, కాని సిగ్గు!

లేచిపోయాడు. పళ్ళుదోముపుల్ల అక్కడ పారేసి గంగలో దిగి ముఖం, కాళ్ళూ చేతులూ కడుక్కున్నాడు. పెళ్ళిబట్టలు, పసుపు ఒంటినే వున్నాయ్. గబగబ ఇంటికి వెళ్ళాడు. గదిలోకి వెళ్లి నీలిచెయ్యి పట్టుకోవాలనుకుంటే, ఆదిమ్మప్ప అరుగుమీద కూర్చుంది. ఒళ్లు చల్లారింది.

ఆవేళంతా ఆరాటమే. ఇల్లు కదలేదు. ఎవరొచ్చినా లోలోన విసుక్కుంటున్నాడు. కొద్దిక్షణాలు ఎలాగో అంకించుకొన్నాడు. పెరటిలో పట్టుకుందామనుకునేసరికి పిట్ట తుర్రున ఎగిరిపోయింది. వెంటపడితే పట్టుకోగలడు. కానీ ఆదెమ్మప్ప అరుగుమీద కూర్చుంది.

ఆవేళ మధ్యాహ్నమే అంతామాగన్నుగా నిద్రపోతూంటే, నీలి ఎందుకో పెరటిలోకి వచ్చింది. దొరికిందిరా అనుకున్నాడు. అటువేపు వెళ్తూంటే ఇటువేపు వచ్చి గుమ్మంలో ముసలమ్మ దగ్గర కూర్చుండిపోయింది. పిలక తమాషా చేస్తుందే అనుకున్నాడు.

పెదవులు చప్పరిస్తున్న పుల్లయ్య వాటిని ఒక్కసారిబిగించాడు. "తస్సదియ్యా పంతం పంతమే! మీసకట్టున్న పసున్న మొగాడ్ని- నాకా దానికా సిగ్గు? దాన్ని ఇలాగ అలాగ యెలా గడుసుతానో?" అనుకున్నాడు.

అలా అనుకుంటూండగానే, చీకటి పడింది. మనసులో ఆ మాటలు దొర్లుతూండగానే భోజనాలయ్యాయ్. ఇంకా ఆ పట్టుదల సడలకుండానే ఇంటినిండా వదినలు, మరదళ్ళు మూగిపోయారు.

శోభనం. వండిన పిండివంటలు ముత్తైదువలు గదిలో అమర్చారు. అంతా ఆడపుట్టు! ఇంక సందడికి కొదవలేదు. పుల్లయ్యముఖంలోకి చూసి మరీ వరసైనవాళ్ళు మాటలు విసురుతున్నారు. ఊహూఁ! పుల్లయ్య మూగోడిలా చూస్తున్నాడు.

వరసకి వదినౌతుంది; నల్లగా బింకంగా వుంది. మూడుపదుల వయస్సు, ముగ్గురుపిల్లల తల్లి. పుల్లయ్య చేతిలో ఇచ్చరూపాయి పెట్టి, మొగుడూ పెళ్లాల చేతులు కలిపించింది...ఇద్దరినీ గదిలోకి తీసుకువెళ్ళింది. ఆడాళ్లంతా వెంటపడ్డారు. నులకమంచం మీద జంట కూర్చుంటే, జవ్వనులంతా నవ్వుతూ మురిసిపోయారు. నీలి చెవులో నోరుపెట్టి ఇంకా ఏమేమో చెబుతూనే వున్నారు.

పుల్లయ్య తల వంచుకుని అలాగే కూర్చున్నాడు. వదిన అందర్నీ పదండ్రా అంది. గది బయటికి అందర్నీ పంపించాక పుల్లయ్య తలెత్తి వదినెవైపు చూస్తూ, చేతనున్న రూపాయి ఇచ్చేశాడు. వదిన నవ్వుతూ తీసుకుంటూ: "జాగర్త...పెళ్లాం అంటే మొగ్గలెయ్యటం కాదు. వెయ్యికళ్లతో దాన్ని చూడాల. అందులోన అది అమ్మలేని పిల్ల. అమ్మలేని పిల్లలకు అల్లకల్లోలాలు కదా! అమ్మా, అయ్యా, మొగుడూ అంతా నువ్వే దానికి! చూపు మద్యం కాకండా వుంటే, దాని పని నువ్వే తెలుసుకుంటావ్. అది బాగుంటేనే నీ బాగు!...వస్తా...జాగర్త!"

వదిన కదిలిపోతూంది. పుల్లయ్య తన పెద్ద కళ్ళతో చూస్తున్నాడు. చూపు మధ్యమై పోతూంది. కళ్ళు మసకలుకమ్మాయి. తలుపు వేసుకున్నా ఇంకా ఆ తలుపువేపే చూస్తున్నాడు.

"పెళ్ళం అంటే మొగ్గలెయ్యటం కాదు!" ఈ మాటలే మనసులో అనుకుంటూ నీలివైపు చూశాడు. ఒళ్ళంతా అదోలా అయ్యింది. గప్పున దగ్గిరికి లాక్కోవాలనుకున్నాడు. కానీ అనుకోకుండా లేచి నిల్చున్నాడు.

కర్రపెట్టెమీద ప్రమిదలో దీపం వెలుగుతోంది. గది బయట చిన్న అలజడి వినిపిస్తోంది. దీపం ఆరిపేద్దామనుకున్నాడు. కానీ మళ్ళీ మనసొప్పలేదు.

ఇదేదో కొత్తగా వుంది: ఆడవాళ్ళని మచ్చిక చెయ్యటం గట్టి చిక్కే అనుకున్నాడు.

గబగబ వెళ్ళి చెయ్యిపట్టుకు లాగాడు. చెయ్యి లాక్కుంది. తప్పుకుంది. మొఖం ఎత్తమంటే మొండికెత్తింది.

పుల్లయ్య కిదేం నచ్చలేదు. తనలాంటి మీసకట్టున్న మొగాడు; కనుసైగచేస్తే రావలిసింది, ఇంత ఆర్భాటంచేస్తోందే! "పొద్దున్న దగ్గరనుంచి ధోరణి యిలానే వుంది! దీని సంగతేంటో చూస్తాను. పంతం పంతమే!" అనుకున్నాడు.

చాలాసేపటివరకూ అలాగ పెట్టెమీద


**అధైర్యపడవద్దు**

శాస్త్రీయమైన, నిజమైన SEX— ADVICE పొందవచ్చును. మీకు ఉండుకొన్న లక్షణములు వ్రాయుచూ, యింకా వివరాలకు కవరు పంపేది.

డాక్టర్ రత్నంసన్స్, (Estd 1904)
మలకపేట బిల్డింగ్సు, హైదరాబాద్ - 2.
(దక్కన్)

# ★ దగాపడిన తమ్ముడు ★

కూర్చున్నాడు. మూగదానిలా పెళ్లాం ముఖం దించుకు కూర్చుంది. ఛా ఛా అనుకున్నాడు.

పైన అలజడి వినిపించలేదు. ముందు రాత్రంతా నిద్రలేదేమో, ఎవరింటికి వాళ్ళు పోయారు.

నీలి కొద్దిగా తలెత్తి గుమ్మంవేపు చూశాక, క్రీగంటితో మొగుడివేపు చూసింది.

పుల్లయ్య పెళ్లాంవేపు చూడలేదు. యౌవన గర్వంతో వున్న పెళ్ళాం దాసోహం అనాలన్న అహంభావంతో పుల్లయ్య వెలుగుతున్న దీపకళికవేపు చూస్తున్నాడు. వత్తి మీదకెత్తాడు...... అదేదో వెన్నెల్లో వున్నట్లనిపించింది. వంగిన చింతచెట్లు,...జవ్వనులు...నీలి సొంపు, పెంపు...చందమామో, చందమామ! తుర్రున యెగిరిపోయారు! నీలి, నీలి...నీవు న్యాయంకాదు......దొంగా...దొంగనో దొరనో చూడు...కాచేసిందే...! చెయ్యి తడుముకున్నాడు! పంతం పంతమే సిగ్గు...నాకా దానికా?"

గబగబ లేచాడు. పక్కనే కుర్చున్నాడు. "చూశావ్ నీలీ!" అన్నాడు. నీలి చూడలేదు. మీసం తిప్పాడు. నీలి చూసింది. గర్వంతో చిన్న నవ్వు నవ్వాడు.

"ఏమనుకున్నావో...నా సంగతి!"

ఈసారి నీలి మరికొద్దిగా తలెత్తి పైకి చూసింది. పుల్లయ్య చప్పున చేతితో నీలి తల పైకెత్తాడు. "బాగా చూడు...దొంగనో దొరనో!"

జవాబు లేదు. దెబ్బతిన్న లేడిలా చూస్తోం దనుకున్నాడు.

పుల్లయ్య వేళాకోళంగా నవ్వాడు. మీసాలు తిప్పుతూ: "ఏమైనా...పట్టుకుంటానన్నాను ... ఆఁ పట్టుకున్నానా?" అన్నాడు.

నీలి మురిసిపోయే మొగుడివైపు నవ్వకుండా చూసి, తలదించి మెల్లగా నవ్వుకుంది.

పుల్లయ్య మరీ అహంభావంతో నిల్చుంటూ నీలి తలెత్తి ముఖంలో ముఖం పెట్టి "సిగ్గు నీకా నాకా! హో హో!..."

భర్త నవ్వు పూర్తయ్యేవరకూ, అలా చూస్తోంది. ఆనందంలో హోయిహోయిగా తేలిపోతున్నాడు. "జవాబు చెప్పదేంటి? ఓడిపోనాది, ఓడిపోనాది!" అనుకున్నాడు.

నీలి చిరునవ్వు ఒలకబోసింది. పుల్లయ్య చూశాడు. ఆగిపోయాడు.

నీలి ఈసారి ముఖం వెలిగించి, భర్తవేపు కళ్లిప్పచెప్పి చూసింది. నవ్వింది! నవ్వింది...పుల్లయ్య పిచ్చాడిలా, ముఖంలోకి చూస్తూంటే, నీలి తలదించి, ఇంకా నవ్వుకుంటోంది.

అదిగో మాట్లాడింది...హోఁ మాట్లాడిందే!

"ఓడిపోనాను...!"

పుల్లయ్య తృప్తిగా నవ్వుకుంటూ నే యెటకారం...... యెటకారం......అనుకుంటూ "ఆఁ" అన్నాడు.

నీలి తలమీద కప్పుకున్న చీరకొంగు తీసి లేచినిల్చుంది. ప్రమిదలో వత్తి కొద్దిగా దిగువకులాగి మళ్ళీ వచ్చి కూర్చుంటూ...

"అనా లనుకున్న దంతా అనేశావా?" అంది.

హోఁ—పుల్లయ్య పక్కనే మంచంమీద కూర్చుంటూ "హోఁ—నాకేంటి?...మీసకట్టున్న మొగాణ్ణి!...అవును నా నంటే నాకుగర్వం! మావంశం అలాంటిది. సిగ్గులేదా అన్నావు—నాకు నీకా సిగ్గు?" అన్నాడు.

ఈమాటలు ముఖం ఆదోలా చేసుకొంటు అంటున్న భర్తవేపు నీలి చూస్తూనే వుంది. ఇంకా ఇటువేపు ముఖం తిప్పనిభర్త భుజం మీద చెయ్యివేసింది. పుల్లయ్య కదల్లేదు మెదల్లేదు.

ఆభుజంపై అలా తలవాల్చి చిన్నకమ్మనైన స్వరంతో, మెల్లమెల్లగా. "చూడు! నివ్వుచేసినపని బాగుందా?"

"నాదా తప్పు?"

"తప్పని అనలేదు. చూడు. నీపెళ్లాన్నె యవడో నివ్వు సేసినట్లు సేస్తే నివ్వేలాగుంటావ్? పోనీ నన్నే ఇంకో మొగోడు నివ్వు సేసినట్టుసేస్తే నేను ఆడికి లొంగిపోతే నీకు యెంత అన్యాయం సేసెద్దును! నీకు తెలిస్తే నువ్వు యేమాతావ్?" అంది.

పుల్లయ్య వోరచూపు చూశాడు. నీలి మరీదగ్గరగా జరుగుతూ, ఆచెయ్యిని గేరా గిరజాలలోకి పోనిస్తూ భర్తను, అంటి పెట్టుకుని, "చూడు! నీకళ్ళుమూస్తాను. ఊరందరి కళ్ళూ మూస్తాను. లోకం కళ్ళు మూస్తాను. కాని దేముడికళ్లు ముయ్యగలనా? మన మంచీ చెడూ చూసేవాడు పైనున్నాడని నువ్వు న్యాయంగా నమ్మకంగా యెల్లకపోతే—మనం బతికెందుకు?"

చల్లనైన వాతావరణం కమ్మనైన మాటలు ఈ అవకూతురు కన్నవారింటో కడుపుకి కష్టాలుపడింది. యౌవనంతో వంగుతూ వాలుతూ వయ్యారంగా తిరుగుతూ పాడుతూ మురిసిపోయింది. పెళ్లిఘడియల్లో ఏమీ తెలియని అమాయకురాలిమల్లే సిగ్గుతో ముడుచుకుపోయింది. పెళ్లైపంతం పట్టిన మొగుడికళ్లు విప్పుతోంది.

పుల్లయ్యకు కొద్దిగా వణుకుపుట్టింది. నీలి తన పెళ్లామని మరచిపోయాడు. అదేదో ఒక పవిత్రమైనదిగా కనిపించింది. ఆమె మాటలోని సత్యం ప్రతీకణంలోను ప్రతిధ్వనిస్తోంది. 'అవును...నాదే తప్పు...' అని లోలోన పెద్దపెట్టున తిట్టుకుంటున్నాడు.

నీలి మరీ దగ్గరగా జరిగి కౌగలించి మొగుణ్ణి పట్టుకుంది. ఆమెకు తెలుసు ఎందరు యౌవనులు ఈ మనిషిగురించి మిసమిసపడి మనసులో కోరికతో నిండిపోయేవారో, ఆమెకూడా ఈ గిరాగిరజాలు, ఈ మెలితిరిగిన కండలనుగురించి ఎన్నిసార్లు తలుచుకుంది...! వాటిని తలుచుకోవటం వెర్రితనమని ఈ వెర్రిబాగులపిల్ల ఆ తలపును తుడిచిపెట్టేది. కానీ ఆ గిరజాలలో ఇప్పుడు తన చెయ్యి దూర్చివుంది. ఈ తిరిగిన కండలకి తన శరీరం తాకుతోంది! ఎంత హాయి...ఇంక ఆమెకేం కావాలి!

నీలి కళ్లల్లో నీరు...పెదవులమీద వెర్రి నవ్వు. పుల్లయ్య చూశాడు! పెళ్లాన్ని గట్టిగా గుండెకు హత్తుకున్నాడు...నీలి...నా నీలి...నాదే నాదే...ఒళ్లంతా కళ్ళు చేసుకున్నాడు—ఎంత హాయి...ఇంత హాయ్ హాయ్ బతుకిదే. ఇందులో ఎంత తీపి...ఇదివరకు గడిపిన బతుకంతా ఇసుకదిబ్బ... ఇప్పుడు...పంటతో నిండిన తన పొలాన్ని చూసినట్లుగా, అంతకు రెట్టింపు గర్వం.

ఆమె కళ్లలోనించి జారే నీటిని తుడిచాడు. ఆమె నవ్వే పెదవులను తన పెదవులకు దగ్గరగా చేర్చుకున్నాడు.

(ఇంకా వుంది.)

బాలి
స్థాపితం 1920
మేహవాడి. చర్మ. సుఖ వ్యాధులకుగ్యారంటీచికిత్స
కృత్తాగుసలహాఉచితం
రెడ్డి & కో గొపాలపురం
తూర్పుగోదావరి జిల్లా
(వయా) తణుకు (ఆంధ్ర)

నారసింహ లేహ్యము
బంగారుతో చేరినది. మేహము, నిస్త్రాణ, విస్మృతువగైరా హరించి. బలము రక్తవృద్ధికల్గించును. 20 తు. డబ్బి రు. 3-4-0. పోస్టేజి రు.1-1-0.
వి. వి. ఏ. అండ్ కంపెనీ ఆయుర్వేద సమాజం,
పెండేపి (PO) నెల్లూరుజిల్లా.

★ ఆడవాళ్ళు: ఆత్మహత్యలు:-

# కుళ్ళున్నచో

★ రచన: సిపె

★

## శ్రీమతి ఆదిమధ్యం రమణమ్మగారి వ్యాసానికి ఒక సోదరి జవాబు

★

శ్రీమతి రమణమ్మగారి ఆత్మహత్యలు ఆడవాళ్ళలోనే ఎందుకు ఎక్కువ అన్న వ్యాసముతో పూర్తిగా ఏకీభవించలేక పోతున్నాను. ఆత్మహత్య లన్నీ వారు చూపిన కారణాల్లోనే జరుగుతున్నాయని అనుకోవడము సబబుగా తోచడంలేదు. పైపెచ్చు ఆ కారణాలను వివరించడంలో "స్వపక్షం" పతనమైపోతున్నదన్న ఆవేశం అదుర్దాలతో ఎదుటి పక్షానికా నిందలను అంటగట్టడం సాహసమనిపించుకుంటుంది. ఇదంతా న్యాయవాదివాదనలాగ వుంటుంది గాని, న్యాయమూర్తి తీర్పులాగ వుండదు. మనకంట్లో వున్న దూలాలను తీసివేసుకొని ఎదుట వాళ్ళకండ్లలో నలుసులు వెదకడం ఏమంత సబబుగా వుంటుంది? పతితజన సంఘమంటూ ఏదీ లేకుండకపోయినా ఎంతో మంది పతితలు సంఘంద్వారా చలామణి అవుతూనే వున్నారు. ప్రవృత్తి చూపి "బలి" వేసే సంఘాలనే లోకం నేడు "బలి" వేసింది. కాలం మారినవాళ్ళంతా భావిలో పడే సందర్భాలు శూన్యమయ్యాయి. ఏదో సంఘము దని పిరికిపాలను నూరిపోయడం, పులికన్నా "గిలి" ఎక్కువని రుజువు చేయడం తప్ప వేరుగాదు. పంచములు ఉభయులందున్నారు. అందు ఎవరికి పైచేయి అన్న చర్చలోకి దిగితే అధికతాంబూలం మనకే దక్కుతుందేమో! కొంతకనకములేని కయ్యాలు లేవనడం అతిశయోక్తి గాదనుకుంటా. సృష్టిలగాయతూ నేటివరకు గల కాలాన్ని ఆదిమధ్యాంతములని మూడు విభాగాలు చేసిచూస్తే, మన రచయిత్రిగారు చూపిన కారణాలు ఆది, మధ్యకు కాలానికి వర్తించుతాయి గాని నేటి కాలానికి సరిపడవనుకుంటా. నేటి పరిస్థితికి ప్రాధాన్యం ఇవ్వకపోవడంవల్లనే, స్త్రీ ఆత్మహత్యలకు సంఘము, పురుషుడు, అత్తలువగైరా కారకులు అని వ్రాయగల్గారు. స్త్రీకి అన్నిరంగాలలో సమాన స్థానమిచ్చి నేడు సంఘము, పురుషుడు గౌరవించుతున్నారు. వారిపై స్త్రీ ఆత్మహత్యలకు కారణాలను మోపటం పాడిగాదు. నేటి స్త్రీ ఆత్మహత్యలకు మూలవిరాట్ ఏమిటూ అని తరచిచూడాల్సివుంది. ఆదిలోనే స్త్రీకి మాంసపొదు చుట్టారు; పురుషుడి కాధిక్యత యిచ్చారు. పురుషుడు చేసినది స్త్రీ చేయడం దోషమని చిత్రించారు. ఆ తరతమభేదాలే వాల్మీకి వ్యాసాది కవులచేతి ఘంటాలనుండి వెలువడి నేటి స్త్రీ కంఠాలను యింకా నులిగొంటూ వున్నాయి.

ఆటంబాంబులలో ఆనందించే దేశాల పగిది ఆనందించమని స్త్రీ కొక ఆయుధం సృష్టించి ఇచ్చారు. ఆ ఆయుధమే భస్మాసుర వరాలుగా ఆడవాళ్ళ పాలిట మారణాయుధమైంది. దానికే "పాతివ్రత్యం" అని పవిత్ర నామకరణం చేశారు. దానిని అనేక భంగిమలలో ప్రేల్చి చూపించారు. ఉక్కుముక్కలను కనకలు మాదిరి వుడికించి నుగ్గుచేశారు. మూర్తిత్రయాన్ని బాలత్రయం చేసి ఉయ్యాలలో ఊపారు; మంటలను మండించారు; మంటలను ఆర్పారు! కోడెగుర్రాల రథంపై జోరుగా వచ్చే మార్పునకు పవన్ బ్రేక్





"స్నానఘ

"వనితాలోకం" ప్రత్యేక వ్యాసం



# వే ఈగలు!

ెచ్. మేరి



**కళ్లు చలించి కోర్కెలు**
**గుర్రాలెక్కేవారు**
**ఉభయత్రా వున్నారు**





వేయించారు. తులసి ఆకుతో తులాభారాలు తూచారు. సామాన్య మానవుల చూపులకందని మహత్మ్యాతిమాత్మ్యమైన యముని చూపించారు. ఎన్నెన్నో ప్రయోగాలు చేశారు. వీటన్నిటికి స్త్రీ వుబ్బి తబ్బిబ్బైంది. అంతటి మహిమాన్విత ఆయుధం తనకుండాలని వుబలాట పడింది. అంతటి మహాభాగ్యానికి ఎంతటి ఇడుములనైనా భరిస్తానని గుండెరాయి చేసుకుంది. అబల అన్న మాటకు ఆనవాళ్లు లేకుండాచేయాలని అష్టకష్టములు ఇష్టపూర్వకంగా అనుభవించింది. కుష్ఠురోగపు భర్త ఇష్టాన్ని తీర్చడానికి తట్టకెత్తిన పెట్టుకొని మోయడానికి వెనుకాడలేదు. అశోకవృక్షంక్రింద హా! అని తన శోకాన్ని వెళ్ళబుచ్చుకోటానికి వెరువలేదు. జూదంలో ఉన్నై రాజ్యాలు రాళ్ళ పాలుజేసి కానవములో కష్టాలకు వడిగట్టినా, కట్టుకున్న చీర సగం దోచుకుపోయినా వెనుకంజ వేయలేదు. నిండు సభలో కట్టుబట్టలను కండ్లఎదుట వూడదీస్తున్నా కాపాడలేనివాళ్లను దద్దమ్మలని తలంచలేదు. పుట్టంధువుకొరకు కండ్లకు గంత దేనికని ప్రశ్నించలేదు. ఆ పాతివ్రత్యమహిమాయుధం కోసం ఎన్నెన్నో కాకమ్మగాథ లల్లారు. ఒక ప్రక్క స్త్రీకి ఏకపత్నీ వ్రతమన్నారు. వేరొక వంక బహుభార్యాత్వము పురుషునకు. దేవాది దేవతలను వ్యభిచారులుగా చూపడానికి కూడా వెరువలేదు!

అనాడే స్త్రీ నోట దుమ్ముగొట్టారు! ఆ పురాణ పురుషుల ఆదర్శాలే మూఢాచారంక్రింద యింకా ఆలోచించు వారే ఆత్మహత్యలకు వడిగట్టుతున్నారు. ఆనాటి వారి వ్రాతలలో మందుకైనా ఆదర్శంగా ఒకరినైనా నిలుపకపోయారు. అవివాహిత కుంతిని కాలుజారినవాళ్లకు ఆదర్శసతిగా నిలబెటలేకపోయారు. గమనము లేని సూర్యునకు గమనము, దైవత్వం కల్పించారు. ఆ దైవత్వ ప్రభావమే మొదటి కాన్పు కర్ణుడన్నారు. పాండు రోగపీడితుడైన భర్తచాటున బిడ్డలు కనలేదా మా భారతనారి కుంతి అని, ఏ ఇంతి అయినా గుండెనిబ్బరము చెనుకొనివుండ వీలులేకుండా చేశారు. అపంచకము, వంచనలేని వరప్రసాదులన్నారు. అయిదుగురుభర్తలు మా ద్రౌపదికి అన్న అహంభావమునకు అడ్డుకట్టలు వేశారు. పతివ్రతలజాబితాలో ఆమె ఒక మెంబరన్నారు. ఇంకెవరి ఆదర్శం? ఇంకెవరి దిక్కు?

ఆనాటివారి ఆదర్శాలు అంతటితో వూరుకోలేదు. ఆనాట, ఆనోట అవే నిత్యాచారాలుగా అలముకొన్నాయి. కనిపెట్టిన బాంబులను తన స్వంతదేశములో పరీక్ష పెట్టితే స్వజాతికే ముప్పు అని జపాన్‌దీవులలో ప్రేల్చు రాజనీతిపరాయణులు వెలిశారు. స్త్రీకి లభించిన పాతివ్రత్యమహిమాయుధాన్ని మానవలోకములో ప్రేల్చ గూడదనుకున్నారు. అందుకే కట్టుకున్నవాడు కాడు యెక్కితే అదే పాడెపై స్త్రీని బిగించారు! సహగమనముద్వారా కానని లోకములో మహిమాయుధపు మహత్తు చూపుతామన్నారు. అందుకుగూడా స్త్రీని సిద్ధంచేశారు. రోజులు మారాయి. స్త్రీ జనోద్ధారకు లుద్భవించారు. రాజా రామమోహనరాయ్ స్త్రీసహగమననిరోధానికి తన

(41-వ పేజీ చూడండి)

చిత్రకారుడు : గోలి శేషయ్య.

# నక్షత్ర ఫలితాలు

**(29-1-58 మొదలు 4-2-58 వరకు)**

బి. నరసింగరావు

## గ్రహ స్థితి

| | | | |
|---|---|---|---|
| | కే | | |
| | 30నతూర్పున శుక్రోదయము. తే2-2-58న మకరములో బుధ ప్రవేశము. మేష, వృషభ, మిథున, కర్కాటకములలో చంద్రుడు. | | |
| ర శు | | | |
| కుబు | శ | గు రా | |

### *అశ్విని [చూ, చే, చో, లా]*

ఈ వారము కార్యాచరణలో ఆటంకములు కలుగుతాయి. అయినప్పటికీ ఫలసిద్ధికి దైవానుగ్రహమే కారణమని చేయవలసిన ప్రయత్నము విడువకూడదనే దృఢసంకల్పముతో వుంటారు. అందువల్ల ఎలాంటి ఇబ్బందులూ మిమ్ములను కలతపెట్టలేవు. దూరముందున్న బంధువులకు అనారోగ్యముగా వున్నదన్న వార్తలవల్ల విచారము పొందుతారు. ఉద్యోగస్తులకు అస్థిమితము; వర్తకులకు ఆందోళన. 29, 30 తేదీలలో నిలకడలేని స్థితి, శ్రమ. 31, 1, 2 తేదీలలో ధనప్రాప్తి ప్రయాణము, ఆత్మవిశ్వాసము. 3, 4 తేదీలలో ఆరోగ్యచింత.

### * భరణి [లీ, లూ, లే, లో] *

ఈ వారము ఖర్చులు ఎక్కువగుటచేతను అనుకున్నట్టుగా డబ్బు అందకపోవుటచేతను అశాంతికలుగుతుంది. మీ పనులవల్లనే కాకుండా ఇతరులకోసముకూడా పాటుపడి శ్రమచెందుతారు. కార్యభారము ఎక్కువవుతుంది. కోర్టువ్యవహారాలు కొంతవరకూ అనుకూలిస్తాయి. ఉద్యోగస్తులకు కొత్త సమస్యలు వస్తాయి. వర్తకులకు అశాంతి. భార్యకు ఆరోగ్య భంగసూచనలు వ్యవహారములపట్ల పేచీలు. విద్యార్థులకు చదువుపై ఆసక్తి తక్కువ. 29, 30 తేదీలలో కార్యభారము, త్రిప్పట. 31, 1, 2 తేదీలలో స్వల్పముగా కార్యలాభము. 3, 4 తేదీలలో వివాదము, ఆరోగ్యచింత.

### *కృత్తిక [ఆ, ఈ, ఊ, ఏ]*

ఈ వారము మీరు అనుకున్నట్టు పనులు జరగవు. చేతికివచ్చిన డబ్బుచాలక ఇబ్బంది పడవలసి వస్తుంది. ఆత్మీయులకు సహాయం చేసేందుకు పూనుకుంటారుగాని అది సాగకపోటపడి మనోవ్యథ పొందుతారు. ఆశాభంగమునకు కారణాలు కనబడకపోయినా ప్రతి పనిలోనూ ఆటంకాలువస్తూవుంటాయి. అయినప్పటికీ ప్రయత్నాలు మానరు. ఇంటాబయటాకూడా అశాంతి కలుగుతుంది. యంత్రములవల్ల ప్రమాదాలు కలుగవచ్చు; జాగ్రత్త పడండి. ఇనపసామాను వర్తకులకు ఇంజనీయర్లకు యోగము. 29, 30 తేదీలలో త్రిప్పట, ఆటంకాలు. 31, 1, 2 తేదీలలో పరిపడని ధనాదాయము అధికఖర్చులు. 3, 4 తేదీలలో వివాదము, ప్రమాదభయము.

### *రోహిణి [ఓ, వా, వీ, వూ]*

మీ బుద్ధిబలమువల్లను పలుకుబడివల్లను అధికారుల సహాయమునుపొంది గత రెండు వారములనుండి కలుగుతున్న చిక్కులను పరిష్కరించుకుంటారు. బంధుసహాయముకూడా కలుగుతుంది. ఆర్థికస్థితి బాగుంటుంది. విద్యార్థులకు చదువు చురుకుగా సాగుతుంది. 29, 30 తేదీలలో కార్య తొందరలవల్ల శ్రమ, అశాంతి. 31, 1, 2 తేదీలలో తొందరలు తగుతాయి. ధనాదాయము, మిత్రలాభము, కార్యానుకూలత, అధికఖర్చులు. 3, 4 తేదీలలో అలసటచే అస్వస్థత. వారమంతా కవులకూ, చిత్రకారులకూ, నటీనటులకూ యోగకాలము.

### * మృగశిర [వే, వో, కా, కీ] *

ఈ వారము మీకు యోగకాలము. ధనాదాయము ఎక్కువవుతుంది. కొత్తవారితో పరిచయము కలుగుతుంది. శుభకార్యముల గురించి ఆలోచనలు చేస్తారుగాని, నిర్ణయముమట్టుకు కుదరదు. కోర్టువ్యవహారములు లాభిస్తాయి. పండితగోష్ఠివల్ల కొత్త విషయాలు తెలుసుకొంటారు. ఉద్యోగస్తులకు హోదా పెరిగే సూచనలున్నవి. విద్యార్థులకు చదువు చురుకుగా సాగుతుంది. న్యాయవాదులకు, పండితులకు, ఉపాధ్యాయులకు, కళాకారులకు యోగకాలము. 29, 30 తేదీలలో కార్యసాధనలో త్రిప్పట, శ్రమ. 31, 1, 2 తేదీలలో ధనాదాయము, కార్యానుకూలత, విజ్ఞానార్జన. 3, 4 తేదీలలో ఎక్కువఖర్చులు, శ్రమ.

### * ఆరుద్ర [కూ, ఖ, జ, ఛ] *

ఈ వారము మీ పలుకుబడి వినియోగించుకొని కార్యసాధన పొందుతారు. కోర్టువ్యవహారములు మీ పక్షము అవుతాయి. ఉద్యోగస్తులకు మంచికాలము. విద్యార్థులు కొత్త విషయాలు నేర్చుకుంటారు. వర్తకులకు ప్రయాణమువల్ల లాభము. కళాకారులకూ, కవులకూ, నటీనటులకూ యోగము. 29, 30 తేదీలలో కార్యాచరణలో శ్రమ, ఖర్చులు. 31, 1, 2 తేదీలలో ప్రయాణము, కార్యలాభము. 3, 4 తేదీలలో అనారోగ్యము.

### * పునర్వసు [కే, కో, హా, హీ] *

ఈ వారము మీకు శుభయోగము. బంధుమిత్రులను కలుసుకుంటారు. శుభకార్యముల గురించి ఆలోచిస్తారు. వాహనయోగము వుంది. బంగారము, నూలు, బట్టల వ్యాపారస్తులకూ లాభం. కవులకు, గాయకులకు, నటీనటులకు, కళాకారులకు మేలుకాలము. 29, 30 కార్యభారముచే శ్రమ. ఖర్చులు ఎక్కువ. 31, 1, 2 తేదీలలో మిత్రులను కలుసుకొనుట, వినోదము, శుభకార్యచింత 3, 4 తేదీలలో ప్రయాసముచే అస్వస్థత. విద్యార్థులకు వారమంతా ప్రోత్సాహకరముగా వుంటుంది.

### *పుష్యమి [హూ, హే, హో, డా]*

ఈ వారము మీ ఆర్థికస్థితి అంత తృప్తికరముగా ఉండదు. తలపెటిన పనులు ఫలించవు. కార్యభారము ఎక్కువ. త్రిప్పట, అకాలభోజనమువల్ల ఆరోగ్య భంగము కలిగే సూచనలున్నవి. వెంటనే శ్రద్ధ వహించండి. విద్యార్థులకు చదువుపై శ్రద్ధ తక్కువ. 29, 30 తేదీలలో కార్యభంగము, గృహకలతలు, మనోవ్యథ. 31, 1, 2 తేదీలలో పితృవర్గ సహాయము, స్వల్ప శుభయోగము. రాజకీయవాదులకు మేలుకాలము. 3, 4 తేదీలు త్రిప్పట, అశాంతి.

### *ఆశ్లేష [డి, డూ, డే, డో]*

ఈ వారము మీకు అంతయోగకరము కాదు. మొందట్లో సహాయము చేస్తారను

## ధరలు:

నూలు, వస్త్రములు : మార్పు లేదు.
నూనెదినుసులు : మందముగా వుండును.
బెల్లము, పంచదార: సమస్థాయిలో వుండును.
చింతపండు : కొంచెము తగ్గును.
ఆహారధాన్యములు : తగుదలలో వుండును.
పప్పుదినుసులు : మార్పు లేదు.
వెండి, బంగారము: స్వల్ప తేడాలో వుండును.

* * *

జన్మనక్షత్రము బట్టిగాని, జన్మనక్షత్రము నెరుగనివారు నామనక్షత్రము (వారి వారి పేర్ల ననుసరించి పేరు మొదటి యక్షరము)ను బట్టిగాని ఫలితాలు తెలుసుకొనునది. కృష్ణుడను పేరునకు మృగశిరా నక్షత్రమును, వృష్ణుడను పేరునకు స్వాతియు, శ్రీధరుడను పేరునకు చిత్తయును, క్షేత్రపాలకుడనే పేరునకు హస్తయును, భీముడు, భైరవుడు అనే పేర్లకు పూర్వాషాఢయును చూచుకొనునది.

శన్న మిత్రులు తటస్థముగా వుంటారు. ఎవరిని నమ్మకూడదనుకొని అనుమానపడ్డారో వారే మీకు సమయానికి ఆదుకొని కార్యసిద్ధికి తోడ్పడుతారు. ఉద్యోగస్తులకు ధనలోపమువల్ల ఒత్తిడి, వ్యాపారస్తులకు మాంద్యము. విద్యార్థులకు చదువుపై శ్రద్ధతక్కువ. 29,30 తేదీలలో ఆశాభంగము, అవసరాలు తీరనందున కలతలు. 31,1,2 తేదీలలో ప్రయాణము, మిత్రసహాయము, కార్యసిద్ధి, చిత్రవస్తు సంగ్రహణ. 3,4 తేదీలలో ఆరోగ్యచింత.

## *మఖ [మా, మీ, మూ, మే]*

ఈ వారము ఖర్చులు ఎక్కువ. తలపెట్టిన కార్యములుఫలించవు. సంసారముపట్ల అనాదరణకలదనే అపోహమువల కలతలు సజ్జనసహవాసమువల్ల ఆధ్యాత్మికచింతవల్ల మనశ్శాంతి కలుగుతవి. ఉద్యోగస్తులకు వారప్రారంభమున కష్టముగాఉన్నా వారాంతమునకు మేలు కలుగుతుంది. విద్యార్థులు కొత్త విషయాలు నేర్చుకుంటారు. 29, 30 తేదీలలో ఆటంకాలు. ధనలోపము, కలతలు 31, 1, 2 తేదీలలో సజ్జనసాంగత్యము, మనోవికాసము, ధనలాభము. 3, 4 తేదీలలో త్రిప్పట, శ్రమ.

## * పూర్వఫల్గుణి (పుబ్బ) *
## [మో, టా, టీ, టూ]

ఈ వారము తలపెట్టిన పనులకు ఆటంకములు వస్తాయి. బంధువులురాకవల్ల ఖర్చులు ఎక్కువ. ధనలోపము తీర్చుకుందికి చాలా కష్టపడతారు. కోర్టు వ్యవహారములు మీ పరముగా తీర్పు అవుతాయి. ఉద్యోగస్తులకు ఒత్తిడి, వ్యాపారస్తులకు అశాంతి. దుష్టస్త్రీలతో వివాదము. భార్య ఆరోగ్యము చెడుటచే కలవరపాటు. విద్యార్థులకు శ్రద్ధ తక్కువ. 29, 30 తేదీలతో కార్యభారము, త్రిప్పట, ధనాభావము. 31, 1, 2, తేదీలలో కార్యానుకూలత ధనలాభము. 3, 4, తేదీలలో వివాదము, ఆరోగ్యచింత.

## * ఉత్తరఫల్గుణి (ఉత్తర) *
## [టే, టో, పా, పీ]

ఈ వారము మీరు ఉత్సాహముతో పనులు మొదలు పెడతారు గాని అడుగడుగునా ఆటంకాలు వస్తాయి. అయిననూ పట్టుదలతో ప్రయత్నముచేసి సాధించ కలుగుతారు. ధనలోపము తీర్చుకుందికి అప్పు చేయవలసివస్తుంది. కాని అంతలోనే మీకు రావలసిన సొమ్ము కలిసివస్తుంది. దెబ్బలు తగిలే సూచనలున్నవి. జాగ్రత్తవల్ల తప్పవచ్చును. ద్రావకముల పనివారికి, గనుల యజమానులకు మేలు కలుగుతుంది. పోలీసు ఉద్యోగస్తులకు మంచికాలము. 29, 30 తేదీలలో త్రిప్పట, కార్యభంగము, అప్పుచేయుట. 31. 1, 2 తేదీలలో ధనలాభము, కార్యానుకూలత, లాభయోగము. 3, 4 తేదీలలో ప్రమాదము.

## * హస్త [పూ, ష, ణ, ఠ] *

ఇదివరకూ కలిగిన ఇబ్బందులు ఈవారము మీ బుద్ధిబలముచే గడిచి మంచిఫలితాలు పొందుతారు. అధికారములో వున్నవారి సహాయము వుంటుంది. ఆత్మీయుల కుశలము తెలిసి సంతోషముపొందుతారు. విద్యార్థులు కొత్త విషయాలు నేర్చుకుంటారు. డాక్టర్లకూ, గణితశాస్త్రజ్ఞులకూ, కవులకూ, శిల్పులకూ, కళాకారులకూ మేలుకాలము. 29, 30 తేదీలలో త్రిప్పట, శ్రమ. 31, 1, 2 తేదీలలో కుశలవార్త, ధనలాభము, కార్యసిద్ధి. మిత్రలాభము. 3, 4 తేదీలలో అలసట, అస్థిమితము.

## *చిత్త [పే, పో, రా, రీ]*

ఈవారము మీ ఆర్థికస్థితి బాగుంటుంది. చాలాకాలమునుండి పరిష్కారము కాకుండా నిలిచివున్న చిక్కుసమస్యలు పరిష్కారమవుతవి. మతవిషయగోష్ఠిలో పాల్గొంటారు. పిల్లల అభివృద్ధికొరకు కొన్ని కార్యక్రమాలు ఏర్పాటుచేస్తారు. విద్యార్థులకు శ్రద్ధ ఎక్కువ. ఉపాధ్యాయులకూ, పండితులకూ, న్యాయవాదులకు, కళాకారులకు మంచి కాలము. 29, 30 తేదీలలో కార్యాచరణలో శ్రమ. 31, 1, 2 తేదీలలో ధనాదాయము బంధు సమాగమము కార్యసిద్ధి, శుభకార్యాలోచన 3, 4 తేదీలలో అలసట, అస్వస్థత.

## * స్వాతి [రూ, రే, రో, తా] *

గత రెండు వారములనుండి కలిగిన ఆటంకాలు ఈవారము చాలావరకు తీరిపోతాయి. ఆర్థికస్థితి బాగుపడుతుంది. బంధుమిత్రులతో వినోదాల్లో పాల్గొంటారు. శుభకార్యాలోచనలు చేస్తారు. ఉద్యోగస్తులకూ అధికారయుతమైన బాధ్యతలు ఎక్కువవుతాయి. నూలు, బట్టల వ్యాపారస్తులకు లాభిస్తుంది. ఇంట్లోవారి ఆరోగ్యము బాగుపడుతుంది. కవులకు, గాయకులకు,కళాకారులకు మోగకాలము, 29, 30 తేదీలలో అధిక ఖర్చులు త్రిప్పట, శ్రమ. 31 1, 2 తేదీలలో ప్రయాణము బంధుదర్శనము, కార్యలాభము శుభకార్య చింత మృష్టాన్న భోజనము 3, 4 తేదీలలో అలసట, స్వల్ప అనారోగ్యము.

## *విశాఖ [తీ, తూ, తే, తో]*

గతవారము కలిగిన యోగము ఈ వారము కూడా వుంటుంది. ఉద్యోగములో మీ అధికారము పెరుగుతుంది. ఆదాయము కూడా హెచ్చుతుంది. వాహనయోగము వుంది. ఇతరులకొరకు కొన్ని కార్యాలు చేసిందికి పూనుకుంటారు. కోర్టు వ్యవహారములు మీ పరముగా తీర్పు అవుతాయి. పిల్లల శుభకార్యాలోచనలు ఫలిస్తాయి. విద్యార్థులకు ఉత్సాహముగా వుంటుంది. వర్తకులకు ఖరీదైన వస్తువుల క్రయవిక్రయములో లాభము. కవులకు, గాయకులకు, కళాకారులకు, నటీనటులకు మేలుకాలము. 29, 30 తేదీలలో కార్యభారము, అశాంతి. 31, 1, 2 తేదీలలో ధనలాభము, ప్రయాణము, కార్యసిద్ధి, బంధువులతో విందుభోజనము, 3, 4 తేదీలలో బడలిక.

## *అనూరాధ [నా, నీ, నూ, నే]*

ఈ వారము మీ ఆదాయము వృద్ధిచేసుకుందికి జరిపే ప్రయత్నాలు ఫలించవు. ఖర్చులకు అవసరమైన డబ్బు సమయానికి అందనందున గృహావసరములు తీరక కలతలు కలుగుతాయి. కార్యభారముచే శరీర, మానసికస్థితి చికాకుగా వుంటుంది. ఉష్ణాధిక్యముచే ఆరోగ్యము చెడుతుంది. ఉద్యోగస్తులకు శ్రమ; వర్తకులకు ఆందోళన. 29, 30 తేదీలలో కార్యభంగము. 31, 1, 2 తేదీ

#  నక్షత్రఫలితాలు 

లలో పితృవర్గమునుండి సహాయము. స్వల్ప శాంతి. 3, 4 తేదీలలో అనారోగ్యము.

***జ్యేష్ఠ [నో, యా, యీ, యూ]***

ఈ వారము అనుకున్న పనులు జరగవు. ఆశించిన సహాయము కలుగదు. గృహకలతల వల్ల మనోవ్యథ. మిత్రులెవరో శత్రువులెవరో తెలుసుకోలేరు. వారాంతమునకు మీ ప్రయత్నములేకుండా ప్రతికూలుడనుకున్న వ్యక్తి సహాయమువల్ల కార్యసిద్ధి పొందుతారు. ఇంట్లోనున్న వృద్ధుల ఆరోగ్యము చెడుటచేత చింతకలుగుతుంది. ఉద్యోగులకు అధికారుల ఒత్తిడి; వ్యాపారసులకు వారాంతమున లాభము. 29, 30 తేదీలలో కార్యభంగము, అధిక ఖర్చులు, 31, 1, 2 తేదీలలో అనుకోని ప్రయాణము, వింత మిత్రసహాయము, కార్యసిది. 3, 4 తేదీలలో బడలిక, ఆరోగ్యచింత.

***మూల [యే, యో, బా, బీ]***

గత రెండువారములలో కలిగినయోగము ఈవారము తగ్గుటచేతను కార్యభంగము వల్లనూ గృహకలతలు వచ్చి నిరుత్సాహ పరిస్థితులు ఏర్పడుతాయి. అయిననూ పుణ్యకార్యశ్రవణవల్ల ఆధ్యాత్మికచింత కలిగి మనశ్శాంతి పొందుతారు. కుటుంబ మందుండువారి ఆరోగ్యము సరిగా వుండనందున కలవరపాటు చెందుతారు. వ్యాపారస్తులకు నిరాశ, ఉద్యోగస్తులకు కొంత అనుకూలత. 29, 30 తేదీలలో పుణ్యకార్యాచరణ, సాధుసాంగత్యము, శాంతి. స్వల్ప ఆర్థిక లాభము. 3, 4 తేదీలలో ఆరోగ్య చింత.

***పూర్వాషాఢ [బూ, ధ, భా, ఢ]***

ఈ వారము మీరు తలపెటిన అన్ని పనులకూ ఆటంకాలు వస్తాయి. కార్యభారము ఎక్కువవుతుంది. కోర్టు వ్యవహారములు కొంత అనుకూలిస్తవి. వ్యవహారముపట్ల నీచ స్త్రీలతో వివాదము, భార్యకు అనారోగ్యము వల్ల మనోవ్యథ. 29, 30 తేదీలలో కార్యభంగము, త్రిప్పట, వివాదము. 31, 1, 2 తేదీలలో ధనాదాయము, కార్యానుకూలత. 3, 4 తేదీలలో ఆరోగ్యచింత.

***ఉత్తరాషాఢ [బే, బో, జా, జీ]***

ఈ వారము మీ సామర్థ్యము వంతటినీ ఉపయోగించి యత్నించిననూ శత్రువులు మీ ప్రయత్నములు ఫలించడానికి ఆటంకాలు కలుగజేస్తారు. అయినప్పటికీ చలించకుండా ప్రయత్నించడంచేత కార్యసాధన పొందుతారు. ఆర్థికంగా ఇబ్బంది కలిగినప్పటికీ జ్ఞాతి సహాయమువల్ల చాలామటుకు కష్టములు తీరుతాయి. జాగ్రత్తవల్ల ప్రమాదములు తప్పవచ్చును. ఇనుము, రంగుల వ్యాపారసులకు ఇంజనీర్లకు, మేలుకాలము. 29, 30 తేదీలలో త్రిప్పట, ఆటంకములు. 31, 1, 2 తేదీలలో ఆదాయవృద్ధి, సహాయము, కొంత ఊరట. 3, 4 తేదీలలో ప్రమాద సూచన.

***శ్రవణము [జూ, జే, జో, ఘా]***

ఈ వారము మీకు యోగప్రదము. మీ ప్రజ్ఞవల్లను, అధికారములోనున్నవారి సహాయము వల్లను కార్యానుకూలతను పొందుతారు. క్రొత్తవారితో పరిచయము కలుగుట, శుభవార్తలను వినుట మొదలగు మంచి ఫలితాలు కలుగుతాయి. ఆత్మీయుల ఆరోగ్యము బాగుపడుతుంది. గణిత శాస్త్రజ్ఞులకూ, కళాకారులకూ, కవులకూ యోగకాలము. డాక్టర్లకు, మందుల వర్తకులకు లాభము. 29, 30 తేదీలలో కార్యాచరణవల్ల త్రిప్పట, శ్రమ, 31, 1, 2 తేదీలలో ప్రయాణము, అధికారుల సహాయము, మిత్రదర్శనము, లాభము. 3, 4 తేదీలలో అలసట.

*** ధనిష్ఠ [గా, గీ, గూ, గే] ***

ఈ వారము మీ పథకాల ప్రకారము కార్యనిర్ణయము జరిగి ఫలమును పొందుతారు. ఆర్థిక, మానసిక, ఆరోగ్య విషయములలో ఉత్సాహముగా వుంటుంది. లాభకరమైన ప్రయాణమువల్ల వర్తకులకు మేలుకలుగుతుంది. ఉద్యోగస్తులకు మంచికాలము. ప్రియబంధువుల రాకవల్ల పిలల శుభకార్యములను గురించి ఆలోచనలు జరుగుతాయి. ఉపాధ్యాయులను, న్యాయవాదులకు, పండితులకు అనుకూలము. 29, 30 తేదీలలో శ్రమతో కూడిన కార్యసిద్ధి. 31, 1, 2 తేదీలలో ప్రయాణము, ధనలాభము, పండితగోష్ఠి. 3, 4 తేదీలలో బంధుదర్శనము, శుభకార్యచింత. స్వల్ప అస్వస్థత.

*** శతభిషం [గో, సా, సీ, సూ] ***

గతవారము అసంపూర్తిగా వుండిపోయిన పనులు ఈ వారము నెరవేరుతాయి. ఆర్థిక స్థితి బాగుంటుంది. బంధు మిత్రులతో వినోదములలో పాల్గొంటారు. దూరమందున్న ఆత్మీయుల కుశలవార్త తెలిసి తృప్తిపొందుతారు. నూలు, బట్టల వ్యాపారస్తులకు లాభము. విద్యార్థులు ఉత్సాహముగా చదువుకుంటారు. కవులకు, కళాకారులకు, గాయకులకు, నటీనటులకు యోగకాలము. 29, 30 తేదీలలో అశాంతితో కూడిన కార్యసిద్ధి. 31, 1, 2 తేదీలలో, ధనాదాయము, మిత్ర దర్శనము, విందు, వినోదములు. 3, 4 లలో చాంచల్యము.

*** పూర్వాభాద్ర [సే, సో, దా, దీ] ***

ఈ వారము మీకు యోగదాయకము. ధనాదాయము బాగుంటుంది. యత్నకార్యములు ఫలిస్తాయి. ఇతరులకు మేలు చేస్తారు. కోర్టు వ్యవహారములు అనుకూలముగా పరిష్కారమవుతాయి. ఇంటియందుండు వారికి అలంకారలాభము. విలువగల సరుకుల వ్యాపారస్తులకు లాభము. విద్యార్థులు ఆసక్తిగా చదువుకుంటారు. 29, 30 తేదీలలో కార్యాచరణవల్ల శ్రమ. 31, 1, 2 తేదీలలో ప్రయాణము, కార్యలాభము, విలాసము, విందుభోజనము. 3, 4 తేదీలలో అలసట. వారమంతయు, కవులకు, గాయకులకు, నటీనటులకు మేలు.

***ఉత్తరాభాద్ర [దూ, శం, ఝా, థా] ***

ఈ వారము మీకుయోగదాయకముగా వుండదు. మీకు చాటుగా అపకారము తలపెట్టే వారివల్ల మీరు చేయదలచుకున్న పనులకు ఆటంకములు కలుగుతాయి. కార్యభారముచే శరీరస్థితి చెడుతుంది. ఉద్యోగస్తులకు కొంత సమస్యలు వస్తాయి. వర్తకులకు అశాంతి. 29, 30 తేదీలలో త్రిప్పట, ఆటంకములు, గృహకలతలు. 31, 1, 2 తేదీలలో బంధుసహాయము, స్వల్పలాభము. 3, 4 తేదీలలో ఆందోళన. అనారోగ్యము. రాజకీయ వాదులకు కొంత మేలు.

*** రేవతి [దే, దో, చా, చీ] ***

ఈ వారము అనుకున్నట్టు సొమ్ము చేతికి రాక కార్యములు నెరవేరవు. మిత్రులెవరో శత్రులెవరో తెలియదు. మిత్రులనుకున్నవారు తటస్థులవడం, వ్యతిరేకులని అపోహపడినవారు కలిసివచ్చి కార్యానుకూలతకు సహాయము చేయడము జరుగుతుంది. వర్తకులకు మొదట్లో లాభము లేకపోయిననూ వారాంతమునకు లాభిస్తుంది. విద్యార్థులకు శ్రద్ధ తక్కువ. 29, 30 తేదీలలో ఆశాభంగము, అధిక ఖర్చులు. 31, 1, 2 తేదీలలో ప్రయాణము. మిత్ర సహాయము, కార్యానుకూలత. 3, 4 తేదీలలో గృహమందుండువారి ఆరోగ్యచింత. విచిత్ర వస్తు సంపాదన. 

నంజన్‌గూడు పండితపాడివారి
జ్వరేగ్
సకల జ్వరములను అద్భుతముగా నివారించును.
క్యాటలాగ్ ఉచితము
హోల్ ఏజంట్లు: యునైటెడ్ కన్సర్న్, మదరాసు-1.
బ్రాంచీలు: హైదరాబాదు & విజయవాడ.

# న్యాయమెక్కడుంది?

సత్యం పార్కరు పెన్ను పోయింది. దాన్ని ఆఫీసులోనే విడిచిపెట్టాడో, లేక ఎవరికైనా యిచ్చి తీసుకోటం మర్చిపోయాడో, అతనికి జ్ఞాపకంలేదు. ఆరోజు పోస్టాఫీసుకి వెళ్ళినపుడు అక్కడో కాయన పెన్ను అడిగాడు. సత్యం ఇవ్వననలేక ఇచ్చాడు. ఆ వ్యక్తి పెన్ను తిరిగి ఇచ్చిందీ, లేనిదీ ఇప్పుడు అనుమానంగా తోచింది. ఇల్లాంటి సంఘటనలు ఎన్నో జరగటం, ఎన్నోసార్లు విన్నాడతను. పెన్ను ఇచ్చిన వాళ్లు అంత తెలివితక్కువగా, అడక్కుండా ఎలా మర్చిపోతారా, అని వాళ్లను విమర్శిస్తూ తెగతిటేవాడు సత్యం. ఇప్పుడు తమా వాళ్ల జాబితాలోకే చేరిపోవటం సిగ్గుచేటుగా వుందతనికి.

సత్యం, ఆఫీసులో తన పక్కసీటలో కూర్చునే ఇద్దరు ముగ్గురు స్నేహితుల ఇళ్ళకు పోయి పెన్నువిషయం అడిగాడు. వాళ్ళు తమకా విషయ మేమీ తెలీదంటూ పెన్ను పోయినందుకు సానుభూతి చూపిస్తూ, అంతటితో చాలించక 'ఇంత మతిమరుపు యేమిటోయ్!' అన్నారు. సత్యం వళ్ళు మంచుముక్కలా చల్లబడింది. ఒకరి చేత విమర్శింపబడటమంటే, అతనికి పరమ అసహ్యం... బాధ కూడాను. కాని, అతని ఇష్టాయిష్టాలతో ఎవరికేంపని?

ఆరోజు రాత్రి సత్యానికి సరిగ్గా అన్నం నోటికి పోలేదు. కంటినిండా నిద్రపటలేదు. ఇంట్లో ఎవరితోనూ సమంగా మనసిచ్చి మాట్లాడ్డంలేదు. ఎవరైనా యేం యిలా వున్నావని అడిగితే కసుక్కుంటేవాడు నిజం చెప్పడానికి ఇష్టంలేక. కాదూ మరి— పార్కరు పెన్ను, అంత ఖరీదుపోసి కొన్న పెన్ను, కేవలం మతిమరుపుమూలంగా పోయిందంటే ఎంత బాధగా వుంటుంది? మళ్ళీ తను అంత ఖరీదు పెట్టి అటువంటి పెన్ను కొనుక్కోగలడా? ఊహూ! ఈ జన్మలో ఈ గుమస్తా నౌకరీ చేస్తున్నంత వరకూ కొనలేడు....ఆ రాత్రంతా ఇలానే తలపోశాడు.

మరుసటిరోజు ఆఫీసుకి వెళ్ళాడే గాని, సత్యం మొహంలో మునుపటి కళాకాంతులు లేవు. నిర్జీవంగా తన సీటులో కూర్చున్నాడు. అతని కళ్ళకి ఎదురుగా టేబిలు శుభ్రపరుస్తూన్న బంట్రోతు నారాయణ అగుపించేసరికి ఎందుకైనా మంచిది వాణ్ణి అడగాలనిపించింది. "ఒరేయ్ నారాయణా!" అంటూ మెల్లగా కేక వేశాడు.

నారాయణ అంతవరకూ సత్యాన్ని చూళ్ళేదుకదూ, అతని గొంతువిని ఒక్కసారి వనక్కి తిరిగాడు.

"నమస్కారం బాబుగారూ! ఎప్పుడొచ్చారు! నేను చూడలేదు" అంటూ

## ముద్దంశెట్టి

ఇంకా యేమో అనాలనుకునేసరికి సత్యం అందుకుని,

"ఇప్పుడే వచ్చానుగాని...నిన్నను నా పెన్నుగాని ఇక్కడ వదిలిపెట్టానేవిట్రా?" అన్నాడు విచారంగా.

"ఆ యిసయమే నేనూ సెప్పాలనుకుంటున్నా బాబుగారూ! మీరు యెల్లిపోయింతర్వాత మీ టేబిలుమీద పెన్ను చూశా. పిలుద్దామన్నా, కానాదూరం పోయుంటారని వూరుకున్నా...ఇదిగోండి' అంటూ జేబునుండి పదిలంగా దాచిన పార్కరుపెన్ను తీసియిచ్చాడు నారాయణ.

లాటరీలో, పదివేలు రూపాయిలు ప్రైజు వచ్చినట్టుగా సంబరపడిన సత్యం మొహం విప్పారిన పుష్పంలా ఇంతయ్యింది. ఆప్యాయంగా, ఆత్రుతగా పెన్ను చేతిలోకి తీసుకున్నాడు. తృప్తిగా ఓమారు పెన్ను చూసుకుని 'హమ్మయ్య' అనుకున్నాడు మనసులో. పక్కసీట్లలో కూర్చున్న స్నేహితులకు చెప్పాడు పెన్ను దొరికిన వైనం.

"ఇంకెప్పుడూ ఇలా విడిచిపెటకోయ్. ఈరోజు నారాయణకి దొరికిందిగాబట్టి నీకు తిరిగివచ్చింది. అదృష్టవంతుడివే ... మరోరోజు మన గుమస్తాలలో కొందరికి దొరికితే తిరిగి వస్తుందన్న నమ్మకముండదు.."అన్నాడొకాయన. సత్యం చిన్నగా నవ్వేశాడు.

పదినిముషాలు గడిచాయి. నారాయణ ఏవో పనులు చూసుకొని వచ్చి సత్యం టేబిలుముందు నుంచున్నాడు చేతులు నులుపుకొంటూ.

"ఏంరా నారాయణా! ఏం కావాలి?' అన్నాడు సత్యం ఆప్యాయత వుట్టిపడేలా.





మీ సౌందర్యమును
పెంపొందించుటే గాక..
అన్ని ఋతువులలోను
కాపాడును




ప్రత్యేకమైన
సువాసనతో కూడినది

# ★ న్యాయమెక్కడుంది? ★

అంతకుముం దెప్పుడూ అంత ఆప్యాయంగా అడిగిన పాపాన పోలేదతను. పెన్ను పోకుండా దాచిపెట్టాడు కదా అన్న కృతజ్ఞతగా మోసు ఆరోజు అడగటంలో అంతరార్థం!

"బాబూ! ఓ రెండురూపాయి లుంటే ఇవ్వండి. ఇంట్లో బియ్యపుగింజలు లేవు. మరి మూడురోజులు గడిస్తే కాని జీతాలు దొరకవు. మీకు తెలీందేముంది?" అన్నాడు నారాయణ మెల్లగా రహస్యం చెప్తున్నట్టు.

ఆ క్షణంవరకూ నారాయణపై వుంటే సదభిప్రాయం మంచు ముక్కలా కరిగిపోయింది సత్యం హృదయంలో. పెన్ను పోయిన వైనమంతా ఓ చిత్రంలా అగుపించింది అతనికళ్ళకి. ఆలోచనలో పడ్డాడు... నారాయణకి రెండురూపాయలు అవసరం. ఆ అవసరం నిన్ననే వుండివుండాలి. కాని, ఎవర్నీ అడగలేదు. తను ఆఫీసు ఆవరణ దాటకముందే వీడు పెన్ను టేబిలుమీద చూసివుంటాడు. వెంటనే తెచ్చియిచ్చేస్తే అయివుండేది. కాని, వాడి డబ్బు అవసరం అలా చేయనిచ్చిందికాదు. తను వాడికి పూరికనే డబ్బు ఇచ్చేయకపోయినా, మామూలుగా అడిగిందానికీ, ఏదో సహాయం చేశాక అడిగిందానికీ చాల వ్యత్యాసముంటుందని వాడనుకున్నాడు. సహాయం చేశాక అడిగితే విలువ ఎక్కువ ఉంటుంది. అందుకే పెన్ను యింటికి తీసుకుపోయి, ఈ వేళ తెచ్చియిచ్చాడు. ఎందుకు? పెన్ను ఇచ్చేసిన కాస్సేపటికి రెండు రూపాయలు అడగాలనుకున్నాడు. వెంటనే తను యిస్తానని వాడికి తెలుసు. ఇదీ వాడి నాటకం! ఛీ! ఛీ!! యెంత చిన్నబుద్ధి? ఏం, నిన్ననే పెన్ను యిచ్చేస్తే, తనకి రాత్రంతా అంత గాభరాపడనవసరం వుండేదికాదే! హాయిగా నిద్రపట్టేదే! అందరితోనూ మామూలుగానే నవ్వుతూ మాట్లాడేవాడే! వీడివల్లనే కదా, యీ చికాకులన్నీ యేర్పడ్డాయి!...... యిలా వూహించిన సత్యం, ఆ విషయాన్ని నారాయణని అడిగేయాలనుకున్నాడు... అడగటమేమిటి నాలుగుచీవాట్లు పెట్టాలనుకున్నాడు. నాలుక కొసవరకూ వచ్చాయి మాటలు. కాని, యెందుకో యే అజ్ఞాతశక్తి నిరోధంవల్లనో మానేశాడు. జేబునుండి రెండు రూపాయిలు తీసి అయిష్టంగా నారాయణ చేతిలో పెట్టాడు.

నారాయణ యెంత తృప్తిపడ్డాడో, వాడి మొహమే చెప్తూంది. సత్యాన్ని మనస్సులో మాత్రం మెచ్చుకుని దీవించి వుంటాడు. వాడికా కృతజ్ఞత వుంది.

సత్యం మాత్రం తన అభిప్రాయాన్ని మనసులో దాచుకోలేక పోయాడు. నారాయణ అక్కణ్ణించి వెళ్ళిపోయాక, పక్కనే వున్న జగన్నాథంతో అనేశాడు. జగన్నాథం పటకారంగా నవ్వేడు. "నువ్వు చాలా తొందరపడి తప్పుగా వూహించేస్తూ వుంటావోయ్ సత్యం: అది ఒక్కొక్కప్పుడు ప్రమాదం కూడాను. అది చాలతప్పు. నారాయణ నువ్వనుకున్నంత నీచపుమనిషి కాదు. ఆ విషయం మనకు చాలకాలంనుండి తెలుసు. వాడికి డబ్బు అవసరమన్న విషయం నిజమే! అందుకోసమని నీ పెన్ను వాడు చూసేసరికి నువ్వు ఆఫీసు ఆవరణలో వుంటున్నా సరే యివ్వక యింటికి తీసుకుపోయి, యివాళ తెచ్చి, నీ మెప్పును పొంది, ఆ రెండు రూపాయిలు అడగాలనుకున్నాడని నువ్వనుకోటం చాల పొరపాటు. వాడి అంతస్తు యెంత తక్కువైనదో, హృదయం అంత వున్నతమైనది. అందుకే నీ పెన్ను భద్రంగా తెచ్చి నీకిచ్చాడు. అమ్ముకోడానికి ప్రయత్నిస్తే, రెండు రూపాయిలేవిటి— పదిహేను రూపాయిలయినా వస్తాయి. ఒక వేళవాడు నీ మెప్పే పొందాలంటే, నిన్న సాయంత్రం ఆ పెన్ను నీకు తెచ్చిస్తే నువ్వు వాణ్ణి మెచ్చుకోవా? అందుకే, వ్యక్తుల విలువలు అంతస్తుల్ని ఆధారంగా తీసుకొని కట్టకూడదు. ఇప్పటికైనా వాణ్ణి అర్థంచేసుకుందుకు ప్రయత్నించు...నాతో అన్నావు... యింక వాణ్ణే అడిగావుకాదు, కొంపదిసి... వాడెంత బాధపడేవాడో!" అన్నాడు జగన్నాథం.

సత్యం చిన్నబుచ్చుకున్నాడు. తను నారాయణని తప్పుగా అర్థంచేసుకున్నాడేమో ననుకున్నాడు.... నిజమే! వాడిపట్ల తనెంతో అన్యాయంగా యోచించాను... అనుకున్నాడు. ★


## తరచుగా మూత్రం వెలువడుచున్నదా?

చక్కెరతోగాని లేక చక్కెర లేకుండాగాని తరచుగా మూత్రము వెలువడుట మిక్కిలిప్రమాదకరమైన చిహ్నము. శరీరాన్ని గుల్లచేయడమే కాకుండా యీ వ్యాధి, తనబంధంలో చిక్కిన వారిని ఆరోజుకారోజు మృత్యువుకు ఆసన్నుని చేయును, ప్రథమదశలో శారీరక మానసిక శ్రమలకు యిచ్చగించకుండుట, నడుములో నొప్పి, చూపు మాంద్యము, తొడల్లో తిమ్మిరి, నరముల బలహీనతతో యీ వ్యాధి పొడచూపును. పై లక్షణములతోకూడిన వ్యాధికి వెంటనే తగిన చికిత్స చేయించకున్నచో అధికదాహం, ఆకలి, గొంతు నోరు యెండుట, దురదలు, కాళ్ళలో పగుళ్ళు తూకంతగ్గడం, శరీరమంతా పోట్లు, కీళ్ల నొప్పులు, కంటిపొరలు, క్షయ, గడ్డలు, రాచపుండ్లు, యిట్టి భయంకర బాధాకరమైన వ్యాధులు యెన్నో సంభవింపవచ్చును.

"వీనస్‌ఛారమ్" మాత్రలు వాడి, అనేక వేలమంది తమబాధల నుండివివారణపొంది మృత్యు కరాళమునుండి రక్షింపబడిరి, "వీనస్ ఛారమ్" శాస్త్రీయ పద్ధతులమీద, ప్రాచీన యూనానివైద్య విధానప్రకారం అమూల్య ఓషధుల, శాకపదార్థముల, స్వాభావిక క్షారముల సారముతో తయారైనవి. మూత్రములో పంచదార, పలుమారు మూత్రవిసర్జనచేయు అవసరము, 2 లేక 3 రోజులలోనే మీకు చాలాభాగము నివారణగును కొద్ది రోజులలోనే మీకు సగానికిపైగా స్వస్థత చేకూరినట్లనిపించును. "వీనస్ ఛారమ్" కొద్ది వ్యయముతో, సుఖముగా, తేలికగా సేవించవచ్చును. దీనికి ప్రత్యేకపథ్యము లేదు. నిరాహారముతో నుండే అవసరంలేదు రోగులు పుష్టికరమైన ఆహారము తినేందుకై రోగులు యిదివరకటికంటే యెక్కువరకాల ఆహారపదార్థములు తినికొనవచ్చును వివరములు గల ఇంగ్లీషు కరపత్రములు అడిగినచో ఉచితముగా పంపబడును ధర: 50 మాత్రల సీసా రు. 6-75 ప్యాకింగు పోస్టేజి ఉచితము.

లభించు స్థలము:

Venus Research Laboratory (A. P. W.)

P. O. Box No. 587, Calcutta.


ఒక స్నేహితుడు డాక్టరు వద్దకు వెళ్ళాడు. డాక్టరు మందుచీటి వ్రాసినతర్వాత—

స్నేహితుడు: నీఋణం ఎట్లా తీర్చుకోవాలో తెలియటం లేదోయ్. అందుచేత ఏదో నాశక్తికొద్దీ వీలునామాలో నీకూడా భాగం వ్రాశానులే.

డాక్టరు: అయితే, ఏదీ ఆ చీటి ఒక్కమారు ఇలా ఇయ్యి, మందు మార్చాలి.

కుమారి కొజవెంకటకమల, విజయవాడ.




ప్రపంచంలో మానవులంతా ఒకటేననీ, సర్వప్రాణి సమానత్వమే విశ్వకల్యాణానికి మూలమనీ ఈనాటి పెద్దలంతా చెప్తున్నారు. ఈ సత్యాన్ని ఎన్నో వేల సంవత్సరాలకు పూర్వమే మనవారు నిరూపించారు. అంతే కాదు. మానవజాతి మనుగడకు మూలమైన పంచభూతాల్ని భగవత్స్వరూపంగా ఎంచి ఆరాధించారు. అనంతసృష్టిలో గట్టు, పుట్ట, చెట్టు, సర్వము భగవత్స్వరూపంగా వారికంటికి కనుపించేవి. నాటి ప్రాచీనుల దృష్టికి నేటి నాగరికుల దృష్టికీ వుండే తేడా యిదే. అట్లా వారు ఈ సృష్టిని ఆరాధించి ఆయురారోగ్య ఐశ్వర్యాలే కాకుండా, మృత్యువునుకూడా జయించి స్వచ్ఛంద మరణాన్ని సాధించారని అనేక ఇతిహాసాలు చెప్తున్నాయి.

ఇట్లా ఆరాధించే ప్రముఖ వేల్పులలో పేరెన్నికగన్నవారు ప్రత్యక్ష దైవాలైన సూర్యచంద్రులు. వారి ఆగమనమే దివారాత్రభేదాన్ని తెల్పుతుంది. మంచీ చెడ్డా, పేదా గొప్ప తారతమ్యము లేకుండా తన కిరణజాలంతో సృష్టికి నూతనోత్తేజాన్ని కల్పించి లోకబాంధవుడనేపేరు సార్థకము చేసుకున్నాడు సూర్యభగవానుడు. సూర్యరశ్మి తక్కువై పాలిపోయిన మొక్క దగ్గరనుంచి, బూజుపట్టిన పూరగాయవరకు సమస్తము సూర్యభగవానుని బంగారు కిరణాలకోసము ఎదురుతెన్నులు చూసేవే; ఈనాటికి ఈ సత్యాన్ని మరచిపోని పశుపక్ష్యాదులు అరుణోదయాత్పూర్వమే నిద్రలేచి సూర్యాభిముఖంగా తిర్గి తమకు తేజస్సునిచ్చే బాలభానుడికి స్వాగత మిస్తాయి కలకలారావాలతో.

ఉదయించే బాలభానుడి కిరణాలు ఎన్ని రోగాలకో దివ్యౌషధా లంటారు. కుష్ఠు, బొల్లి మొదలైన అసాధ్య చర్మవ్యాధులు సూర్య నమస్కారాలతో ఏ ఔషధ సేవా అవసరము లేకుండా నయమవుతాయి. గర్భాశయ రోగాలతో వంధ్యురాలై సూర్య నమస్కారాలు చేసిన స్త్రీకి బాలభానుడి బంగారు కిరణాలు దివ్యౌషధాలు కాగా సూర్య సమాన తేజాడైన సుతుని ఎత్తుకుంటుంది.

అంతే కాదు. అనేక నేత్రరోగాలకు సూర్య నమస్కారాలు చక్కని ఔషధాలు. అందుకనే నిత్యసూర్యోపాసనచేసిన మనపూర్వులు ఆరోగ్యభాగ్యంతో చిరంజీవులుగా జీవించేవారు.

రావణసంహారానికి పూర్వము నిస్తేజుడై తన కర్తవ్యాన్ని మరచిన రామునికి ఆదిత్యకవచముపదేశించి, రామచంద్రా మీ పూర్వపురుషుడైన ఆదిత్యుని ఈ మంత్రముతో ఆరాధించి సూర్యసమాన తేజుడవై శత్రువుని జయించమని ప్రబోధించాడు అగస్త్య మహాముని. మహాముని ప్రబోధంతో బాలభానుని ఆరాధించి తేజశ్శాలిఅయిన రాముడు

# రథసప్తమి

## జనవరి 27

బి. ఎస్. లక్ష్మి

ఆరోజు యుద్ధములో శత్రువును జయించాడట. ఆరోజు రాముని తేజస్సుని వర్ణిస్తూ 'అధరవిదుర్నిదీకుహాః' అన్నారు.

అనేకమంది మహాపురుషుల జయంతులు జరుపుతున్న మనము ఏడాది కొకసారైనా లోకబాంధవునికి కృతజ్ఞతాంజలి సమర్పించటములో తప్పులేదనుకుంటా. మకర సంక్రాంతితో దక్షిణాయనము వెళ్లిపోయి ఉత్తరాయణము ప్రవేశించగా రాత్రి ప్రొద్దు తగ్గి పగటిప్రొద్దు హెచ్చుతుంది. అప్పటినుంచి చంద్రునిప్రతిభతగ్గి సూర్యుని ప్రతిభ పెరుగుతుంది. ఉత్తరాయణములోనే వస్తుంది సూర్యజయంతి. సంవత్సరమంతా సూర్యుని ఆరాధించకపోయినా, ఆ ఒక్కరోజైనా యథాశక్తి శ్రద్ధాభక్తులతో ఆరాధించినవారికి ఆయురారోగ్యాలను ప్రసాదిస్తాడు.

అన్ని పూజలకి, వ్రతాలకి మల్లెనే సూర్య జయంతినాడు జరిపే సూర్యారాధనకుకూడా ఒకవిధానాన్ని ఏర్పరచారు ప్రాచీనులు.

ఇదికూడా రాయాలా మాకు తెలియదా అనేవారికోసము కాదుకానీ తెలియనివారికి ఉపయోగిస్తుందని రాస్తున్నా. ఏటావచ్చే మాఘ శుద్ధ సప్తమినే సూర్యజయంతి (లేక రథసప్తమి) అంటారు.

ఆరోజు అరుణోదయాత్పూర్వమే నిద్రలేచి సమీపాన గలపుణ్యనదిలో అర్కపత్రము (జిల్లేడుఆకు) దానిపైన బదరీఫలము (రేగుపండు) తలమీదపెట్టుకుని స్నానముచేసి స్నానానంతరము ఈ క్రింది శ్లోకముతో బాలభానుడికి అర్ఘ్యమిస్తారు ఆబాలగోపాలము. శ్లో॥ "అర్కపత్రైస్సబదరైర్దూర్వా క్షతసచందనైః అష్టాంగవిధినా చార్ఘ్యం దద్యాదాదిత్య తుష్టయే" అని పఠిస్తారు.

"ఉదయం బ్రహ్మస్వరూపంతు, మధ్యాహ్నంతు మహేశ్వరం, అస్తమాన మహావిష్ణుః, త్రిమూర్తి దివాకరః" అన్నట్టుగా సూర్య నమస్కారాలకు కాని, సూర్యునికి అర్ఘ్యమివ్వటానికి కానీ బ్రహ్మస్వరూపుడైన బాలభాస్కరుడే శ్రేష్ఠుడని ఆర్యుల మతము. సూర్యుని మధ్యాహ్న తేజాన్ని లయకారుడైన మహేశ్వర తేజంతో సమానమై ఉపాసకుని శరీరానికి మేలుకన్నా కీడే ఎక్కువ చేస్తుంది. ఉదయించే సూర్యుని కిరణాలు అతితీవ్రతరాలు కాక ఆరాధకుని శరీరానికి, మనస్సుకి మేలు చేస్తాయనే అభిప్రాయమే దీనికి కారణం కావచ్చు.

స్నానముచేసి సూర్యార్ఘ్యమిచ్చి ఇంటికి వచ్చిన స్త్రీలు దొడ్లో సూర్యరశ్మి బాగా తగిలే చోట గోమయంతో అలికి ముగ్గులు పెట్టి, ముగ్గుమీద గొబ్బి పిడకలతో దాలి వేసి, ఒక గిన్నెలో ఆవుపాలు పోసి దాలి మీదపెడ్తారు. అవి కాగుతుండగా చిక్కుడు కాయలతో రథాలూ, బన్లాకట్టి సూర్యుని సుద్దేశించి పూజచేస్తారు. దాలిమీద పాలు పొంగినప్పుడల్లా కడిగిన బియ్యము పేరు పేరునా కాసిని కాసిని వేస్తూ పాలు పొంగినట్లుగా కులమెల్ల పొంగించమని సూర్యభగవానుని నమస్కారముచేస్తారు. పాలపొంగలి వుడికిన తరువాత 12 చిక్కుడాకుల్లో సూర్యునికి, 5 చిక్కుడాకుల్లో అగ్నిహోత్రుడికి, 8 ఆకుల్లో సాహినిదేవికి నైవేద్యము పెట్టి

# పిల్లలూ - పిల్లలతల్లులూ! (2)

ముద్దులూ, మురిపాలూ ఎక్కువగా చేసిన పిల్లలు రకరకాల మనస్తత్వాలతో తయారవుతారు. వాళ్లా పద్ధతుల్ని పెద్దయిన తర్వాతయినా ఓ పట్టాన మార్చుకోలేరు.

గారాబం జాస్తయినందువల్ల మొట్టమొదట పట్టుబడేది మొండితనం. దానివల్ల పోను పోను ఆ మొండితనం మూర్ఖంగా మారి పుతి పనికిమాలిన మొండివాళ్లుగా తయారవుతారా పిల్లలు. వాళ్ళంతట వాళ్ళకు ఏదైనా తెలుసుకునే జ్ఞానం వుండదు—మరొకళ్ళు చెబితే చెవినిపెట్టుకోరు. మరిలాటి మొండి పిల్లలను (ప్రతి చిన్నవిషయంలో) బాగు పరచటానికి తర్వాత ప్రయత్నించీ ఉపయోగం వుండదు!

మరి కొందరు తల్లులు చేసే ముద్దువల్ల పిల్లలు మహా వాపిరిగొట్టుగా తయారవుతారు. మందలించకపోవటం, నియమిత వేళల్లో వాళ్లకు ఆహారం అలాటిదేమీ చూడకుండా పూరికే ఓ వేళాపాళా లేకుండా వాళ్ళకు తినుబండారాలూ, అన్నం అదీ పెట్టడంవల్ల వాళ్ళకు ఆకలి తీరినా, తీరకున్నా ఏదో ఒకటి పొద్దస్తమానూ తినాలనే తృష్ణ జాస్తయిపోతుంది. అంతే గాదు. ముద్దు ముద్దుగా పక్కన (ఇంటిల్లిపాదీ) కూచోపెట్టుకు ఒక్కో ముద్ద అన్నం విధీవిరామం లేకుండా పెడుతుంటారు. కొందరు ఆ పద్ధతి అసహ్యకరమైనదే కాకుండా, పిల్లలకు అనారోగ్యమనే సంగతి ఆ తల్లులు మరిచిపోతుంటారు. ఎనిమిదేళ్ల పిల్లాడిని చంకలో వేసుకు గంటల తరబడి గోరుముద్దలు తినిపిస్తుండే తల్లిని నేకళ్లారా చూచాను!

ఇల్లాగే మరికొందరికి కుళ్ళుబోతుతనం, ఒంటెత్తుగుణం పట్టుబడిపోతాయ్. ఆ పిల్లలు మరొకరు తింటున్నా, ఏదైనా మంచి వస్తువు అవతల చూచినా కుళ్ళి కుళ్ళి ఏడుస్తుంటారు. అంతేగాకుండా తమ ఒంటెత్తు గుణంవల్ల అవతలి పిల్లలనుచూస్తే పూరికే కొడుతూ తిడుతూ వుండాలనిపిస్తుంటుందేమో, అవతలివాళ్ళను చెండుకుతింటుంటారు. ఇది ఎన్నేళ్లొచ్చినా మానలేని పిల్లలు ఎంతోమందున్నారు. వీళ్ళుకాక ఎప్పుడూ ఏడుస్తూ రాగాలు తీస్తుండేవాళ్లున్నారు కొందరు పిల్లలు.

## పసివి సర్పాల ప్రభావం

ఇలాటివాళ్లు కాక పై గుణాలన్నీ కలుపుకుని అతివాగుడు పిల్లలు కొందరు. వాళ్ళ ఈడుచూస్తే పది పన్నెండేళ్ళ లోపలనే వున్నా మాట్లాడే మాటలుమాత్రం ముసలి వాళ్ళమాటల్లా వుంటాయి. కొందరికి సొంత బుద్ధి నశించిపోతుంది అతిగారాబం వల్ల.

ఇలా రకరకాల పిల్లల్నిచూచి, వాళ్ళ పద్ధతులను చూస్తుంటే నిజానికి మొదట అసహ్యం వేస్తుంది...కాని ఆలోచించిన కొద్దీ అది వాళ్ళ తప్పుగాదనే సంగతి గుర్తుకొస్తుంది సాధారణంగా. అలా పిల్లలు తయారుకాకుండా వుండాలంటే తల్లి ఎంతో జాగ్రత్త తీసుకోవాలి! పిల్లలు మొండివాళ్ళుగా తయారయితే భయంపెట్టి ఆ మొండితనం మాన్పించవచ్చు. వాపిరిగొట్టుగా తయారుకాకుండా ముందేజాగ్రత్తపడొచ్చు. ప్రతిమనిషితో భోజనానిగ్గానీ, టిఫినుగ్గానీ కూచోడంలాటి పద్ధతుల్ని మందలించి మాన్పించవచ్చుగదా! ఇకపోతే అవతలి పిల్లల్నిచూచి కుళ్లుకోడం, కొట్టడం లాటి గుణాలు చిన్నగా మానుకోకుంటే, బాగా దండించి మాన్పించాలి. ఇకపోతే వయస్సుకు తగనిమాటలు మాట్లాడకుండా, సాధ్యమైనంతవరకు పెద్దవాళ్ళ మాటల్లో పిల్లల్ని జోక్యం కలుగజేసుకోనివ్వకుండా అథవా అలా మాట్లాడినా, ఒకటి రెండు సార్లలోనే బెదురుపెట్టి మాన్పించాలి. ఇవన్నీకూడా తల్లిబాధ్యతలనేదినే వేరుగా చెప్పక్కరేదు!

మరో విషయం: సర్వసాధారణంగా అమ్మమ్మలు, నాన్నమ్మలూ వుండేచోట గూడా పిల్లలు పైవిధంగా తయారవడానికి ఎక్కువ అవకాశం వుంది. కాని అలా వున్నప్పటికీ బిడ్డక్షేమం — నడవడికమీద తల్లికి బాధ్యతా—హక్కూకూడా ఎక్కువగానే వున్నాయ్. అలాటప్పుడు ఒకవేళ అవతలివాళ్లు ఎక్కువగా ముద్దుచేసినా, తన భయంవల్ల పిల్లలకు చెడ్డపద్ధతులు రాకుండా చేసుకోడానికి శాయశక్తులా ప్రయత్నించాలి. "దండం దశగుణంభవేత్" అన్నారు పెద్దలు. ఇలా అని కొట్టి చంపాలా అంటారేమో. అలా అదీ అతిగా అయినా అసలు గుణం పోతుంది. కొట్టినా, తిటినా బిడ్డ బాగుపడాలనే వుద్దేశ్యంతోనేగానీ మరోటి కాదుకదా! అలా మొదట్లోనే పిల్లల పద్ధతుల్ని నేర్పుగా చక్కదిద్దుకోలేకుంటే — ఆ తర్వాత అందరూ తమ పిల్లల్ని, పిల్లల పద్ధతుల్ని చూచి అసహ్యించుకున్నారని బాధపడి లాభం ఏముంటుంది? మొక్కై వంగనిది మ్రానై ఎన్నటికీ వంగదు! ★

---

అగ్నిహోత్రుడి భాగము మిగతా రెండు నైవేద్యాలలోది కొంత తీసి పొంగలి పుడికిన దాలిలో వేసి అగ్నికి సమర్పిస్తారు. మిగతా ప్రసాదాన్ని ఇంట్లో వారంతా తీసుకుంటారు. యిదే విధంగా మాఘ పౌర్ణమికి మాఘ ఆదివారాలు పాలు పొంగించుకుంటారు. పాలు పొంగిచుకున్న వారు ఆ రోజు మాత్రము తరిగిన కూరా, తరచినచల్లా వాడకూడదు. పై పూజ వనితలు మాత్రమే చేస్తారు. అన్ని మాసాలకన్న మాఘ మాసంలో సూర్యునిగురించిచేసిన జపతపాలు శతకోటి ఫలాన్ని ఇస్తాయంటారు. ★





CALENDARSFREE

అందమునకు వర్చస్సునకు ఎల్లకాలముల యందును రవి గ్లిసరిన్ సబ్బు వాడదగినది. రవి వెజిటబుల్ హెయిరాయిలు వాడుట వలన మెదడును చల్లబరిచి, శిరోజములను నల్లని తుమ్మెద రెక్కలవలె చేయును. స్నో & టాల్కం పౌడరు సువాసనగలవి. మీ ముఖవర్చస్సును పెంచును. పై ఏకబ సామానుకొన్నను ఒక ఫోటో ఆఫ్ సెట్టు ఫిలిమ్ స్టార్ 11" X 18" సైజు కేలండరు ఉచితము. బయటవూర్లలో మీ డిలరును అడగండి.

The New Star & Co,
Madras-21

# వంటలు

## పిండిమిరియం రకాలు

అన్ని రకాల వంటకాలు చాలా మంది చెపుతున్నారుగాని, పిండి మిరియము ఎవరూ చెప్పలేదు. నాకు తెలిసిన కొన్ని రకాలు రాస్తున్నాను. అన్నంలోకి ఆధరువుగా ఇవిచాలా బాగావుంటాయి. పులుసులు కూట్లులాగే ఇవి గూడా చేసుకుంటారు. వీటిలో మునక్కాడలు, ఆనపకాయ, బీర కాయ, పొట్లకాయ, వీటిలో ఏవైనా వేసి చేసుకోవచ్చు.

వీటికి కావలసిన సామానులు: అరపావు శేరు పెసరపప్పు, అరపావు శేరు శెనగపప్పు అరపావుశేరు కందిపప్పు, అరపావు శేరు బియ్యము. (4 ములక్కాయలు లేక ఏవైనా) ఒక తులం మిరియాలు, 2 చెంచాలు ధనియాలు, కొద్ది జీలకఱ్ఱ, 4 ఎండు మిరపకాయలు.

పప్పులు, బియ్యం రాళ్ళు లేకుండా శుభ్రంగా బాగుచేసుకుని అవన్నీ వేటికవి, దోరగా వేయించుకొనవలెను. తరువాత, మిరియాలు ధనియాలు జీలకఱ్ఱ మిరపకాయలు ఇవన్నీ కొద్దిగా నేతిలో వేయించవలెను. కమ్మని వాసన వచ్చునపుడు తీసి ఆకుంపటిమీద కళాయి గిన్నెలోగాని స్టెయిన్‌లెస్ స్టీల్ గిన్నెలోగాని ముక్కలువేసి వుడికించవలెను. ముక్కలకు తగినంత ఉప్పువేయవలెను. వేచిన పప్పులు బియ్యం మిరియాలు వగైరాలు - అన్నీ రోటిలోవేసి నీళ్ళు పోస్తూ రుబ్బుకోవలెను. కొంచెము బరకగానే వుండవలెను. (కాటుకలా వుంటే బావుండదు) ముక్కలు బాగా ఉడకగానే రుబ్బిన మిశ్రమములో తగినంత ఉప్పువేసి గరిటె జారుగా చేసి వుడికే ముక్కలలో పోసి కలుపుతూ వుండవలెను. లేకపోతే అడుగున గడ్డకట్టును. కొద్ది గరిటె జారుగా వుడకనిచ్చి దించి పోపుపెట్టుకొని వాడుకొనవలెను.

### ఇంకొక విధము:

ఒక పావుశేరు పెసరపప్పు, ఒక స్పూను మిరియాలు, ధనియాలు, కొద్దిగా మెంతులు, ఇంగువ, నిమ్మకాయంత చింతపండు రెండు మిరపకాయలు, 4 మునక్కాడలు, కొద్దిగా కరివేపాకు.

ముందుగా పెసరపప్పు రాళ్లు లేకుండా చేసుకుని, మెత్తగా వుడికించవలెను. ముక్కలు గూడదానిలో నేవుడికించవచ్చు. మిరియాలు ధనియాలు మిరపకాయలు సామాన్లన్నీ నేయివేసి వేయించుకొని, మెత్తగా నూరి వుడికిన మిశ్రమములో వేయవలెను. చింతపండు పిసికి దానిలో పోయవలెను. సరిపడ ఉప్పువేసి గరిటెజారుగా చేసి దింపి, తిరగమోతపెట్టవలెను (దింపకముందే. కొద్దిగా బియ్యపుపిండిన నీళ్ళలో కలిపిపోసి కాసేపు కలియబెట్టి వుంటే కొబ్బరివేయవచ్చు; పొట్లకాయగాని, సొరకాయ గాని గూడ వాడవచ్చు.)

## పుమ్మొత్తాల జ్ఞానభిక్షాదేవి

ఇది ఆనపకాయతోనే రుచిగావుంటుంది. పావుశేరు బియ్యం; పావుశేరు పాలు; ఒక చెంచా మిరియాలు, ఒక చెంచా ధనియాలు, ఒక చెంచా చక్కెర, సగంకాయ ఆనపకాయ కరివేపాకు.

బియ్యం తెల్లనివిగా చూచుకుని రాళ్లు వడ్లు ఏరుకుని దోరగా వేయించుకోవాలి. మిరియాలు వగైరాలుకూడ కొద్ది నేతిలో వేయించుకోవాలి. స్టెయిన్‌లెస్ స్టీల్ గిన్నెలో తరిగిన ముక్కలు వేసి మెత్తగా వుడకనివ్వాలి. వేసిన బియ్యం వగైరాలు మెత్తగా కాటుకలా రుబ్బుకోవాలి. వుడికించిన ముక్కలలో, రుబ్బిన మిశ్రమంపోసి కలుపుతూవుండాలి. కొద్దిగా ఉప్పు, చాలా కొద్దిగా ముక్కలలోనే వేస్తే చాలు. ఇది బాగా గరిటె జారుగా వుండగానే దింపి, కాసేపు ఆరనిచ్చి పాలుకాచి దానిలో పోయాలి; మంచి వాసన కావాలనే వారు, కొద్దిగా తిరగమోత పెట్టవచ్చు; (లేకపోయినా ఫరవాలేదు. చక్కెర కావాలనే వారు పాలలోనే కలిపి వేయవలెను.

## రేగుపళ్లతో

వారపత్రికలో ఎన్. సుశీలగారు వ్రాసిన రేగుపళ్ళతో వూరగాయ, పచ్చడి పెట్టటం చదివాను. నాకు ఇంకొకరకం తెలుసు. రేగుపళ్ళతో వడియాలుకూడా పెట్టవచ్చు. కాని బూడిదగుమ్మడికాయ వడియాలకుమల్లే ఇవి వేయించి వుపయోగించటానికి వీలులేదు. వూరకనే తినటానికే బాగుంటాయి.

పెట్టేవిధం: మనకు కావలసిన రేగుపళ్ళు పంచెడో, అడ్డెడో తెచ్చుకొని వాటిని శుభ్రంగా నీటితో కడిగి ఒక బుట్టలో వడవేయవలెను. నీరు బాగా ఓడినతరువాత పురుగులు పుచ్చులూ లేకుండా పళ్ళను చూచుకొనవలెను. తరువాత పళ్ళకుతగ్గ ఎండుమిర్చి, పచ్చిమిర్చి, కొత్తిమిర, కొద్దిగా ఇంగువ, ఉప్పు రోటిలోవేసి మెత్తగా దంచవలెను, మెత్తగా దంచినతరువాత బాగుచేసుకున్న రేగుపళ్ళనుకూడా వేసి దూదూగ్గా దంచవలెను. అనగా అంటీఅంటనట్లు దంచవలెను. గట్టిగా దంచిన గింజలుకూడ నలుగును. దంచిన ముద్దను గారెలకుమల్లెచేసి విశాలమైన జర్మన్ సిల్వర్ పళ్ళెములో ఒకదానితరువాత ఒకటి చొప్పున విడివిడిగాపెట్టి ఎండలో వుంచవలెను. ఒకవారం లేక పదిరోజులు ఎండబెట్టిన తరువాత గాలిచొరని, మూతగల సీసాలోవేసి దాచవలెను. వేసవికాలపు కాలక్షేపానికి ఇవి బాగావుంటాయి. వేసవికాలంలో పగటికాలం ఎక్కువ కనుక ఏమీ తోచనప్పుడు రేగువడియాన్ని చిదిపి నోట్లో వేసికొనిన చక్కగా, కమ్మకమ్మగా, పుల్లపుల్లగా వుంటుంది. గింజలను మామూలుగా వుమ్మివేయవచ్చు. చేయటంచాలాసులువు. ★

## "రసాలం"

"రసాలం" ఒకపానీయము. క్షీణించినవారికి బలమును, పుష్టిని, కాంతినీ ప్రసాదించునట్టిది. క్షయరోగులకు చాలా హితమైనది. ప్రతివారికిపథ్యకరమయినట్టిది. వీర్యవర్ధకము. ప్రతికాలమునను త్రాగొనుటవలన వ్యాధులను సాధ్యమయినంతవరకు దరిచేరనీయదు. ఉల్లాసమును, ఉత్సాహమును యిచ్చును. ప్రతివారూ చేసుకొనవీలైనట్టిది. ప్రతివారూ ప్రతిరోజూ వాడడం ఆరోగ్యాభివృద్ధికి ఎంతయేని ప్రయోజనకారి.

పెరుగు 38 తులములు. లవంగాలు ½ తులం. ఏలకులు ½ తులం. తేనె ½ తులం. నెయ్యి ½ తులం. మిరియాలు ½ తులం. కలకండ 8 తులములు.

నెయ్యి పెరుగు తేనె మినహా తక్కిన వస్తువులను చూర్ణించి (ఈ చూర్ణమున్నూ, నెయ్యి, పెరుగు, తేనె, ఏకముగా చేయాలి.) వేరొక పాత్రలో వస్త్రగాలితము చేయవలయును.

పచ్చకర్పూరము పొడిచేసి, ఒక మట్టికుండలోనంతా పూసి అందుపై పెరుగును వేయవలయును. ఒక రెండుగంటల కాలము నీడలో మూతబెట్టి వుంచవలయును. తరువాత దానిని అవసరపడునంత త్రాగొని పానముచేయవలయును.

దీనిని యే రోజుది ఆ రోజే చేసుకొనవలయును. నిలవ వుంచరాదు. ఇదియే రసాలము. దీనిని విడువక ఒక మాసము ఉపయోగించిన చక్కని సత్ఫలితములనిచ్చును.

"రసాలా బలదా పథ్యా మద్రసాహార్షణీతథా।

ప్రకాశచంద్రశేతపధి, విజయవాడ ★




## కఠిన హృదయాలు

ఆడవాళ్లలోనే ఆత్మహత్యలు, ఎక్కువని ఈ మధ్య ఒక సోదరి వ్రాసిన వ్యాసము చదివినాను. వున్నదున్నట్లుగా చాలా బాగా రాశారు. ఆమెకు నా ధన్యవాదాలు. ఆ వ్యాసము చదివినతరువాత నాఅభిప్రాయము కూడా రాస్తున్నాను. స్త్రీల ఆత్మహత్యలకు అత్తగార్లకన్నా, భర్తలే కారణమని నా ఉద్దేశము. ఎందువల్ల నంటే, అత్తాడబిడ్డలు ఎంత కష్టపెట్టినా, భర్త అనురాగంతోకూడిన చల్లని మాటలవల, భారత స్త్రీ అన్నీ కష్టాలూ మరచిపోతుంది. కాని, ఆభర్తే. కఠినుడయితే ఇక చెప్పేదేముంది! ఇక కన్యల కన్నీటి గాథ మరొక విధము. కన్యలపాలిట కట్నాలపిశాచము విలయతాండవము చేస్తున్నది.

ఈ మధ్యనే ఒక అమాయక బాలికకు జరిగిన అన్యాయము వ్రాస్తున్నాను.

పెద్దల అనుమతితో, వధూవరుల ఇష్ట ప్రకారము, కట్న కానుకలతో పెండ్లి నిశ్చయమైనది. పెద్దల మాటలు బాగానే జరిగినవి. ఇక అవరుడు కట్నము పుచ్చుకొనుట తనకు, ఇష్టమే లేదనీ, ఎటువంటి అవాంతరములు వచ్చినా, తన తల్లితండ్రులు ఇష్టపడకపోయినా, వధువు తల్లి తండ్రులు, కట్నము ఇవ్వలేకపోయినా, ఏమైనా సరే ధైర్యంగా నిలబడి రిజిష్టరు మేరేజ్ చేసుకుంటాననీ, ప్రమాణీకముచేసి, అదే ప్రకారము వ్రాసి ఇచ్చి వధువునీ, ఆమె తల్లి తండ్రులను పూర్తిగా నమ్మించాడు. పాపము ఆ బాలిక పూర్తిగా అతన్ని నమ్మింది. తను చేసుకోబోయే వ్యక్తి, ఒక ఆదర్శ పురుషుడనీ ఇంకా ఏమిటేమిటో కలలుకన్నది. కాని ఆ వధువు తండ్రి జబ్బుపడడంచేత, కొన్ని గడ్డుపరిస్థితులవల్ల అన్నప్రకారము కట్నమిచ్చి వెంటనే పెండ్లి చెయ్యలేకపోయారు. అన్నివిధాల నమ్మించిన అవరుడు సినిమాలో కథానాయకుడిలాగా చల్లగా జారుకుని ముఖంతప్పించాడు. ఇంతా నమ్మించి, చివరకు, పెండ్లాడ నిరాకరించడం చేత, ఆ బాలిక ఎంతగానో క్రుంగిపోయింది. కన్నబిడ్డ స్థితిచూడలేక ఆ బాలిక తండ్రి ఎన్ని విధాలో బ్రతిమాలినారు. కాని ఆ వరుని కఠినహృదయము కరుగలేదు. ఆఖరుకు తాను చేసిన మోసానికి ఆపిల్ల ప్రాణానికే హానిచేసుకునే స్థితిలో వున్నదని తెలిసినా అతని హృదయము కరుగలేదు. ఆ పిల్లవాడు తల్లితండ్రుల పోషణలో వుండి వాళ్లకు ఎదురుచెప్పలేక, కట్నమునకు ఆశపడ్డాడేమోనంటె చక్కగా రైల్వేలోపని చేస్తున్నాడు. ఇంతా ఎందుకు రాస్తున్నానంటే, విద్యా, వివేకముకలిగిన యువకులే ఇటువంటి అన్యాయాలు, అవివేకాలు చేస్తూ డబ్బే ప్రధానమనుకొని కట్నానికి అమ్ముడు పోతుంటె, ఇక బాలికలకు కొన్ని పరిస్థితులలో, ఆత్మహత్య తప్ప గత్యంతరమేమిటి? కాని చచ్చి సాధించలేము. 'ధైర్యే సాహసేలక్ష్మి' అన్నారు. అందుకని బాలికలందరూ, ధైర్యముగా ముందడుగు వేసి చక్కగా చదువుకొని, వుద్యోగముచేస్తూ తమ స్వశక్తిమీద తాము నిలబడి, కట్నాలకు అమ్ముడుపోయేవాళ్లను మేము చేసుకోనము, అని ఒక నిర్ణయానికి వచ్చినరోజున కన్యల కష్టాలు, కన్నీటిధారలు వుండవు. తలితండ్రులుకూడా, కట్నాలకుపోసేడబ్బు తమ పిల్లల విద్యకు వినియోగిస్తే, కన్యల కష్టాలే కాదు, తమకష్టాలు కుడా తీరుతాయి.

— ఏ. సుజాత, బందరు.

* * *

## ఓర్పుతో వ్యవహరించాలి

దద్దనాల రంగనాయకమ్మగారు ఈ నెల 1-వ తేదీ వనితాలోకంలో "నేరాలు నేర్పే గారాలు" అనే వ్యాసంలో సామాన్యంగా పిల్లలు ఏవిధంగా చెడిపోతున్నారో విపులీకరించారు.

వారు పేర్కొన్నవేగాక, గారాబంచేత చిన్న చిన్న పనులు, ఆటబొమ్మలు సాధించుకొనేవాళ్ళుకూడా వున్నారు. మా కేశీ ఒకసారి ఎందుకో అలిగాడు. అన్నం తిననని పట్టుపట్టాడు. మా ఇంట్లో పిల్లల్ని ఎవరూ బ్రతిమాలరు. కనుక కొంచెంసేపు అలాగే కూర్చొని ఆఖరుకు "నాకు బొమ్మలపుస్తకం తెచ్చిస్తే అన్నం తింటా"నన్నాడు. బ్రతిమాలటం తప్పిందికదా అని మనం సరేనంటాము. అన్నం తినేటప్పటికి ఆపుస్తకం వాడికియ్యాలి!

మరి ఇట్లాంటి పిల్లల్ని సులభోపాయాలతోనే దారికి తీసికొనిరావాలి. కనుక పిల్లల మనస్తత్వాన్నిబట్టి మనం ఓర్పుతో ప్రవర్తిస్తే ఈ బాధలు రావు; పిల్లలూ చెడిపోరు.

—కొత్తపల్లి ఉమాకుమారి.

[పెనుమలూరు.]

* * *

## "మచ్చుతునకలు"

ఆంధ్రపత్రిక జనవరి 1 వ తేదీ సంచికలో "దద్దనాల రంగనాయకమ్మ" గారు వ్రాసిన "నేరాలునేర్పే గారాలు" అన్న వ్యాసం చాలా బాగుంది. వారు వ్రాసినట్లు కొందరు (ముఖ్యంగా ధనవంతులు, ధనవంతులనే ఎందుకంటున్నానంటే బీదవారైతే ఎంతగా గాబం చేసినా పిల్లలు కోరినవన్నీ తెచ్చివ్వలేరు.) పిల్లల్ని విపరీతంగా ముద్దుచేసి మొద్దుల్ని చేస్తూంటారు. వారు ఏడేళ్ళ పిల్లాడు తిండికోసం మారాం చేశాడన్నారు. పదేళ్ళ చంటిపాప వాళ్ళ అమ్మ ఎక్కడికేనా వెళ్తే తీరుబడిగా ఎక్కడికెళ్ళింది తెలుసుకుని, అంత మందిలోనూ "అమ్మా రావే ఇంటి కెడదాం" అంటూ వెనకనుంచి ఆవిడ స్థూలకాయం మీదపడి మెడచుట్టూ చేతులేసి ఊపుతూ యికిలిస్తూంటే ఆవిడ కొడుకుని మందలించదు సరికదా వాడిని తప్పించుకుంటూ ఏకధాటిగా మాట్లాడుతూంటుంది. ఆ అబ్బాయిని "క్రాకా" అంటే అదేంకాదు మితిమీరిన గారాబం. అన్నట్టు పిల్లల వేషభావల విషయంలో చాల శ్రద్ధ తీసుకోవాలి, అన్నారు. మాకు తెలిసిన అమ్మాయి ఒకటుంది (12 ఏళ్ళుంటాయి) ఆ అమ్మాయి వేసుకునే బట్టలు, చేసుకునే ఫేషన్లూ సినిమాస్టార్‌ని మించుతూంటాయి. హేర్‌సయిల్స్, గోళ్ళు పెంచుకోడం, కళ్లు త్రిప్పడం అదోవిధమైన తల బిరుసుతనం, నిర్లక్ష్యం ప్రదర్శిస్తూంటే ఒళ్ళు మండుకొస్తుంది. చదువుకునే చిన్నపిల్లలు చేసే చేష్టలేనా యివి? "పెద్దల ప్రవ

 

# వనితావాణి



తనకి అనుకరణే పిల్లలు!" అనే మాటకి ఈలాంటివాళ్ళు మచ్చుతునకలు.

—ఎల్. వి. సరోజానాయుడు, చిత్తూరు.

* * *

## "నేరాలు: గారాలు"

'నేరాలు నేర్పే గారాలు' అన్న వ్యాసం రంగనాయకమ్మగారు, చాల బాగరాశారు. ఈ వ్యాసం చదువుతుంటే ఈ మధ్యనే జరిగిన ఒక సంఘటన గుర్తుకి వచ్చింది నాకు. మా నాన్నని ఈవూరు ట్రాన్స్‌ఫర్ చెయ్యటంవల్ల, మేము ఇక్కడికి (నెల క్రితం) వచ్చాం. మేమీవూరు వచ్చామని తెలిసి, మా అమ్మ స్నేహితురాలు మా ఇంటికి వచ్చింది. ఆవిడ ఆడపడుచుకూడ వచ్చారావిడతో. వచ్చినవాళ్ళకి తాంబూలాలివ్వాలిగా. అందుకోసం, అరటిపళ్ళు తెప్పించాం. ఫ్యాన్ పళ్ళుతెచ్చి టేబిల్ మీద వుంచాడో లేదో, ఆ పిల్లవాడు (వచ్చినావిడ ఆడపడుచు కొడుకు) నాకు పండు ఇప్పిస్తావా, లేదా? అంటూ ఏడ్వటం ప్రారంభించాడు. పైగా వాళ్ళ అమ్మని వీపుమీద, దబదబా బాదటం మొదలెట్టాడు. ఇంతచేస్తున్నా, ఆపిల్లవాణ్ణి ఒక్క మాటకూడా అనలేదు. అలా చేస్తుంటే ఇంకా నవ్వుతున్నారావిడ. వాడి ఏడుపు వినలేక పండిచ్చాను. ఆ పండు గబగబ తినేసి, మళ్ళీ వాళ్ళమ్మని ఏడిపించటం మొదలెట్టాడు పండుకావాలని. వాళ్ళు వెళ్ళిపోయేముందు. వాళ్ళిద్దరికీ పండు ఇచ్చాం. ఆ అబ్బాయికి కూడ ఇచ్చాం. తనపండు అలాగే వుంచుకొని, వాళ్ళిద్దరి చేతుల్లో పళ్ళుకూడ లాక్కున్నాడు. చూసేవాళ్ళకి మాకు విసుగేసింది కానీ, ఆ తల్లికి విసుగనిపించలా!

మాకు తెలిసినవాళ్ళల్లో ఒక అబ్బాయి వున్నాడు (20 ఏండ్లు) తాను ఒక్కడూ ఎక్కడికీ వెళ్ళలేడు. వాళ్ల అమ్మ కూడ అంతే. తను ఎక్కడికి వెడితే అక్కడికి ఆ అబ్బాయిని తీసికెడుతుంది. ఒకరోజు ఆ అబ్బాయిని మార్కెట్‌కి పంపిస్తూ, "ఒకే అబ్బాయి, నీవు ఒక్కడివి వెళ్ళకు" అని చెప్పి, మా ఇంటికివచ్చి, మా తమ్ముణ్ణి (10 ఏండ్లవాడు) తోడుచేసి పంపింది. ఏమిచోద్యం! ఇలా వ్యాసాలు రాసే వాళ్ళని ఉత్తరాలద్వార పరిచయం చేసుకోవాలని ఎంతో ఇష్టం నాకు. కానీ వాళ్ళ అడ్రెస్‌లు తెలియవుగా? నాతో వనితలందరూ ఏకీభవిస్తే, ఇంకముందె నా వ్యాసాలు రాసేవారు తమ అడ్రెస్ కూడ రాసుకుంటే బావుంటుందనుకుంటాను

—కుమారి సుజన, మార్కాపురం.]

## తండ్రి పాలూ ఎక్కువే!

దద్దనాల రంగనాయకమ్మగారు వ్రాసిన "నేరాలు నేర్పే గారాలు" చదివాను. రచయిత్రి వ్యాసంలో పిల్లల పోకిరీతనానికీ, అసభ్య ప్రవర్తనకీ కేవలం తల్లి మాత్రమే బాధ్యురాలన్నట్టుగా వ్రాశారు. ఆ అభిప్రాయం సమంజసం కాదేమో.

పిల్లల్ని గారంచేసి నెత్తికెక్కించుకుని వారు పెరిగి పెద్దవాళ్ళయాక వారి ప్రవర్తనకి బాధపడడం చాలా మంది తల్లిదండ్రులకు అనుభవమైన విషయమే! మితిమీరిన గారం చేసి పిల్లల్ని నాశనం చేయడంలో తండ్రి పాలూ ఎక్కువగానే వుంటుంది. మా స్నేహితురాలొకామె తన భర్త పిల్లవాడిని గారంచేసి చెడగొడుతున్నారని నాతో చెప్పి వాపోయేది. నేనోసారి వారింటికి వెళ్ళే అప్పుడు నాకు నిజం బోధపడింది. ఆయన ఆ పిల్లవాడిని క్రిందదింపకుండా తిరిగేవారు. కోతి అరుపు అరవమంటే అలా అరవడం, గుర్రంలా నడవమంటే అలా నడవడం...ఒక్కటేమిటి......కుర్రాడు ఏది కోరితే అది క్షణాలమీద తెచ్చి ఇవ్వాల్సిందే! లేకపోతే వినలేని మాటలతో తిడుతూ ఇంట్లో వుండే వస్తువుల నన్నిటినీ విరక్కొడతాడు. తండ్రి కొడుకు కోపాన్ని చూసి ముచ్చటపడిపోతుంటాడు. ఆ కుర్రాడికి తలిమీద గౌరవము ఏ మాత్రమూ లేదు. ఓ దాసీ దానిలా ఆజ్ఞలు జారీ చేస్తూంటాడు తండ్రి. వాడి మాటలకి, దర్జాకి నవ్వుకుంటూంటాడు. నా స్నేహితురాలి పరిస్థితి నేనున్న రెండు రోజులలో నాకు పూర్తిగా అర్థం అయింది. ఆ విధంగా పెంచుతూన్న కుర్రాడి భవిష్యత్ ఏమవుతుందో నాకు అర్థం కావడంలేదు.

పిల్లల లేతమనుస్సులలో ప్రథమంలో ఎలాంటి భావాలు అంకురిస్తాయో వాటి మీద అతని భావిజీవితం పూర్తిగ ఆధారపడి వుంటుంది. ఒకరిమీద ఎప్పుడూ అధికారం చెలాయించడం జీవితంలో సాధ్యపడదు. బాల్యంలో తల్లిదండ్రులు వారికిగల ప్రతి కోర్కనూ తీర్చి మిగిలిన వ్యక్తులమీద చిన్నచూపు ఏర్పడేలా చేస్తారు. అలా పెరిగి పెద్దవాడయిన వానికి లోకంలో వారందరూ అల్పులుగా కనిపిస్తారు. వారికి వారి స్థానం తెలియడానికి ఎన్నో కష్టాలు ఎదురౌతాయి. మొదటినుండీ ఒకర్ని లక్ష్యపెట్టకుండా పెరిగినవారికి జీవితంలో ఎన్నో మానసికమైన దెబ్బలు తగులాయి.

ఇవేమీ ఆలోచించకుండా తల్లిదండ్రులు బిడ్డల్ని గారంగాపెంచి చెడగొడుతున్నారు. తన వ్యాసంలో చక్కని ఉదాహరణలిచ్చిన రంగనాయకమ్మగారికి అభినందనాలు.—

—కె. వసుంధర, డోకిపర్రు.

* * *

## కాబేజీతో...

సోదరి కె. ఎస్. ఆర్. వాణిగారు కాబేజీతో వంటలు వ్రాశారు. అవిచేసిచూశాను. చాలా బాగున్నవి. ఆమెకి అభినందనములు. వనితాలోకం ద్వారా ఎన్నో విషయాలు నేర్చుకోగలుగుతున్నాను. వ్యాసాలు విమర్శలు, వంటలు మొదలైనవి బాగుంటున్నాయి. ఈశీర్షిక ముందు, ముందు ఇంకా అభివృద్ధి చెందుతుందని ఆశిస్తున్నాను.

—పి. వరలక్ష్మి, వైజాగ్.

* * *

## కల్పవృక్షం

ఆంధ్రవారపత్రిక (18 డిసెంబరు) లో వనితాలోకం శీర్షిక క్రింద కొత్తపల్లి, రాజ్యలక్ష్మిగారు వ్రాసిన "అమర్‌సాలు" చేసి చూశాను. చాల బాగున్నవి. వారికి నా అభివందనాలు.

వనితాలోకం శీర్షిక నాబోటి వనితలకు నిజంగా ఒక కల్పవృక్షంలాంటిదనే చెప్పవచ్చు. ఒక్కొక్కరికి తెలిసిన క్రొత్తవిషయాలను అందరూ వనితాలోకంద్వారా తెలిసికోగలుగుతున్నారు. ముమ్ముందు ఈ శీర్షికనింకా అభివృద్ధిపరుస్తారని నమ్ముతాను.

—ఎ. చంద్రలేఖ, తెనాలి.

* * *

## మనస్సులు మారాలి

జనవరి 1 తేదీ పత్రికలో కుమారి ఎ. కనకంగారు వ్రాసిన "దేవుడు వరమిచ్చినా..." వ్యాసం చదివాను. నిజమే మరి దేవుడు వరమిచ్చినా పూజారి వరమియ్యటంలేదు. వరకట్న నిషేధపు బిల్లు అయితే పాసు అయింది గాని, వరకట్నం తీసుకోకుండా వివాహానికి అంగీకరించే వరులుగాని, వరుని తల్లిదండ్రులు గాని అరుదనటంలో అతిశయోక్తిలేదు. బిల్లుతోపాటు వరుని లేక వరుని తల్లిదండ్రుల మనస్సుల్లో గూడ మార్పు రావాలి; అప్పుడే బిలు సఫలం అయ్యేది.

మాది రెక్కాడితే గాని డొక్కాడని సంసారం. మాకొక పెళ్ళీడు చెల్లెలు ఉంది. దానికి సెకండరీ గ్రేడు ట్రైనింగు ప్యాసయిన వానికిచ్చి చెయ్యాలన్నా అధమం వెయ్యిన్నూట పదహార్లు కట్నమైనా ఇస్తామంటే గాని ఎవరూ ఒప్పుకోటంలేదు. నాకూ వివాహంకాలేదు. బి. ఎస్. సి. ప్యాసయి వంద రూపాయల ఉద్యోగం చేస్తున్నాను. నేను వివాహంచేసుకోవాలంటే కట్నం తీసుకోవాలా? అక్కరలేదా? చెప్పండి. తీసుకోకుంటే మా చెల్లెలికి వివాహం అయేదెలాగ?

—సత్తిరాజు బాపిరాజు, చిలకలూరిపేట. ★

# ★ ఆడవాళ్లు - ఆత్మహత్యలు ★

(28-వ పేజీ తరువాయి)

సర్వశక్తులు ఒడ్డాడు. ఎక్కడో కానని లోకములో, యెవరికైతేనో ఆబాంబులకైని చూపడం కూడదన్నాడు. తనలోకములోనే, తనతోడి ఆడవాళ్ళయెదుటనే దానిప్రభావము చూపమని బోధించాడు. సహగమన నిరోధములో రామమోహనరాయ్ కృతకృత్యుడయ్యాడు.

వితంతువులసంఖ్య యెక్కువైంది. కాలుజారినవాళ్ళకు కడగండ్లు తప్పలేదు. కాని సత్యం పెనుబామై పడగలెత్తింది. కన్యాశుల్కాలు కాలుమోపాయి. తులమో ఫలమో కుక్కమిచ్చి మెడకు ఓ పచ్చని త్రాడుగట్టి సంతి పశువులాగ మేతవేసినా, వేయకపోయినా మోతబరువుమోసే దుస్థితికి లోనైంది. స్త్రీలపాలిట వీరుడై వెలిశాడు వీరేశలింగం. చిందరవందర స్థితిలోనున్న స్త్రీజనోద్ధరణకు నడుం బిగించాడు కందుకూరి. వితంతు వివాహాలతంతు నడిపాడు. కన్యాశుల్కాలు కాలరాశాడు. కాలచక్రం తిరిగింది. దానితోపాటు వారు వీరయ్యారు. కన్యాశుల్కం స్థానం వరవిక్రయ మాక్రమించింది. స్త్రీలే పురుషులను ఖరీదుచేసే కాలమిది! వరవిక్రయముతో చాల కుటుంబాలు నమసిపోయినా పరోక్షంగా స్త్రీకి అధికార మధికమైంది. శారదాచట్టంతో బాల్యవివాహాలకు బాలారిష్టం చుట్టుకుంది. ముక్కుమొగమెరుగని మగవానికి తెలిసి తెలియనితనములో భార్యగా చలామణి అయినప్పుడే ఆత్మహత్యలు హెచ్చుగా జరుగుతుండేవి. వయోవతంసపు వివాహాలు వృద్ధిలోకి వచ్చినది లగాయితు అలాటి వాటికి అవకాశం లేకుండా పోయింది. యుక్తవయస్సు వచ్చిన స్త్రీకి తన యిష్టమొచ్చినవాని యెన్నుకొను స్వేచ్ఛా స్వాతంత్ర్యము నేటి సంఘము, పురుషుడు కల్పించారు.

కాలుజారిన ప్రతిస్త్రీ ఆత్మహత్యలకు వడిగట్టుటలేదు. అదే వాస్తవమైతే కని విని యెరుగని చావులను చూడవలసి వచ్చేది. నేటి వివాహాలన్నీ యుక్తవయస్సు వచ్చినవారియందే జరుగుతున్నాయి. చదువు సంధ్యలు - కోర్సులు - డిగ్రీలు పూర్తిచేసిన తదుపరే నేటి విద్యాయువతి వివాహానికి సిద్ధపడుతూ వుంది. విద్య లేనివారుగూడా రెండుమూడు సంవత్సరాలు యింటబడి వుంటున్నారు. మరి వీరంతా కాలు జారకుండా వున్నారని సర్టిఫై చేయగలమా? ఇట్టి వివాహాలను సంఘము ఆమోదిస్తున్నది కదా! అట్టిసంఘానికి ఆత్మహత్యలను అంటగట్టడం భావ్యమా? అబలలని మనపైవేసిన ముద్రను అంగీకరిస్తూ, కన్యలారా జాగ్రత్తసుమా యని మన శీలత్వాన్ని చాటుకుంటున్నాము. కాలుజారిన కన్యలను వెన్నముద్దలవలె మ్రింగే సంఘమేదీ ఈనాడు పెద్దపులివలె కాచుకొని కూర్చునివున్నదేమీ లేదు. అయితే యీ కారణంగా స్త్రీ ఆత్మహత్యలు జరగడం లేదా అన్న సంశయం రావచ్చు. ఈ కారణముతో జరిగేవాటిని వేళ్ళమీద లెక్కగట్టవచ్చు. అవి అయినా ఆ కాలుజారిన స్త్రీ - కాలుజారడానికి కారకుడైన పురుషునికి మధ్య జరిగిన లోపాయికారి గాథనుబట్టే జరుగుతుంటాయి. అంతటి మగవాడు ఈలోకములో దొరకడన్న పిచ్చి మనోనిశ్చయపు చేష్టలే — తన గాఢప్రేమను మగవానియెదుట ఛాలెంజిచేసి చూపుటకు ఆత్మహత్యలతో ఆహుతి అవుతున్నారు. పోరా పుల్లయ్యాఅనేవారు కోలెడు మందివున్నారు. కుళ్ళువున్న చోటనే ఈగలు ముసురుతాయన్న విషయాన్ని మనం మననము చేసుకొంటే కాలుజారుటకు కారకుడు మగవాడు ఒక్కడే కాదన్న నిశ్చయానికి రాగలం. మగవాళ్ళను మన్ను తినిపించే మగువలున్నారు. ఆడపిల్లల విషయం తండ్రికి తెలియడం బహుఅరుదు. అట్లే తల్లికి తెలియకుండా వుండడం బహుకొద్ది. తాను ఒక ఆడదిగా తన బిడ్డను చాలమంది తల్లులు కడుపులో పెట్టుకుంటూనే వున్నారు. వారికి మనం నేర్పవలసినది ఏమీ లేదు.

స్త్రీకి పుట్టిల్లు పుణ్యలోకం, అత్తిల్లు ఆరళ్ళలోకమా!! అరణముకన్నా మరణమే మగవాడికి శరణము. మామగారి మాటలతో మానం, బావమరదుల బడాయి కూతలతో లడాయికి దూరంఅయ్యే మగవాడే అరణానికి అర్రులు చాచుతాడు. అత్తగారి ఆదరణ మాత్రం అల్లుళ్ళకు వుంటుంది. వీరు అక్కడికి వెళ్ళితే క్రొత్తఅలవాట్లను ఏలా అలవర్చుకోవాలో, వారు ఇక్కడకు వచ్చినా అంతే. పుట్టింట మగనిని మగువగా తానాదుకోవడంకన్నా, అత్తింట మగవాడుగా తన మగడాదుకోవడం అన్నివిధాలా మెరుగు. తల్లి విషం, పెళ్ళాం బెల్లమనేమాటల ఆచరణ సర్వత్రా వింటున్నాము. తల్లిమాటలతో పెళ్ళాన్ని దయ్యముగా యెంచి పారద్రోలువారు బహుఅరుదు. ఎక్కడైనా లెక్కకొకటి జరిగినా, తిరిగి ఇంకోదానికి మగడినవుతానన్న తలంపు వుంటుందిగా! తల్లిచేసే వంటవార్పుల కంగీకరించి తన జీవితాన్ని పాడుచేసుకొనేవాళ్ళు శూన్యమనాలి. భార్యాభర్తలమధ్య పేచీలతో విడిపోవడమనేది వేరేమాట. ఉన్నదానిని వెళ్ళగొట్టించి కొత్తదానిని నెత్తిన యెక్కించుకొనే అత్తలు బహుఅరుదు. అత్తల పెత్తనమంతరించింది. కొడుకు కోడలు చిలుకాగోరింకలలాగ వుంటానికి ప్రతితల్లీ ఉవ్విళ్ళూరుతుంది. గడుగ్గాయలు, గయ్యాళిగంపలెక్కడన్నా వున్నా గంజినీళ్ళకు గూడా కరువు తెచ్చుకుంటారు. కోడళ్ళ కోర్కెలే వాడవాడలా మేడలై వెలుస్తున్నాయి. స్త్రీకి తండ్రిఆస్తిలో హక్కులభించినా, అత్తింటి కాపురమే ఆనందభరితం. అన్న మనవాడైనా, వదిన మనదికాదుగా! ఆడబిడ్డలు ఎల్లకాలం మగలను అంటిపెట్టుకొని వుంటారా? ఏ వితంతువో తప్ప అలా ఎవరూ వుండరు. ఆత్మాభిమానం అలవర్చుకున్న నేటి అత్తలకు ఆత్మహత్యల పాపం అంటగట్టడం మనకే ఘోరపాపం. అత్తవారింట ఆడవాళ్ళ ఆత్మహత్యలు జరగడం లేదా అన్న ప్రశ్న రావచ్చు. అవియన్నీ పైన చెప్పినట్లు భార్యాభర్తలమధ్య వుండే వడిదుడుకులను బట్టి వుంటాయి. చేసే చేసే కాపురాలు చేరువుల, చెట్లపాలు చేసుకొనేవారు ఉభయులలో వున్నారు.

చపలాక్షి, చపలస్వభావిని అని స్త్రీని ఇంతవరకు చిత్రిస్తూ వచ్చారు. మాటకు మాట-ఇచ్చానమ్మ వాయనం, పుచ్చుకున్నానమ్మ వాయనం అన్నటుంటుంది. స్త్రీ పురుషులలో చలనములేని కాళ్ళు యెవరికీ లేవు. ఉభయులకండ్లు చలిస్తూనే వున్నాయి. కండ్లు చలించి కోర్కెల గుర్రాల నెక్కువారు ఇద్దరిలో వున్నారు. ఒకరివలన ఒకరికి తీయని కోర్కెలు తీరనప్పుడు, వారిచాటున వీరు వీరిచాటున వారూ అవినీతికి పాల్పడతారు. ఉన్నంతలో తృప్తిపడి తనగోంగూరే పుల్లనిదని తలంచి పొరిగింటికూర కర్రులు చాచక మనోరథాన్ని కట్టిపెట్టి కాపురాలను కడుగుట్టుగా నెట్టుకొచ్చేవారు ఉభయులలోనూ వున్నారు. ఇది సినిమాయుగం. అందులో పాతవాటికి పాటీలు. హాలివుడ్‌కు అనుకరణలు, ఇష్టదేవతలు నటీనటులిప్పుడు. అనుకరణలో అనుకరణ. తీయనివెన్నెలరేయి తలంపులతో తెగతెంపులు. చిక్కినది చేత బట్టుకొని చలో మదరాస్! తారలతీరు అలంకరణతో బస్సీల కెగబడి లాడ్జింగులను భర్తీచేసే ఆడవాళ్లున్నారు. అమెరికన్ జాకెట్టు అలంకరణతో కాలరు పైకి త్రోడించి స్త్రీల రాకపోకలను దారులు కాచుకొనే మగధీరులున్నారు—ఏ ఒక్కరికో వ్యభిచారాన్ని అంటగట్టుట యీనాటి కాలానికి సరిపడదు. పోనీ పురుషులలోనే ఆ దుర్బుద్ధి వుందనుకుందాం. ఇంతలోనే గొంతుక పురిపోసుకోవడం దేనికి? వ్యభిచారి, జూదరి, త్రాగుబోతు, దొంగ, కురూపి, కర్కోటకుడైన భర్తతో కాపురంచేయమని స్త్రీని బలవంతం ఎవరు చేశారు? సంఘము, పురు

# పంజాబీస్త్రీల దినచర్య

శ్రీమతి ఎన్. సుగుణ

పంజాబీలను గురించి మనం తెలుసుకోవలసినవి చాలా ఉన్నాయనిపిస్తుంది. వాళ్ళ వేషభాషలూ, అలవాట్లూ, పనిపాటలూ, మాటల్లోని తీయదనం ఇవన్నీ చూసి అనుభవిస్తే వాళ్ళ మంచిపనులను మనంకూడ నేర్చుకుందామని బుద్ధిపుట్తుంది. పంజాబీస్త్రీలు రోజంతా కష్టపడతారు. ఉత్తినే కూర్చుని బాతాఖానీ వెయ్యరు. ఇదికాక వీళ్ళ పొదుపుచూస్తే ఆశ్చర్యము వేస్తుంది. వీళ్ళెంత కష్టపడతారో వీళ్ళ దినచర్య చూస్తే తెలుస్తుంది.

సామాన్య సంసారులలో అంటే రు 250 అలోపు జీతగాని ఇంట్లో నౌకర్లుండరు. భార్య అన్నిపనులూ చేస్తుంది. నౌకర్లని ఉంచుకుందామన్నా 15 రూ॥ లకి తక్కువ ఎవ్వరూ రారు. వాళ్ళయినా తిండీ, చా, బట్టలూ ఇవ్వాలి. ఇంక చాకలికి ఎంత గొప్ప వాళ్ళయినాసరే బట్టలు వెయ్యరు. వేసినా, మగవాళ్ళ పాంట్లూ, షర్టూ, తన సిల్కు చీరెలూ, అన్నిబట్టలూ లాంటి ఖరీదయినవి మాత్రమే వేస్తారు. మిగతావన్నీ పిల్లలబట్టలు, తనచీరెలు, కమీజులు, సల్వారీలూ, దుప్పట్లూ, ఒకటేమిటి అన్నీ ఉతికి ఆరవేస్తుంది. సాధారణంగా ప్రతిఇంట్లో ఇస్త్రీపెట్టె ఉంటుంది. అన్నీ ఇస్త్రీచేసి పెట్తుంది. బట్టలు కుట్టేందుకు దర్జీకివ్వరు. అన్నీ తనే కుట్టుకుంటుంది. బజారుసామాను తెస్తుంది. ఇన్నిపనూ ఎలా చేస్తుందా అనుకుంటామా? ఇవికాక సాయంత్రం భర్తతో షికారు వెళ్తుంది.

ప్రొద్దున్నే లేచి వంటచేసి భర్తకీ, పిల్లలకీ పెట్టి, ఆఫీసుకీ, స్కూళ్ళకీ 10 గంటలకల్లా పంపిస్తుంది. ఒకరిద్దరు పిల్లలయితే, భర్త తన సైకిలుమీద పిల్లల్ని స్కూల్లో దిగపెట్టి తను ఆఫీసుకి పోతాడు. (అంటే ట్రాన్స్‌పోర్ట్ ఖర్చు తగ్గిందన్నమాట) వీళ్లు వెళ్లినతరువాత ఇల్లుఊడ్చి తడిగుడ్డతో శుభ్రపరుస్తుంది. బట్టలుతికి ఆరవేసి స్నానం, భోజనంచేసి, అంట్లు తోముకుని వచ్చేసరికి 12, 1 గం॥ అవుతుంది. అప్పుడు ఇరుగు పొరుగుల ఆడవాళ్లు వస్తారు. చలికాలం అయితే ఎండలో మంచాలు వేసుకుని అల్లుకుంటూ కూర్చుని బాతాఖానీ కొట్తారు. లేకపోతే డోలూ అవీ తెచ్చుకుని అందరూ కలసి పాటలు పాడుకుంటారు. వీళ్ళు పాడుకునే పాటలు అందరికీ వచ్చిఉంటాయి. ప్రతి స్త్రీకీ డోలు వాయించడం వస్తుంది. ఇది చూసేందుకు తమాషాగా ఉంటుంది. ఇంక పెళ్ళిళ్ళలో, పుట్టువెంట్రుకలు, జన్మదినంలాంటి శుభకార్యాలకి తప్పకుండా ఈ డోలు వాయిస్తూ పాటలు పాడటం వుంటుంది. అందర్నీ శుభకార్యానికి పిలిచినప్పుడు 'లేడీస్ సంగీత్' అనికూడ పిలుస్తారు. నలుగురూ చేరి ఉయ్యాల లూగుతూ వాటికి సంబంధించిన పాటలు పాడుకుంటుంటారు. అన్నిటికంటే వీళ్ళ మంగళంపాట (ఓం జై జగదీశాహరే)అని విన సొంపుగా ఉంటుంది. ఇలా సాయంత్రం 4 గం॥లవరకూ గడిపి మళ్ళీ పనల్లో నిమగ్నులవుతారు. చీకటిపడక మునుపే ప్రతివారూ భోంచేసి షికారు కెళ్తారు.

భర్తకి ఆఫీసు సెలవురోజుల్లో అందరూ కలసి షాపింగ్ చేస్తారు. లేకపోతే పిక్నిక్, సినీమా ఏదొఒక కాలక్షేపం పెట్టుకుంటారు.

పెద్ద కుటుంబాలవాళ్ళయితే అందరూ కలసి పనంతా చేసుకోవచ్చును. కాని ఒక్కామేఉంటే ఎప్పుడేనా బద్ధకంవేసినా కావలసినన్ని సదుపాయాలున్నాయి. రొట్టెలకి కావలసినంతపిండీ, ఎన్నిరొట్టెలువస్తే అన్నికాన్లూ ఎవరిచేతికేనా ఇచ్చి ప్రక్కనున్న హోటేలుకి పంపిస్తే వాడు రొట్టెలు చేసిస్తాడు. హోటేలే కాకుండా ఇదే వ్యాపారం చేసేవాళ్ళు వున్నారు. అంటే గోధుమపిండిస్తే రొట్టెలుచేసి ఇస్తారు. ఇలా చేసిఇచ్చినందుకు రొట్టెకి కానీ చొప్పున పుచ్చుకుంటారు. ఇంక రోజూ ఒక మనిషి 'ఠేలా'మీద ఇస్త్రీపెట్టె పెట్టుకుని ఇంటింటికీ వస్తాడు. వీళ్ళు తక్కువసొమ్ము పుచ్చుకుంటారు. ఇలా అయితే ఇస్త్రీపెట్టె లేకపోయినా, ఇస్త్రీ చేసేందుకు లేకపోయినా బాధలేదు. బొగ్గుల ఖర్చుకూడ చాల తగుతుంది. బొగ్గులు వాడగా మిగిలిన గుండతో "గోలాలు"చేసి వెలిగించుకుంటారు. గోలా ఎలా చేస్తారంటే బొగ్గులగుండ, మన్ను, నీళ్ళు కలిపి ఉండలుకట్టి ఎండపెట్టి వెలిగించుకుంటే బాగా కాలుతాయి. ఇలా అన్నిపనూ విసుపులేకుండా ఎలా చేసుకుంటారని అడుగుతే ఏమంటారో తెలుసా? నా పని నేను చేసుకునేందుకు విసుపెందుకు ఇంకోళ్ళ పనైతే విసువుకాని. అయినా నౌకర్ని పెట్టుకుని వానికి జీతం, తిండీ ఇస్తే కనీసం 50 రూ॥లు ఖర్చు అవుతుంది. దాని బదులు ఆ సొమ్ముతో మేమే పాలూ, పళ్లూ మొదలైన బలమైన ఆహారం తినవచ్చును అంటారు. ఇదీ నిజమే అనిపిస్తుంది.

మనప్రక్క సామాన్య సంసారుల్లో చదువుకున్న గృహిణులు భర్త తెచ్చే జీతం చాలక తనూ ఉద్యోగంచేసి భర్తకి సాయపడాలనుకుంటారు. కాని ఆమె ఉద్యోగం చేస్తే ఇంట్లో వంటకీ మిగతా పనికీ నౌకర్ని పెట్టుకోవలసివస్తుంది. ఆమె తెచ్చే జీతం నౌకర్ కే సరిపోతుంది. అయినా సుఖం ఉండదు. ఇంక చదువుకోని స్త్రీలయితే చదువుకుంటే ఉద్యోగం చేసేద్దుమే అని విచారిస్తుంటారు. అలాగ విచారించే బదులు ఇంటిపనులు స్వయంగాచేసుకుని వాటికయ్యే ఖర్చు తగిస్తే అది ఆర్జించినట్లే అవుతుంది. లేకపోతే ఆ సొమ్ముతో పంజాబీ ఆమె చెప్పినట్లు బలమయిన ఆహారం తీసుకోవచ్చును. ★

## స్త్రీలు - ఆత్మహత్యలు

ముడు సమ్మతించి విడాకులచట్టంలో స్త్రీకి సమానభాగ మిచ్చారే! మరి చావడం దేనికి? ఒకరిబుద్ధి ఒకరు ప్రళయాంత మనుకుంటూ జపంచేసినన్నాళ్లు ఈ భేకబుద్ధి తొలగదు.

ఏవేవో కారణాలతో జరిగే ఆత్మహత్యలకు నేటిసంఘము, పురుషుడు కారకులుకారు. పాత ఆచారాల ఆరాధన—హాలీవుడ్ అనుకరణచిత్రాలు—సారస్వతం అనునవే నేటి మానవుని అధోగతిపాలు చేస్తూవున్నాయి. ఒకతప్పును పదిసార్లు అంటే ఒప్పు అగునన్నట్లు నిత్యం కండ్లతో చెడును చూస్తున్నప్పుడు, మనస్సు చెడువైపే మొగ్గవచ్చు. మనం హంసలంగాదుగా! నీరు, పాలు-నుంచి పాలనే త్రాగడానికి. స్త్రీ పురుషులు సమానం. తప్పు అన్నది ఎవరుచేసినా తప్పే-అన్న ధోరణిలో నీతిదాయకమైన సారస్వతం సినిమాలు రాగలిగినప్పుడే ఆడవాళ్లలో ఆత్మహత్యల అధిక్యత తగ్గిపోతుండి. ★




# సోమరి

ఒక్కపల్లెటూరునందు
ఓబయ్యను రైతు ఒకడు
సోమరియై పనిమానుకు
సన్యాసము స్వీకరించె.

భగవంతుని ప్రార్థిస్తూ
పనిపాటలు చేయకుండ
ఉన్న ఆస్తి నంత నమ్మి
గడపె కొన్నిరోజులూ!

ఉన్న ఊర నున్న యెడల
గౌరవంబు దక్కదనుచు
భిక్షమెత్తి జీవింపగ
దేశయాత్ర బయలుదేరె.

ప్రక్కయూరికేగగాను
బక్కపేగు ఓబయ్యకు
ఎక్కువయ్యె జఠరాగ్ని,
ఒక్కముద్ద దొరకదాయె.

ఒక్కయింటి ముందు నిల్చి
'అమ్మా' యని పిల్చె—రాగ
"మీ కెవ్వరి కిక ఆకలి
రాకుండా మందు నిత్తు.

ఒక్కముద్ద కబళమిడుము"
అని పలికెను ఆశతోడ.
ఈమాటలు విన్న గృహిణి
విస్తుబోయి నవ్వురాగ,

"అన్నమేల, మందు తినుము,
ఆకలెల్లపోవు నీకు,
పో పో"మ్మని తరుమగాను
ఏడ్పువచ్చె ఓబయ్యకు.

ఓబయ్యకు బుద్ధివచ్చె,
కూలిచేసి బ్రతుకనేర్చె.
పనిచేయగ బాధపడడు
సోమరులకు ఇదేనీతి! 

[illegible] ప్రభాకరశాస్త్రి

# పండిత పరీక్ష

ఒకసారి సికిందర్ తక్షశిలకు వచ్చాడు. అప్పుడు తక్షశిలను అంభి అనే రాజు పరిపాలిస్తున్నాడు. అంభి సికిందర్‌కు విందుచేశాడు. మర్యాదలన్నీ పూర్తయిన తరువాత సికిందర్, అంభిని తక్షశిలలోని వింత లేమిటని అడిగాడు.

"మా పట్టణంలో చాలమంది కళాకారులున్నారు. కాని నా దృష్టిలో మాత్రం, వారిలో పదిమంది పండితులు మహామేధావులు, గొప్ప ప్రతిభావంతులుగా కన్పిస్తున్నారు. వారిని ఎటువంటి కఠినమైన ప్రశ్న అడిగినా, చటుక్కున, ఒక్క క్షణంలో జవాబిచ్చేస్తారు. వారికి చావంటే అసలు భయంలేదు!" అని వినయంగా విన్నవించాడు అంభి, సికిందర్‌కు.

"అయితే, నేను వారందరినీ పరీక్షించా లనుకొంటున్నాను." అన్నాడు సికిందర్. అంభి 'సరే' అన్నాడు.

మర్నాడు పండితులు పదిమందీ రాజదర్బారుకు వేంచేశారు. వారిని సికిందర్ ఇలా హెచ్చరించాడు:

"నేను ఒక్కొక్కరినే ఒక్కొక్క ప్రశ్న వేస్తాను. ఏ మాత్రం ఆలస్యం చేయకనే నడిగిన ప్రశ్నలకు క్షణంలో జవాబులు చెబుతూ ఉండాలి. అందరిలో ఎవరి జవాబు హీనంగా ఉంటుందో వాళ్ల తల మాత్రం తీసివేయబడుతుంది! జాగ్రత్త!"

సికిందర్ వారిలో తొమ్మండుగురు పండితులను ఒక చోట, కూర్చుండబెట్టాడు. పదవ పండితుడు అందరికంటె ముసలివాడు. ఆయన ముఖంలో బ్రహ్మ తేజస్సు వెలిగిపోతూ ఉంది. ఆయనను ప్రక్కనే కూర్చుండబెట్టి సికిందర్ ఆయన కిలా చెప్పాడు:

"తమరు, ఆ తొమ్మండుగురు పండితులు, ఒక్కొక్కరే చెబుతూన్న జవాబులువిని ఎవరి జవాబు మిగతా

**ధూళిపూడి**
**రాజా రామమోహనరావు**

వారి జవాబులకంటె హీనంగా, ఉంటుందో చెప్పాలి."

పదుగురు పండితులూ నిండు కుండల్లా కూర్చుని ఉన్నారు. సికిందర్ పండితులను పరీక్షిస్తున్నాడన్న సంగతి తెలిసి తక్షశిలా మహానగరంలోని పౌరులు చూచుటకు రాజ దర్బారుకు వచ్చారు.

"ప్రపంచంలో జీవించియున్న మనుష్యు లెక్కువా, చనిపోయిన మనుష్యు లెక్కువా?" అని సికిందర్ మొదటి ప్రశ్న.

"జీవించియున్న వారే ఎక్కువ. ఎందుచేతనంటే జీవించియున్న వారిని లెక్కించవచ్చును. కాని మరణించినవారిని లెక్కించలేము." అని మొదటి పండితుడి జవాబు. సభాస్థలి హర్షధ్వానాలతో నిండిపోయింది. సికిందర్ వరుసగా ఒక్కొక్కరినే అడుగుతున్నాడు. సమాధానం చెప్పినప్పుడల్లా, తక్షశిల పౌరులు అలా హర్షధ్వానాలు చేస్తూనే ఉన్నారు.

"ప్రపంచంలో భూమిమీద ఎక్కువ ప్రాణులున్నవా, సముద్రంలో ఎక్కువ ప్రాణులున్నవా?"

"సముద్రం కూడా భూమిమీదే ఉంది కనుక భూమిమీదే ఎక్కువ ప్రాణులున్నవి."

"జంతువులలో అద్భుతమైన దేది?"

"అద్భుతమైనది అంటే అర్థం మనం ఇంతవరకూ, ఎప్పుడూ చూడనిది అని. కనుక ఏ జంతువునైతే మనం ఇంతవరకూ చూడలేదో, అదే అద్భుతమైనది."

"ధైర్యవంతుడైన సిపాయి, మృత్యువుకు ఎందువలన భయపడడు?"

"మరణమే ధైర్యవంతుడైన సైనికుని జీవిత లక్ష్యం. అటువంటివానికి చావంటే భయమెందుకు? అతడు జన్మించినది మొదలు మృత్యువుకు సమీపంలోనే సంచరిస్తాడు. మర

ణించిన తరువాత తిరిగి జన్మించి నవ జీవితాన్ని పొందుతాడు."

"మొదట పగలా, రాత్రా?"

"పగలూకాదు, రాత్రీకాదు. ఈ రెండిటిలో ఏది ముందైనా, ఏది వెనకైనా ప్రపంచం మొదలంటా నాశనమైపోతుంది. సృష్ట్యాదినుండీ పగలూ, రాత్రీ ఉన్నవి."

"మనం ప్రపంచాన్ని ఏ విధంగా ప్రేమించగల్గుతున్నాము?"

"సౌందర్యరాశిగా ప్రేమించ గల్గుతున్నాము. అసహ్యంగానూ, భయానకంగాను ఉండే దానిని, ఎవరూ ప్రేమించలేరు."

"ఒకవేళ ఏమనిషైనా కనుక దేవత అయిపోవాలని కోరుకుంటే మిగిలినవాళ్లేం చేస్తారు?"

"ఎవరయినా కనుక అలాచేస్తే మరొకరు అలా చేయుటకు సాహసించరు."

"చావు, బ్రతుకుల రెండింటిలో ఏది గొప్పది?"

"బ్రతుకే గొప్పది. ఎందుచేతనంటే బ్రతుకులో, ఎన్నెన్నో దుఃఖాలూ, సుఖాలు ఉంటాయి. చస్తే అవేమీ ఉండవు."

"మానవునికి, ప్రాణం ఎంత వరకూ ఉండవలెను?"

"బ్రతికి ఉండడంకంటె చనిపోవడం మేలు అనుకునేటంత వరకే ప్రాణం ఉండవలెను."

సికిందర్ తొమ్మండుగురు పండితుల హృదయాహ్లాదకరములైన జవాబులూ బాగుగా విన్నాడు. తర్వాత తనదగ్గరనే కూర్చుండబెట్టిన పదవ పండితుడివైపు తిరిగి ఇలా అడిగాడు:

"ఈ జవాబులు తొమ్మిదింటిలోను ఎవరి జవాబు అన్నిటికంటె హీనంగాఉందో తమరే న్యాయంగా చెప్పండి"

పదవ పండితుడు బాగుగా ఆలోచించసాగాడు. ఆయన ఎవరి జవాబు బాగుగా లేదని చెబుతాడు! ఒకవేళ అలా కనుక చెబితే వాళ్ల తల ఎగిరిపోతుంది. కనుక కర్ర విరుగకుండా, పాము చావకుండా ఇలా చెబితే బాగుంటుందనుకొని తొణుకూ బెణుకూ లేకుండా ఇలా చెప్పాడు.

"వీరందరి జవాబుల్లోను ప్రతియొక్కరి జవాబూ మిగిలినవారి జవాబులకంటె తీసికట్టుగా ఉంది."

సికిందర్ తొమ్మండుగురు పండితుల జవాబులూ విని ఉబ్బితబ్బిబ్బైపోతున్నాడు. ఇప్పుడు, పదవ పండితుడి జవాబు వినడంతో ఇక అతని సంతోషానికి మేరలేదు.

అప్పుడు సికిందర్ అత్యుత్సాహంతో అంభినిచూచి,

"నేను ఇదివరకెన్నడూ, ఎక్కడా ఇటువంటి పండితులను చూడలేదు. నిజంగా వీరందరూ, మీ రాజ్యంలో 'దశరత్నాలు' అన్నాడు. ఇట్టి మహామేధావుల జవాబులు వినడంవల్ల నాజన్మ ధన్యమైంది.

సికిందర్ వారందరినీ తన ఆనందానికి తగిన రీతిగా సత్కరించాడు! అటువంటి పండితులు తనరాజ్యంలో ఉన్నందుకు అంభి ఎంతో సంతోషించాడు!

తక్షశిలా మహానగర పౌరులు పండితులందరినీ నగర వీధుల్లో అత్యంత వైభవోపేతంగా ఊరేగించారు!



[హిందీకథ ఆధారంగా]


దానిని గురించి ఆలోచించండి

అది ఇన్‌ఫెన్‌టోన్ రిజిస్టర్డు

గ్రైప్ వాటర్

నాకు కావలసినట్టిది

హైదరాబాద్ కెమికల్
అండ్ ఫార్మసుటికల్ వర్క్సు లిమిటెడ్
హైదరాబాద్ — దక్కన్



PSHC-28



# అన్నప్రాశన

వెంకట్రామయ్యగారు తన కోర్టు వ్యవహారాలన్నీ పూర్తిచేసుకుని 'అమ్మయ్య' అంటూ పెద్ద నిట్టూర్పు విడిచారు. హైద్రాబాద్‌లో ఈ పదిహేను రోజులూ, హోటలు భోజనం తినలేక ప్రాణం విసుగెత్తి పోయింది. నిమిషం కూడా, వృథా చెయ్యకుండా యింటి వద్ద వ్రాలాలనుకున్నాడు. అదీకాక ఆ మర్నాడే ఆయన కుమారునికి అన్నప్రాశన. ఇక ఎట్టి పరిస్థితులలోనూ వెళ్ళక తప్పదు. కాని ఎలా? రైలు సాయంకాలం గాని బయలు దేరదు. ఏంచెయ్యాలి? హఠాత్తుగా ఆయనకు హైద్రాబాద్ నుంచి బెజవాడకు క్రొత్తగా బస్ సర్వీసు వేసినట్లు గుర్తుకొచ్చింది. తక్షణమే సామానుతోసహా బస్ స్టాండుకు పరుగెత్తాడు. అదృష్టవశాత్తు తను సమయానికి రావడం వలనసీటు కష్టం లేకుండా దొరికింది. ఉదయం బయలుదేరిన బస్సు సాయంత్రం నాలు గింటికిగాని జేరలేదు. అక్కడినుంచి తన వూరు నాలుగు మైళ్లుంటుంది. నడిచి పోవాల్సిందే. ఆకాశం నిర్మలంగా వుంది. ఎండ కొంచెం తీవ్రంగానే వుంది. ఆయినా లెక్క జేయకుండా వెళ్ళి తీరాలనుకున్నాడు. ఉదయ మెప్పుడో హైద్రాబాద్‌లో కాఫీ త్రా గాడు. తీవ్రమయిన ఆకలి, దప్పిక ప్రారంభించాయి. ఆ సమయంలో ఎవరన్నా ఓ గుక్కెడు మంచినీళ్లిస్తే ఏంచేయమంటే అది చేసివుండేవాడు. ఇంతదూరం వచ్చినా ఆయనకు బావి ఎక్కడా కనిపించ లేదు. వూరింకా సగం దూరముంది. చుట్టూ కలయ చూశాడు. రెండు మూడు ఫర్లాంగుల దూరంలో ఒక చేలో బావి వున్నట్లు కన్పించింది. తనకు తెలియకుండానే కాళ్లు అటు వైపుకు లాక్కెళ్లాయి. బావి వుందికాని చేదలేదు. అదృష్టవశాత్తు అక్కడేవున్న పొదలో చేద కనిపించింది. బహుశా చేను ఆసామి దాచివుంటాడు, ఎవరూ ఎత్తుకుని పోకుండా. ఆదరా బాదరా నీళ్లతోడి దాహం తీర్చుకొని, కాస్త మొఖం కడుక్కున్న తర్వాత, కొంత ఉపశమనం దొరికి, తిరిగి మళ్లీ తన ప్రయాణం సాగించాడు. ఆ



DL. 322 A-X52 TL

బొక్కెనకు మనస్సులోనే ధన్యవాదాలర్పించాడు. వెంకట్రామయ్యగారు యింటికి చేరుకునేటప్పటికి దాదాపు ప్రొద్దు కూకింది. "ఏమండీ యింత ఆలస్యంగా వచ్చారేం" అంటూ భార్య విశాలాక్షమ్మగారు చంకలో పిల్లవానితో ఎదురొచ్చింది. మీరు లేకుండానే అన్న ప్రాశన చేయాలేమోనని దిగులుపడి పోయాను. అమ్మయ్య! ఎలా అయితేనేం! సమయానికి వచ్చారు. అంటూ భారమైన నిట్టూర్పు విడిచి పిల్లవాణ్ణి ఆయన చేతి కందించింది. ఇంతలో తండ్రిరాకచూసి దగ్గరలో ఆడుకుంటూన్న రేఖ, ఆ అమ్మాయి తోపాటు, గుండులా, ఆరోగ్యంగావున్న ఓ అబ్బాయి పరుగెత్తు కుంటూ వచ్చారు. ఆయన రేఖకు, నాలుగు చాక్లెట్లు యిచ్చి, ఆ అబ్బాయికి కూడా యిస్తూ "ఈ అబ్బాయెవరే" అంటూ, కుతూహలంగా అడిగారు. "మన సుందరి కొడుకు కాదుటండీ!" వాళ్లూ యీ రోజే వచ్చారు, అన్నప్రాశనకు. "మీ మేనల్లుని మర్చిపోయారా?" అంటూ ఆమె ఫక్కున నవ్వింది. "ఆ! నేను చూసినప్పుడు సన్నగా వుండేవాడు. ఇప్పుడు గుండు ముక్కలా బలిశాడు. మరిసుందరేదీ?" అంటూ ప్రశ్నించారు "ప్రక్కవారింటికి వెళ్లింది. ఇప్పుడే వస్తుంది. మీరు స్నానం ఆవీ కానీయండి. ఎప్పుడు భోంచేశారోయేమో" అంటూ విశాలాక్షమ్మగారు యింట్లోకి వెళ్లారు. కావలసిన తయారీలన్నీ చేయడానికి. వెంకట్రామయ్యగారు కూడ లోనికి వెళ్లి కుమారుని ఉయ్యాలలో పడుకోబెట్టి స్నానానికి బయల్దేరారు. వెంకట్రామయ్యగారు బడలికంతా పోయేలా హాయిగా వేణ్ణీళ్ల స్నానం చేసి భోజనానికి కూర్చున్నారు. విశాలాక్షమ్మగారు దగ్గరేవుండి భర్తకు ఆప్యాయంగా వడ్డిస్తోంది. మామూలు, వంకాయకూర కాకుండా, జిలేబీ, లడ్డూ, అరిశెలు అన్నీ ఆయన ముందు వుంచారు. వెంకట్రామయ్యగారు బాగా ఆకలిగా వుండటంచేత ఆదరా బాదరా తినేస్తున్నారు. విశాలాక్షమ్మగారు "ఏమండీ వెళ్లిన పనయిందా?" అంటున్నా ఆయన వినిపించుకోలేదు. ఇకవుండ బట్టలేక ఏమండీ పదార్థాలు అంత బాగున్నాయా?" అని అడిగింది. వెంకట్రామయ్యగారు పళ్లెంలో మిగిలిపోయిన కూరను ఆప్యాయంగా తింటున్నారు.

"ఆహా! ఎంతో బాగున్నాయి. ఈ జిలేబీకూడా ఎంతో బాగుంది. హైద్రాబాద్‌లో హోటళ్లలో ఎన్నో పదార్థాలు చూసేవాణ్ణి. అదేమిటో తిన బుద్ధయ్యేదికాదు. కాని యివి ఎంతో రుచిగా వున్నాయి. అన్నట్టు యివన్నీ ఎందుకు చేశావు! అన్నారు ఆశ్చర్యంగా.

"రేపే కదండి అన్నప్రాశన. ఇంతలోనే మతి మరుపా నేనూ మీ చెల్లెలూకలిసి 'డాల్డా'తో తయారు చేశాం"

"ఏమిటి 'డాల్డా'తోనా? అంటూ వెంకట్రామయ్యగారు నివ్వెర పోయారు. అయితే యీ వంకాయకూర, కూడా, 'డాల్డా'తోనే తయారు చేశారా?

"అవును 'డాల్డా'తోనే. అన్ని పదార్థాలూ 'డాల్డా'తోనే తయారు చేశాం. అది చాలా పుష్టికరమేకాకుండా చౌక అని కూడా మీ చెల్లెలు చెప్పుతుంది. అని విశాలాక్షమ్మగారు అంటూవుండగా అడుగుల చప్పుడయింది. సుందరి వస్తూనే యీ చివరి మాటలు విన్నది, ఆమెకూడా అందుకుంది,

"అవునన్నయ్యా 'డాల్డా'తో అన్నీ చేయవచ్చు పోపువేయడం మొదలుకొని కూరలు, పులుసు, ఒకటేమిటి సమస్త పదార్థాలూ తయారు చేయవచ్చు. మంచి నేతిలో విటమిను "ఎ" ఎంతుందో అంతే 'డాల్డా'లో కూడావుంది, అంతేకాకుండా విటమిను "డి" కూడా యిందులో కలప బడింది, పైగా నేతికంటే చౌక, పుష్టికరంకూడాను" మేమంతా అదేవాడుతున్నాం, అన్నది గ్రుక్క తిప్పుకోకుండా. వెంకట్రామయ్యగారికి ఇందాక తనమేనల్లుణ్ణి ఎందుకు గుర్తుపట్టలేకపోయాడో యిప్పుడర్థమయింది, ఇంతలో విశాలాక్షమ్మగారు అందుకుని, "ఏమండీ మనమూ రేపటినుండి 'డాల్డా'నే వాడదాం, మనకు పాడివున్నా భోజనాలకు కావలసిన నేతికి, త్రాగటానికే సరిపోతుంది, పాలను హాయిగా పాలలాగే త్రాగుదాం, మిగతా అన్ని వంటలకు మనం 'డాల్డా'ను ఉపయోగించడం మంచిది.

"అయితే 'డాల్డా' మనవూళ్ళో దొరుకుతుందా"? అన్నారు వెంకట్రామయ్యగారు అనుమానంగా,

సుందరి అందుకుని, "ఆహా! అన్నిచోట్లా దొరుకుతుంది వనస్పతి విడిగా కొనరాదు సీలు చేసిన టిన్నుపై ఖర్జూరపు చెట్టు గుర్తుందో, లేదో చూసి మరీ కొనాలి" అన్నది సుందరి.

"వెంకట్రామయ్యగారికి సాయంత్రం తాను వస్తూండగా బావి వద్ద జరిగిన సంఘటన గుర్తుకొచ్చింది. ఈ విషయం వారికి వర్ణిస్తూ, 'డాల్డా' మన ప్రాంతాలలోనూ విరివిగావాడ బడుతూన్నట్లు కనబడుతూంది. లేక పోతే చేలో బావి దగ్గరకూడా 'డాల్డా' టిన్ను ఎలావుంటుంది అయితే రేపటినుండి మనమూ 'డాల్డా'నే వాడదాం. ఎందుకంటే అది చాలా పుష్టికరమైనది, చౌకగూడాను." అంటూ సంతోషంగా చేతులు కడుక్కోడానికి లేచారు,

హిందుస్తాన్ లీవర్ లిమిటెడ్ బొంబాయి

DL.322 B-X52 TL

## వ్యాధిగ్రస్తులు సలహా పొందండి!



1. పోలియో, 2. ముఖము, మెడ, అవయవములు, పార్శ్వము లేక పూర్తివాతరోగం. 3. రక్తపోటు. 4. చెవుడు. 5. మూగ, నత్తి. 6. గుడ్డి, మెల్ల. 7. మతిభ్రమణ. జబ్బులచే బాధపడు వారందరు మా డాక్టరుగారు కవిరాజ్ ఓంప్రకాశ్ బి.ఏ., భిషగాచార్య, ధన్వంతరి, రిజిష్టర్డ్ ప్రాక్టీషనర్, ఢిల్లీ, వారిని యీ క్రింది ప్రదేశములలో కలుసుకొని వైద్యసలహా పొందండి.

**విజయవాడ :** మోడరన్ కేఫ్, గవర్నరుపేట 5-2-58 ఉ॥ 9—12.
**రాజమండ్రి :** శాంతి నివాస్, 6-2-58 ఉ॥ 8—11.
**విశాఖపట్నం :** గ్రీన్ లాండ్స్ హోటల్ 7-2-58 ఉ॥ 8—11.
**కాకినాడ :** రావ్స్ ఎం. ఎల్. హోమ్ 8-2-58 ఉ॥ 8—10.
**మచిలీపట్నం :** ఇంద్ర భవన్, 9-2-58 ఉ॥ 8—11.
**గుంటూరు :** ఉడిపి శ్రీ కృష్ణ భవన్, 10-2-58 ఉ॥ 7—9½.
**నెల్లూరు :** నేషనల్ లాడ్జి, బోర్డింగ్ & లాడ్జింగ్, 11-2-58 ఉ॥ 8-11
**మద్రాసు :** ఉడ్‌లాండ్సు హోటల్, మైలాపూర్ 12-2-58 ఉ॥ 8—12; మ॥ 1—3.
**మంగళూరు :** జయాకేఫ్ 25-2-58 ఉ॥ 8-11.
**బెంగుళూరు :** మద్రాస్ వుడ్ లాండ్స్ హోటల్ 27-2-58 ఉ॥ 10-1.
**అనంతపురం :** గజేంద్ర విలాస్ 28-2-58 ఉ॥ 8—11.
**కర్నూలు :** శ్రీ వెంకటేశ్వర హోటల్, 1-3-58 ఉ॥ 8-11 గం॥
**హైద్రాబాద్ :** తాజ్ మహల్ హోటల్ కింగ్ కోఠిరోడ్, 2-3-58 ఉ॥ 10—1 మ॥ 2—4.

## ARYAVARTA POLIO ASHRAM.

114-E, Kamla Nagar, Delhi.

**ఫోన్ :** 27858. తంతి: "Poliocure"

పై వ్యాధులను నివారణ విధానములను తెలుపు చిత్రములతో నున్న పుస్తకం "Polio-myelitis & Ayurveda" (ఇంగ్లీషు) ప్రతివెల రు. 7.50; పోస్టేజి 90 న. పై.

N.B. సలహాలు ఇంగ్లీషు, హిందిలో యివ్వబడును. సలహాలకు చార్జీలు సరసం.


# న్యూఢిల్లీ లేఖ

(5-వ పేజీ తరువాయి)

కులను పనికాగానే తొలగించరాదని ఒక నినాదం లేవదీశారు. మరోవంక రాష్ట్రప్రభుత్వాలు "కాంగ్రెసు ప్రభుత్వ అభినందనలతో" అని రైతులకు నీరు సప్లయిచేయాలని వాదిస్తున్నాయి.

ఈవిధంగా అటు నీటి సరఫరాకు రావలసిన రివిన్యూనూ కొల్పేస్తున్నారు. ఇటు పని అయిపోయినా కార్మికుల జీతభత్యాలు భరిస్తూనూ ఉన్నారు.

**సమస్య ఇది:**- నీటిపారుదల సౌకర్యాలను ఉపయోగించి, ధాన్యం దిగుమతులను తగ్గించివేయటానికి ఎందుకు ప్రయత్నించడంలేదు? రాష్ట్రాలు అడిగినప్పుడల్లా కేంద్రం ఆహార సహాయం ఎందుకు చేస్తోంది?

ప్రపంచంలోకెల్లా ఎత్తయిన, బ్రహ్మాండమైన డాములు కడుతున్నామని ప్రచారమైతే ముమ్మరంగా జరుగుతూనే ఉంది. కాని వీటివల ఏమి ఫలితాలు సాధించారూ అని ప్రశ్నిస్తే మాత్రం జవాబులేదు.

అవును మరి, చేతులు మారటానికేగదా డబ్బు! అలాగే చేతులు మారుతూనే ఉంది.

* * *

నీటిపారుదల ప్రాజెక్టుల్లో గాని, కమ్యూనిటీ ప్రాజెక్టుల్లో గాని పూర్తయిన స్కీముల నిర్వహణం, అజమాయిషీ చాలా ముఖ్యమైన బాధ్యత. బలవంత్ రాయ్ మెహతా కమిటీ వారు జరిపిన దర్యాప్తులో ఈ క్రింది విషయాలు వెల్లడయ్యాయి :—

ఆయా ప్రాజెక్టులపనిలో పాల్గొన్న వారిని పిలిచి దర్యాప్తుచేస్తూ రోడ్లమీద అజమాయిషీ ఎవరికి ఉండాలని అడిగితే, నూటికి 18 గురు ప్రభుత్వానికి ఉండాలన్నారు. 30 మంది పంచాయతీలకనీ, 25 మంది రోడ్లవలన ఎవరికి ఉపయోగముంటుందో వారికనీ సమాధానమిచ్చారు. ఇది చిత్రమే. రోడ్లవలన యావన్మందికీ ఉపయోగముంటుందని నూటికి 25 మందికి తెలియదన్నమాట. దీనివల్ల ఇంకోటికూడా తెలుస్తుంది. ఆయా ప్రాజెక్టుల్లో కొన్ని కొన్ని వృత్తులవారు ఏమీ పాల్గొనలేదన్నమాట. పాఠశాలలపై అజమాయిషీ బాధ్యత ఎవరిదని అడిగితే నూటికి 21 మంది ప్రభుత్వానిదనీ, 22 మంది పంచాయితీలదనీ, 23 మంది వాటివల్ల ఉపయోగం పొందే వారిదనీ చెప్పారు. బావుల విషయంలో నూటికి 37 మంది పంచాయతీలదని, 23 గురు బావుల్ని ఉపయోగించే వారిదని, 5.2 మంది ప్రభుత్వానిదని చెప్పారు. మురికి కాల్వల విషయంలో నూటికి 50 మంది వాటిని ఉపయోగించేవారిదే బాధ్యత అనీ, 7 గురు పంచాయతీలదనీ చెప్పారు. అంటే సగానికి సగం మందికి మురికి కాల్వల ఉపయోగం అందరికి ఉంటుందని తెలియదన్నమాట. కమ్యూనిటి కేంద్రాల విషయంలో నూటికి 30 మంది పంచాయతీల బాధ్యత అని, 11 మంది కేంద్రాల నిర్మాణంలో పాల్గొన్న వారి బాధ్యత అనీ, ఇద్దరు ప్రభుత్వానిదనీ అన్నారు.

* * *

కేంద్ర ప్రభుత్వంలోని ఇద్దరు ఉన్నతోద్యోగులు ఇండియన్ సివిల్ సర్వీసులో 35 ఏళ్ళ పరిమితిని మొన్న పూర్తిచేశారు. ప్రధాన కార్యదర్శి సర్ రాఘవన్‌పిళ్ళె ఒకరు, రాష్ట్రపతి కార్యదర్శి శ్రీ సి. ఎస్. వెంకటాచారి ఒకరు. సర్ రాఘవన్ 1898 జూలై 24 న, శ్రీ వెంకటాచారి 1899 జూలై 11 న జన్మించారు. మొదట వీరిద్దరూ మద్రాసు విశ్వవిద్యాలయంలో చదువుకుని, తరవాత కేంబ్రిడ్జి, ట్రినిటికాలేజీలో చదువుకున్నారు. ఇద్దరూ 1923 జనవరిలో, వెంకటాచారి 15 న రాఘవన్ 16 న ఇండియన్ సివిల్ సర్వీసులో చేరారు. రాఘవన్ మొదట అప్పటి సెంట్రల్ ప్రావిన్సులో అసిస్టెంటు కమీషనరుగాను, డిప్యూటీ కమీషనరుగాను 1927 దాకా పనిచేసి, ఆతర్వాత మరన్నో ఉద్యోగాలు చేశారు. స్వాతంత్ర్యం వచ్చాక ఈయన ఫ్రాన్సుకు మొట్టమొదటి భారతరాయబారిగా నియుక్తులయ్యారు. తరవాత భారతదేశంవచ్చి మంత్రివర్గ కార్యదర్శి అయ్యారు. పిమ్మట సర్ గిరిజాశంకర్ బాజ్‌పాయ్‌స్థానంలో ప్రధాన కార్యదర్శి అయ్యారు. ఈయన ఉద్యోగపరిమితి ఇప్పుడు పొడిగించారు.

శ్రీ సి. ఎస్. వెంకటాచారిని యు. పి. లో వేశారు. అప్పటి పొలిటికల్ డిపార్టుమెంట్‌లో పశ్చిమ భారతంలో గవర్నర్ జనరల్ ఏజెంటుకు సహాయకార్యదర్శిగాను, బరోడాలోని రెసిడెంటుకు సహాయకుడుగాను, 1930 లో మధ్య భారతంలో జనాభాలూపరింటెండెంటుగాను, 1933 లో యు. పి. లో గ్రామాభివృద్ధిశాఖలోను పనిచేశారు. 1937 లో మలయాలో భారత ప్రభుత్వ ఏజెంటుగాను, ఆపిమ్మట యు. పి. లో అలహాబాదుకు కమీషనరుగాను, తరవాత జోధ్‌పూర్‌కు, బికనీరుకు దివానుగాను పనిచేశారు. బికనీరు దివానుగా ఉన్నప్పుడే ఆయన రాజపుత్రసంస్థానాలన్నిటినీ విలీనీకరించడంలో సర్దార్ పటేలుకు తోడ్పడ్డారు. 1951 లో శ్రీ వి. పి. మీనన్ స్థానే స్వదేశీ సంస్థానాలశాఖ కార్యదర్శి అయ్యారు. 1954 లో రాష్ట్రపతికి కార్యదర్శి అయ్యారు. వీరిప్పుడు ఈపదవినుంచి ఈ జనవరి 15 న రిటైరయినారు. ★




# స్టూడియోలో సుకర్నో

ఈ నెల 10 వ తేదీన బొంబాయి సినిమా రంగంలో చెప్పుకోదగిన ఒక సంఘటన జరిగింది. ఇండొనీషియా అధ్యక్షుడు డా॥ సుకర్నో గోరేగాంలోని ఫిల్మిస్తాన్ స్టూడియోను దర్శించారు. బొంబాయిలోని ఫిల్మ్ స్టూడియోలను ఒక దేశంఅధినేత వచ్చి అన్నీ చూడటం ఇదే మొదటిసారి. డా॥ సుకర్నో పూర్తి మిలిటరీ యూనిఫారమ్‌లో ఉన్నారు. కాలరుకు అధ్యక్ష చిహ్నమైన నక్షత్రం తగిలించుకున్నారు. తన స్వంత పరివారంతోను, బొంబాయి ప్రభుత్వాధికారులతోను, పోలీసు అధికారులతోను, ఇండొ

## బొంబాయి సినిమా లేఖ
[మా ప్రత్యేక ప్రతినిధి]

నీషియాలోని భారత రాయబారి శ్రీ జి. పార్థసారథి, బొంబాయిలోని ఇండొనీషియన్ కౌన్సల్ జనరల్ సతి, ఇంకా ఇతర ప్రముఖులతోను ఆయన సరిగ్గా మధ్యాహ్నం రెండున్నరకల్లా స్టూడియోకి వచ్చారు. ఇంత ఆటహాసంగా ఒక రాజ్యాధినేత తన స్టూడియోకి వచ్చినా శ్రీ తులారాంజలాన్ గొప్పగా ఏర్పాట్లేమీ చేయనేలేదు. ప్రత్యేకంగా అలంకారాలేమీ చేయలేదు. ఎక్కడా సందడిలేదు. కాకపోతే గేటు దగ్గిర ఇండొనీషియా పతాకం ఒక్కటంటే ఒక్కటి ఎగరవేశారు. స్టూడియో సిబ్బందిని కార్మికులు బసీన్ల దగ్గిర్నించి, బుష్షర్టుల దాకా ఎవరి మామూలు దుస్తుల్లో వారు హాజరయ్యారు. ప్రొడక్షను కంట్రోలర్ శ్రీ శశధర్ ముఖర్జీ ఎక్కడా పత్తాలేరు. ఇంత ఇదిగా ఉన్నా డా॥ సుకర్నో సహజంగా చలనచిత్రాభిమాని గనక ఉత్సాహంగా తారలతోను, సెట్స్‌దగిర ఉన్న వివిధ చిత్ర నిర్మాతలతోనూ కలిసిమెలిసి తిరిగారు. శ్రీ జలాన్ ఆయనకి పూలమాల వేసి స్వాగతం చెప్పారు. "ఇదేనా భారత దేశపు హాలీవుడ్ ?" అని అధ్యక్షుడు అడిగిన ప్రశ్న జలాన్‌కు సరిగ్గా అర్థం కాలేదల్లే వుంది ... తన స్టూడియోనుగూర్చే అడుగుతున్నారనుకుని "అవునవును. ఇదే భారత దేశపు హాలీవుడ్" అని సమాధాన మిచ్చారు.

సంగీతమందిరంలో డా॥ సుకర్నో "మీ సినిమా సంగీతం మాసంగీతం ఒక్క మాదిరిగానే ఉన్నాయి" అని ప్రశంసించారు. దీనికి "అవునండి. మా స్టూడియోలో అన్ని రకాల సంగీతం దొరుకుతుంది" అని జలాన్ సమాధానం. దురదృష్టవశాత్తు ఆసందర్భంలో అనిల్ బిశ్వాస్ పూర్తిగా అభారతీయమైన సంకర సంగీతాన్ని వినిపించారు. తరవాత అధ్యక్షుడు ప్రాపర్టీ శాఖను దర్శించారు. అక్కడ పురాణ పురుషులు ధరించే కిరీటాలు వగైరాలున్నాయి. ఒక కిరీటం చూసి ఆయన మెచ్చుకున్నారు. "మీరు పెట్టుకు చూడండి" అని ఒకరనగా ఆయన చిరునవ్వునవ్వి జలాన్‌గారి అభిమానతార అయిన అమిత తలపై ఆకిరీటం పెట్టారు.

తరవాత అధ్యక్షుడు "కాలాపానీ" సెట్ చూడడానికి వెళ్ళారు. అక్కడున్నంతసేపూ ఆయన మంచి ఉత్సాహంగా కనిపించారు. నిర్మాత, నటుడు దేవానంద్



బాలతార డెయిజీ ఇరానీ. 1956 సం॥పు తమిళచిత్రాల్లో (యార్ పయ్యన్) ఉత్తమ బాలనటిగా మద్రాసు ఫిలిమ్ ఫాన్స్ సంఘం ఈ ఏడేళ్ళపిల్లకు బహుమతి ఇచ్చింది.

# ★ బొంబాయి సినిమాలేఖ ★

ఆయన్ని సెట్‌లోకి ఆహ్వానించాడు. నళిని జయవంత్, తనూ నటించే ఒక సన్నివేశాన్ని రిహార్స్ చేసి చూపించాడు. తరవాత ఒకరికొకరు పరిచయం చేయబడ్డారు. డా॥ సుకర్నో అప్పుడు దేవానంద్‌ని గుర్తుపట్టారు. "ప్రజలకి మీమీద చాలా మోజు ఉంది" అని అధ్యక్షుడు అనగానే, దేవానంద్ "మీ మీద మాత్రం తక్కువుందా సార్!" అని సమాధానమిచ్చాడు. షూటింగ్ అంత విసుగు పుట్టేది మరొకటి లేదని దేవానంద్ కొంచెం సిగ్గు పడుతూ అన్నాడు. "అవునవును. నాకూ తెలుసు. నేనూ హాలీవుడ్, మాస్కో ఇంకా ఇతర చోట్ల స్టూడియోలు చూశాను. నిజమే. చెడ్డ విసుగ్గానే ఉంటుంది మీపని. కాని నేను సినిమాలంటే చెవికోసుకుంటాను. కాస్త తీరిక చిక్కగానే సినిమాలు చూస్తూ ఉంటాను. మీరువేసిన సినిమాలు కూడా కొన్ని చూశాను. రాబర్ట్ టేలర్ అంటే నాకు మహాఇష్టం" అని అధ్యక్షుడు చెప్పారు. దర్శకుడు రాజ్ ఖోస్లా ఆ సన్నివేశాన్ని వివరించి చెప్పారు. హీరో దేవానంద్ పాటపాడుతుండగా చిట్టితల్లి నళినీ జయవంత్ ఆపాట భావాన్ని ముద్రల్లో అభినయించి వ్యక్తం చేస్తూ ఉంటుందట "బాగానే ఉందిగాని ఇంతకీ ఆ అమ్మాయి ఏమిటో అంటుంది?" అని డా॥ సుకర్ణో ప్రశ్నించారు. "మరేం లేదు. అమ్మాయి హీరోని ప్రేమించింది. ఆప్రేమని ముద్రల్లో వ్యక్తంచేస్తోంది," అని రాజ్ ఖోస్లా వివరించారు.

"కాలాపానీ" సెట్‌వద్ద చాలాసేపు గడిపి అధ్యక్షుడు మరోఫ్లోర్‌లోకి వెళ్లారు. అక్కడ సునీల్ దత్ నిర్మాతరవీందర్ దావే చిత్రంలో నటిస్తున్నాడు. పొడుగ్గా, అందంగాఉన్న సునీల్‌దత్‌ని ఇండొనేషియన్ కౌన్సల్ జనరల్ సతి అధ్యక్షునికి పరిచయంచేసింది. సునీల్ పూలమాల వేసి ఆహ్వానించి, తోటి వారికి ఆయన్ని పరిచయంచేశాడు.



"గూఫ్ కీ రాణి, చరణ్ కా రాజా"లో దేవానంద్, వహీదా రెహమాన్.

చివరికి అధ్యక్షుణ్ణి స్టుడియో థియేటర్ కు తీసుకువెళ్ళారు. అల్పాహార విందు జరిగింది. తరవాత "నాగిన్"లోని గేవాకలర్ ఘట్టాన్ని ప్రదర్శించారు. ఈ ప్రదర్శన కాగానే అధ్యక్షుడు అసలైన భారతీయ సంగీతం వినాలని ఉందన్నారు. వెంటనే నళినీ జయవంత్ ని పిలిపించారు. ఆమె తన "నౌబహార్" చిత్రంలోని ఒకపాట మధురంగా పాడింది. ఈపాటని అధ్యక్షుడు చాలా మెచ్చుకున్నారు. ఆమెది కోకిలకంఠమని ప్రశంసిస్తూ ఆటోగ్రాఫ్ కూడా ఇచ్చారు.

అంతసేపూ తన ప్రక్కనే కూర్చున్న అమీతాను కూడా అధ్యక్షుడు సుకర్నో మెచ్చుకున్నారు. ఆతరవాత ఈ విలేఖరితో మాట్లాడుతూ తన అందాన్ని ఆయన తెగ మెచ్చుకున్నారనీ, పెళ్ళియిందా అనీ, ఎవర్నయినా ప్రేమించావా అనీ ఆయన అడిగారనీ, తనతో విందుకు రమ్మని అడిగారనీ ఆమె చెప్పింది.

ఫొటోగ్రాఫర్లు తనకేసి చూసి తటపటాయినూ ఉండటం చూసి డా॥ సుకర్నో నల్లకళ్ళద్దాలు తీసేసి పక్కనున్న అందాల తారలతో మాట్లాడుతూ కూర్చున్నారు. ఫొటోగ్రాఫర్లు కావలసినన్ని ఫొటోలు తీసుకున్నారు.

* * *

బొంబాయి ప్రభుత్వం ఈనెల 11వ తేదీన ప్రారంభించిన జాతీయ పొదుపు పత్రాల ఉద్యమానికి సహాయంగా తారలు నర్గీస్, దిలీప్ కుమార్, బేబీనాజ్, రూపమాల, డెయిజీ ఇరానీ, తదితరులు, సంగీత దర్శకులు శంకర్, జైకిషన్, ఇంకా లతామంగేష్కర్, ఆమె సోదరీమణులు, మహమ్మద్ రఫీ, తలత్, ముఖేష్, సుధామల్హోత్రా, హేమంత్ కుమార్ మొదలైనవారు ఒక ప్రత్యేక కార్యక్రమంలో పాల్గొన్నారు. కార్యక్రమాన్ని బొంబాయి పోలీసు కమీషనరు శ్రీ ప్రవీణ్ సింగ్ జీ అధ్యక్షతన ఒక సంఘం ఏర్పాటు చేసింది. బ్రాబర్న్ స్టేడియంలో జరిగిన ఈ కార్యక్రమానికి ఇరవై వేలమంది హాజరయ్యారు. దాదాపు 50 లక్షలదాకా పొదుపు ఉద్యమానికి సమకూరింది. డేవిడ్ కార్యక్రమాన్ని ప్రారంభించాడు. కాని ఫిలింతారలు ఎంతసహకరించినా కార్యక్రమం ఉషారుగాలేదు. ఏర్పాట్లు అవీ కూడా సరిగా జరక్క అంతా అవకతవకగా అయింది. అందులో మొదట్లో జరిగిన కార్యక్రమమంతా చెత్తగావుంది. మరీఘోరమేమిటంటే ఒక ఐటముకీ మరొక ఐటముకీ మధ్య ఒక్కొక్కసారి ఇరవైయేసి నిమిషాలదాకా వ్యవధి ఉండటంచేత విసుగు పుట్టింది. సహజంగా వెనకాల గ్యాలరీలో వాళ్ళు నానాగోల చేశారు. ఏమైతేనేం ఒక మంచి జాతీయ ఉద్యమానికి దీనివల్ల బోలెడు లాభం కలిగింది. మామూలుగా అయితే ఒక్క నయాపైసాఅయినా విదల్చని వారంతా తారల్ని చూడటానికనివచ్చి ఏదో ఎవరికి తోచినంతవారు పొదుపుపత్రాల ఉద్యమానికి సహాయం చేశారు.



పొన్నలూరివారి "శోభ"లో రాజసులోచన.

* * *

మధ్యప్రదేశ్ లోని పాంచ్ మర్హీ వద్ద 'లొకేషన్' షూటింగ్ కి వెళ్ళిన తెరవేల్పు నిరూపారాయ్ కారు చిన్నప్రమాదానికి లోనైంది. ప్రస్తుతం ఈమె "ఢిల్లీదర్వాజా" అనే చిత్రంలో ముఖ్యభూమిక నిర్వహిస్తోంది.

నూతన సంవత్సరోత్సవాలు నిరుటికంటే ఈయేడు బాగాజరిగాయి. దిలీప్ కుమార్, అశోక్ కుమార్ మొదలైన నటులు రెస్టారెంటులలో చేరి సరదాగా కాలంగడిపారు. నళినీజయవంత్ జుహూ బీచ్ లోని దేవానంద్ గృహంలో ఆతిథ్యం స్వీకరించింది. దేవానంద్, అతనిభార్య కల్పనా మిత్రుల ఇళ్ళకువెళ్లి శుభాకాంక్షలు అందజేసి వచ్చారు.

నట దర్శక నిర్మాత గురుదత్ ప్రస్తుతానికి హిందీ చిత్రం "రాజ్", బెంగాలీ చిత్రం "గౌరి"ల నిర్మాణం ఆపుచేశాడు. సెంట్రల్ స్టూడియోలో ఒకఫ్లోర్ దీర్ఘకాలికపద్ధతిని అద్దెకుతీసుకుని, అక్కడ "కాగజ్ కె ఫూల్" అనేచిత్రం ఆరంభించాడు. అందులో గురుదత్ వహీదారెహమాన్ తో కలిసినటిస్తున్నాడు. నడివయసులో పడిన దర్శక నిర్మాత ఒకడు ఒకయువతిని చలనచిత్ర తారగా పైకి తీసుకురావటం, అలా తీసుకురావటంలో తన జీవితాన్ని, తనభార్య జీవితాన్ని బోలెడు కష్టాలపాలు చేయడం ఈ చిత్రంలో ఇతివృత్తం. దీనికి ఎస్. డి. బర్మన్ సంగీతదర్శకుడు. సినిమా స్కోపులో తీస్తున్నారు. ఔట్ డోర్ షూటింగ్ చాలామటుకు సిమ్లాకొండలో జరుగుతుంది. 

 

# సినిమా వార్తలు



ఈ నెల 10 వ తేదీన విడుదల అయిన సారథి స్టుడియోస్ చిత్రం "ఎత్తుకు పైఎత్తు" విజయవంతంగా నడుస్తూ, ప్రజాదరణ పొందుతున్నట్లు తెలుస్తోంది.

సారథి స్టుడియోస్ (హైదరాబాదు)లో వివిధ సంస్థల పేరిట తయారుచేయనున్న చిత్రాల ప్రకటనలు మొన్న సంక్రాంతి సందర్భంలో వెలువడ్డాయి. సారథి స్టుడియోస్ రెండవ చిత్రాన్ని, సారథి ఫిలిమ్స్ 13 వ చిత్రాన్ని తాపీచాణక్య డైరెక్టు చేస్తారు. నాగార్జున ఫిలిమ్స్ మొదటి చిత్రాన్ని కబీర్ దాస్, నవశక్తి ఫిలిమ్స్ మొదటి చిత్రాన్ని జి. రామినీడు, సారథి ఎండ్ నాగార్జునవారి రెండవ చిత్రాన్ని సి. వి. ఆర్. ప్రసాద్ డైరెక్టు చేస్తారు.

* * *

శ్రీ రాజరాజేశ్వరీవారి తాజా చిత్రం "అన్న-తమ్ముడు" వచ్చే నెలలో విడుదల కానున్నది. ఇందులో ఎన్. టి. రామారావు, జగ్గయ్య, రేలంగి, ముక్కామల, కుటుంబరావు, ఆర్. నాగేశ్వరరావు, జానకి, రాజసులోచన, మాలతి, గిరిజ నటించారు. మాటలు పినిశెట్టి, బి. వి. ఎన్. ఆచార్య వ్రాశారు. సంగీతం అశ్వత్థామ, దర్శకత్వం సి. యస్. రావు నిర్వహించారు. నిర్మాత కడారు వెంకటేశ్వరరావు.

వీరి మరొక చిత్రం "శ్రీ కృష్ణమాయ"లో నారదుడుగా ఎ. నాగేశ్వరరావు, కృష్ణుడుగా రఘురామయ్య నటిస్తున్నారు. ఇంకా జమున, సూర్యకళ, మాలతి, సూర్యకాంతం, ఛాయాదేవి, కుటుంబరావు, ఎ. వి. సుబ్బారావు, వల్లరామమూర్తి, కె. వి. యస్. శర్మ, డా॥ శివరామకృష్ణయ్య మున్నగువారీ చిత్రంలో నటిస్తున్నారు. రచన రావూరి, బి. వి. ఎన్. ఆచార్య; సంగీతం టి. వి. రాజు, దర్శకత్వం సి. ఎస్. రావు నిర్వహిస్తున్నారు. ఈ చిత్రం ఏప్రిల్ లో విడుదల అవుతుందట.

* * *

ఇదికాక ఇంకా అనేక పౌరాణిక చిత్రాలు తెలుగులో తయారు కాబోతున్నాయి. గౌరీనాథశాస్త్రి, ముక్కామల, అమరనాథ్, సూరిబాబు, రఘురామయ్య, వంగర, శ్రీవత్స, శ్రీరంజని, సంధ్య మొదలైనవారు నటిస్తున్న "శ్రీ రామాంజనేయ యుద్ధం" ఒకటి. కాశీనాథ్ ప్రొడక్షన్స్ తీస్తున్న ఈ చిత్రానికి దర్శకుడు

విజయగోపాల్ ప్రొడక్షన్స్ వారి "గంగాగౌరీ సంవాదం"లో నారాయణరావు, కృష్ణకుమారి, పి. హేమలత

# రెండు చక్కని చిత్రాలు

## ఎఫేర్ టు రిమెంబర్

గ్లామరస్ తారలు కారీ గ్రాంట్, డెబోరా కెర్ నటించిన ఫాక్స్ కంపెనీ చిత్రం "ఎఫేర్ టు రిమెంబర్" బొంబాయిలో బహుళజనాదరణ పొంది, ఇప్పుడు మద్రాసులో కూడా వారాల తరబడి జనాన్ని బాగా ఆకర్షిస్తోంది. నిజమైన ప్రేమకు ఢోకా లేదని ఈ చిత్రంలో నీతి లాంటిది ఉన్నా, ఆద్యంతమూ సున్నితమైన హాస్యమూ, వినోదకరమైన సన్నివేశాలు, కంటతడి పెట్టింపజూచే ఘట్టాలు బాగా ఉన్నాయి.

కారీ గ్రాంట్, డెబోరా కెర్ న్యూయార్కు పోతున్న ఒక నౌకలో యాదృచ్ఛికంగా కలుసుకుంటారు. కారీ అదివరకే ఒక అమ్మాయి ప్రేమకు, డెబోరా ఒక అబ్బాయి ప్రేమకు బద్ధులై ఉంటారు. కనక మొదట్లో వీరు మర్యాదగానే ప్రవర్తిస్తారు. కాని చివరికి మన్మథ ప్రభావానికి లోబడి, తల మునకలుగా ప్రేమ సముద్రంలో పడిపోతారు. నౌక న్యూయార్కు చేరబోయే ముందు ఒక వాగ్దానం చేసుకుంటారు — ఆరు నెలల తరవాత ఒకానొక రోజున తామిద్దరూ ఎంపైర్ స్టేట్ బిల్డింగ్ గోపురాగ్రాన (స్వర్గానికి దగ్గరకదూ!) కలుసుకోవాలనీ, ఈ ఆరునెలల్లోనూ తమ పాత ప్రియుల్ని వదిలించుకోవాలనీ. ఈ ఒప్పందం జరిగాక ఆరు నెలలూ గడిచిపోతాయి. గడువురోజున కారీ ఎంపైర్ స్టేట్ భవన గోపురంలో డెబోరా కోసం ఎదురు చూస్తూ వుంటాడు. ఆమె అతన్ని కలుసుకోటానికి రాబోతూ, ఆ తొందరలో కారు ప్రమాదంలో గాయపడుతుంది; ప్రియుణ్ణి కలుసుకోలేక పోతుంది. ఈ సంగతి తెలియక ఆమె తన్ను మోసం చేసిందని బాధపడి, నిరాశతో కారీ వెళ్ళిపోతాడు. కొన్నాళ్ళకి ఆమె, అతను ఒక చోట అనుకోకుండా తటస్థపడతారు. తరవాత ఆమె ఇంటికి అతడు వెళ్ళి సూటిపోటి మాటలతో తన ఉక్రోషం అంతా వెళ్ళబుచ్చుతాడు. ఆమె అన్నిటినీ శాంతంగా భరిస్తుంది గాని అసలు సంగతి చెప్పదు. ఈ ప్రచ్ఛన్న యుద్ధం ముగిసేలోగానే అతడికి హఠాత్తుగా తెలుస్తుంది ఆమెకు కాళ్లు లేవని, ప్రమాదానికి లోనై ఆమె సంకేతస్థలానికి

---

ఎస్. ఎస్. ఆచార్య; రచన కొవ్వలి; సంగీతం జంధ్యాల, నిర్మాత కె. సుబ్రహ్మణ్యం.

సీతాకళ్యాణంనుంచి శ్రీరామ పట్టాభిషేకందాకా రామాయణమంతా చూపించే "శ్రీరామ భక్త హనుమాన్" (బసంత్ పిక్చర్స్) మరొకటి. బాబూభాయ్ మిస్త్రీ డైరెక్టు చేసిన ఈ చిత్రానికి తెలుగులో శ్రీ శ్రీ మాటలు, పాటలు రాస్తున్నారు.

* * *

అంజలీదేవి, ఎన్. టి. రామారావు, చలం, రేలంగి, ఆర్. నాగేశ్వరరావులతో బాలచందర్ దర్శకత్వాన అశోకావారి చిత్రం "భూలోకరంభ" ఈ నెలాఖరులో విడుదల కానున్నది.

* * *

శివాజీగణేశన్, నాగయ్య, జమున, శాంతకుమారి, రంగారావు, రమణారెడ్డి మున్నగువారు నటించిన అరుణావారి "బొమ్మలపెళ్లి" ఆంధ్రలో ఈ నెల 11 న విడుదలై వడుస్తోంది.

* * *

శ్రీ రవి ఫిలిమ్స్‌వారి "కొండవీటిదొంగ" కూడా సంక్రాంతి కానుకగా ఆంధ్రలో విడుదలైంది. ఇందులో అంజలి, కన్నాంబ, ఇ. వి. సరోజ, రంజన్ నటించారు.

* * *

## పునర్జన్మ

శ్రీ బెల్లంకొండ రామదాసు రచించిన "పునర్జన్మ" అనే నాటకాన్ని రిపబ్లిక్ దినోత్సవ సందర్భంలో విజయవాడ, ఉదయినీ థియేటర్స్‌వారు మద్రాసు, వాణీమహాల్‌లో ప్రదర్శిస్తున్నారు. ఇందులో సినీనటులు కె. వి. ఎస్. శర్మ, వల్లం నరసింహారావు, పేకేటి శివరాం, ఇంకా నిర్మల, మున్నగువారు నటిస్తారు. ★



జలరుహావారి "రాజనందిని"లో గిరిజ

## రెండు చక్కని చిత్రాలు

రాలేకపోయిందనీ. కథ సుఖాంతమవుతుంది.

కారీగ్రాంట్, డెబొరాకెర్ ఈ చిత్రంలో అత్యుత్తమంగా నటించారు. దర్శకుడు లియో మెక్ కారీ. కథ భారతీయ చిత్రాలకు దగ్గరగా ఉండటంచేత (ముఖ్యంగా కారుప్రమాదం, ఆస్పత్రి సీను) ఈ కథను కొద్దిమార్పులతో స్వదేశీచిత్రంగా దించెయ్యాలనే తహతహను ఎందరు నిర్మాతలు నిగ్రహించుకోగలరో ఆగి చూడాలి.

## ఎడ్మైరబుల్ క్రైటన్

గతవారం మద్రాసులో విడుదలయిన కొలంబియా చిత్రం "ఎడ్మైరబుల్ క్రైటన్" విషయంలో అలా ఆగి చూడాల్సిన అవసరం లేదు. ఎందుకంటే ఈ చిత్రాన్ని మన ప్రేక్షకులస్థాయికి దించగలగటం స్వదేశీ నిర్మాతలకు తలకుమించిన పని. ప్రఖ్యాత రచయిత జె. ఎమ్. బారీ (పీటర్ పాన్, మేరీ రోజ్) రాసిన నాటకం ఆధారంగా ఈ చిత్రం బ్రిటన్‌లో తీశారు. ఈ చిత్రంలో కథ చాలా చిత్రమైనది. సాధారణంగా ఇలాంటి కథలు లోకంలో జరగవు. కొందరు మామూలుగా జరిగే విషయాల్నే తీసుకుని కథలు రాస్తారు; మరికొందరు మామూలుగా జరగని విషయాలు తీసుకుని కథలు రాస్తారు. రచయిత గొప్పవాడైతే జరిగే కథనైనా, జరగని కథనైనా మానవుడి ప్రతిబింబం చూపించే అద్దంలాగ వాడుకుంటాడు.

కొల్లలుగా డబ్బు, చిల్లరగా ముగురు కూతుళ్లు, క్రైటన్ అనే బట్లరు కలిగిన లార్డ్ లోమ్(నటుడు సెసిల్ పార్కర్)అనే ఇంగ్లీషు ఆసామీ ఒక ఓడ తీసుకుని కుటుంబంతో సహా దక్షిణ పసిఫిక్ సముద్రంలో ప్రయాణానికి బయల్దేరుతాడు. ఓడలో ఉన్నవాళ్ళు లార్డ్‌లోమ్, ఆయన ముగ్గురు కూతుళ్ళు, ఇద్దరుకూతుళ్ళ ఇద్దరు ప్రియులు, బట్లరు క్రైటన్ (నటుడు కెనెత్ మూర్) ఇంకో దాసీపిల్ల. చాలాదూరం పోయాక పెద్దతుపానువచ్చి, ఓడకి చిల్లులూ, ప్రయాణికులగుండెల్లో రాళ్ళూ పడతాయి. వీరంతా ఒక చిన్న బోటులోఎక్కి ప్రాణాలు రక్షించుకుని, ఒకద్వీపం చేరుకుంటారు. అది నిర్జనద్వీపం. అక్కడిదాకా ముందుకు నడిచిన కథ ఆద్వీపంలో అడ్డం తిరుగుతుంది. అప్పటిదాకా యజమానులు యజమానులు గాను, బట్లరు బట్లరుగానూ ఉంటారు. క్రైటన్ వృత్తిచేత బట్లరైనా, జన్మతః బట్లరైనట్లు ప్రవర్తిస్తూ ఉంటాడు. యజమానికి, ఆయన కూతుళ్ళకు తలలో నాలుకలాగ ఉంటాడు. ఎక్కడా సంప్రదాయానికి, మర్యాదకు, విరుద్ధం రానియ్యడు. ఒకసారి ఇంగ్లండులో ఉన్నప్పుడు లార్డులోమ్ "సర్వ మానవ సమానత్వం" ఆచరణలో పెట్టబోతే "వెర్రి వెర్రి వేషాలు వెయ్యకమీ యజమాని హోదాలో మీరుండండి"అని మందలిస్తాడు. అటువంటి క్రైటన్ నిర్జనద్వీపంలో ఎలా



అశోకావారి "భూలోకరంభ"లో మారువేషాలలో రేలంగి, స్వర్గీయ జోగారావు.

ప్రవర్తిస్తాడు? మిగతా వాళ్ళు ఎలా ప్రవర్తిస్తారు?

లార్డులోమ్ ఆయన కూతుళ్ళు, మిగతా ఇద్దరు యువకులు గొప్పవంశాల్లో పుట్టిన వాళ్ళు; డబ్బు, హోదా అన్నీ ఉన్నవాళ్లు. కాని నిర్జనద్వీపంలో ఇవేమీ గడ్డిపోచ ఖరీదు చెయ్యవు. తినతిండి, నిలవనీడ, కప్పుకోటానికి గుడ్డ ఇవి ఎవడైతే తనంతటతను సంపాయించుకుంటాడో వాడే ఆద్వీపంలో నెగ్గుకొస్తాడు. ఎప్పుడూ పనిచేసి ఎరగని లార్డులోమ్ వగైరాలు తెల్లమొహాలు వేస్తారు. అప్పుడు క్రైటన్‌లోని బట్లరు కాక అసలు మనిషి బయటపడతాడు. అగ్గిపెట్టెలు లేకుండా నిప్పు చెయ్యాలంటే అతడే చెయ్యాలి. ఆహారం సంపాదించాలంటే అతడే సంపాదించాలి. ఉండటానికి కుటీరాలు అతడే తయారుచెయ్యాలి. మిగతా వాళ్ళు మొదట్లో బింకం చూపించినా చివరికి గతిలేక అన్నిటికి అతనిమీదే ఆధారపడతారు. అతన్ని నాయకుడుగా అంగీకరిస్తారు. అతన్ని 'గవర్నర్, గవర్నర్' అని పిలుస్తారు.

ఇలా రెండేళ్ళపాటు వారు ఆద్వీపంలోనే ఉండిపోతారు. క్రైటన్ తన నాయకత్వాన్ని దుర్వినియోగం చెయ్యడు; చెయ్యాల్సిన అవసరమూ అతనికి లేదు. డబ్బు, హోదా అనే పునాదులపై నిలిచిన నాగరిక ప్రపంచంలోనే బట్లర్లూ, హిట్లర్లూ తయారవుతారు. వ్యక్తివిలువ అనే పునాదిపై నిలిచే "అనాగరిక" ప్రపంచంలో సాంఘికంగా అంతా సమానులే. వీళ్లు అక్కడ సుఖంగా నాగరికతకు దూరంగా ఉన్నామనే బెంగ లేకుండా ఉంటారు. క్రైటన్ తమలో నిద్రపోతున్న మానవత్వాన్ని మేల్కొలిపాడని ఒప్పుకుంటారు.

ఇక ఎలాగూ ఆద్వీపంలోంచి బయటపడే మార్గం లేదు గనక, అక్కడే శాశ్వతంగా ఏర్పాట్లు చేసుకుందామని క్రైటన్ చెబుతాడు. మొదట్లో తన్ను కసిరి కొట్టిన లార్డులోమ్ పెద్దకూతురు మేరీ ఇప్పుడు తన్ను ప్రేమిస్తోంది గనక ఆమెను పెళ్ళాడటానికి సిద్ధపడతాడు. అంతా సరేనంటారు. అతడు సరిగ్గా వివాహప్రమాణం చేయబోయే సమయానికి కొంతదూరంలో ఒక ఓడ కనబడుతుంది. క్రైటన్‌ను ప్రేమించిన మేరీ తప్ప మిగతా వారంతా ఆ ఓడను పిలుద్దామంటారు. క్రైటన్ తలుచుకుంటే ఆ ఓడ దగ్గిరికి రాకుండా చేసి, తన నాయకత్వాన్ని, మేరీని నిలబెట్టుకోగలడు. కాని అతడు మిగతా వారికోసం త్యాగం చేస్తాడు. ఓడ ఒడ్డుకు వస్తుంది. ఓడలోంచి "నాగరిక" జనులు ఒడ్డున అడుగుపెడతారు. ఆక్షణం నించీ యజమానులు యజమానులూ, క్రైటన్ బట్లరూ అయిపోతారు. కనుక పెళ్ళి ఆగిపోతుంది. ఆగి పోయినందుకు మేరీ బాధపడుతుంది. అందరూ ఓడ ఎక్కి సురక్షితంగా ఇంగ్లండు చేరుకుంటారు. నిర్జనద్వీపంలో కథ అడ్డంగా నడిచిన సంగతి లోకానికి తెలిస్తే తన మర్యాద నిలవదని లార్డులోమ్ క్రైటన్ మీద గౌరవం ఉన్నా, అతన్ని ఉద్యోగంనుంచి తొలగించాలనుకుంటాడు. మేరీ కష్టం లేకపోయినా, ఆమె నదివరకే పెళ్ళిచేసుకోదలచిన ఒక గొప్పవాడితో పెళ్ళి నిశ్చయమవుతుంది. క్రైటన్ తానా ఇంట్లో ఉండటం ఇక భావ్యంకాదని ఉద్యోగానికి రాజీనామా ఇచ్చేస్తాడు. తన్ను మొదటినించీ గాఢంగా ప్రేమించిన తన వర్గపు దాసీపిల్లను తీసుకుని అందరికీ గుడ్‌బై చెప్పి వెళ్ళిపోతాడు.

"ద్వీపంలో మనం గడిపిన సుఖదినాల్ని ఎలా మరిచిపోతాను గవర్నర్?" అని మేరీ అంటుంది. "అదంతా ఒక కల. దాన్ని నిజం చేసుకోవాలని ప్రయత్నించకు. కల కాస్తా కరిగిపోగలదు!" అని క్రైటన్ సలహా ఇస్తాడు. అతడు వెళ్ళిపోతుంటే అతని గొప్పదనం గుర్తించిన లార్డులోమ్ వగైరాలందరూ ఎంతో బాధపడతారు.

ఇది రెండు ద్వీపాల కథ. ఒకటి నాగరికతకు చిహ్నమైన ఇంగ్లండు, ఇంకోటి అనా





Tushar
వనస్పతి
2 పౌ॥, 5 పౌ॥, 10 పౌ॥ల, డబ్బాల్లో లభించును.
విటమిన్ ఏ, డి లతో నిండియున్నది.
*
తుంగభద్ర ఇండస్ట్రీస్ లిమిటెడ్, కర్నూలు.





అపోలో ఆర్ట్సువారి హిందీచిత్రం "కినారే కినారే"లో మీనాకుమారి, దేవ్ ఆనంద్. వీరిద్దరూ కలిసి నటించడం ఇదే మొదటిసారి.

## రెండు చక్కని చిత్రాలు

గరికతకు చిహ్నమైన పసిఫిక్ ద్వీపం. నాగరికత అని మనం అనుకునేది మనుష్యుల్ని ఎంత కృత్రిమ వ్యక్తులుగా తయారుచేస్తుందో, అనాగరికత అని అనుకునేదాంట్లో నిజమైన విలువలు ఎలా బయటపడతాయో ఈ చిత్రం చూపిస్తుంది. మొదటి నుంచి చివరదాకా కడుపుబ్బ నవ్వించే హాస్యమూ, సూక్తులూ, ఛలోక్తులూ, క్రైటన్‌గా కెనెత్ మూర్ అత్యుత్తమనటన, టెక్నికలర్ ఛాయాగ్రహణంలో సముద్రతీరపు రమణీయ దృశ్యాలు, తమాషాకథ, కథలో అంతర్వాహినిగా మానవ స్వభావోన్మీలనం ఇవన్నీ పుష్కలంగా ఉన్న ఇలాంటి చిత్రాలు అరుదుగా చూస్తాము. 

## అక్కినేని నాగేశ్వరరావుకు సన్మానం

శ్రీ అక్కినేని నాగేశ్వరరావుకు గుంతకల్లు పురపాలక సంఘమువారు సంక్రాంతి రోజున సన్మానం చేశారు.

శ్రీ నాగేశ్వరరావు 14 వ తేదీన ఉదయం మెయిలులో నిర్మాతలు శ్రీ కె. ఎస్. ప్రకాశరావు, శ్రీ టి. వి. ఎస్. శాస్త్రి, నటుడు శ్రీ పేకేటి శివరాం గారలతో గుంతకల్లు వెళ్ళారు. పురపాలక సంఘాధ్యక్షులు డాకరు వై. హనుమంతరావు, కార్యదర్శి డాక్టర్ సత్యనాధన్ అనేక ఫిలిం డిస్ట్రిబ్యూటింగ్ కంపెనీల మేనేజర్లు, పురప్రముఖులు, సుమారు అయిదువేల మంది జనం స్టేషనుకు వచ్చారు. పూలతో అలంకరింపబడ్డ జీపుకారులో నాగేశ్వరరావును పట్టణవీధులలో ఊరేగించారు. క్రౌన్ టాకీసులో ప్రత్యేకంగా ఆహ్వానింపబడిన పురప్రముఖులు సుమారు రెండువందలమందితో నాగేశ్వరరావుగారికి విందు భోజనం యేర్పాటు చేశారు. హాస్పిటల్ గ్రౌండ్సులో యేర్పాటైన సన్మానసభకు, ఆంధ్రసంగీత నాటక అకాడమీ సభ్యులు శ్రీ జి. వెంకటరెడ్డి అధ్యక్షత వహించారు. గుంతకల్ పురపాలక సంఘం తరపున డా॥ హనుమంతరావు స్వాగత సన్మానపత్రం చదువుతూ నాగేశ్వరరావును సత్కరించగలిగడం తమ అదృష్టమని చెప్పారు. రజితపేటికలో సన్మానపత్రం సమర్పించబడింది. పౌరసన్మాన సంఘం తరఫున డాక్టరు సత్యనాధన్ గారు సన్మానపత్రం చదివి సమర్పించారు. రాయలసీమ కాంగ్రెసు నాయకులు, శాసనసభ్యులు శ్రీ కల్లూరు సుబ్బారావు, ఆశీర్వచనాక్షతలు చల్లి, పంచలోహాలతో చేసిన రెండడుగుల ఎత్తుగల నటరాజ విగ్రహాన్ని పౌరసన్మాన సంఘం తరఫున నాగేశ్వరరావుకు సమర్పించారు. వివిధ సమాజాలు అనేక సమితులు నాగేశ్వరరావుగార్ని పుష్పమాలాలంకృతులు చేశాయి. సన్మానపత్రాలు సమర్పించాయి. శ్రీ నాగేశ్వరరావు కృతజ్ఞతాపూర్వక వందనాలు సమర్పిస్తూ, తనకు జరిగిన యీ సన్మానం తమ ఒక్కరికే చెందదని, యావత్ ఫిలిం పరిశ్రమకూ, అందలి వ్యక్తులందరికీ చెందుతుందనీ చెప్పారు. పురపాలక సంఘానికి, సన్మాన సంఘానికి, మిత్రులైన శ్రీ బి. వి. రాజుగారికి తదితర ఫిలిం డిస్ట్రిబ్యూటింగు కంపెనీ మేనేజర్లకు, పౌరులకు అందరికీ కృతజ్ఞతాభివందనాలు తెల్పారు. 


**K. జయరాం,**

న్యూస్ ఏజెంటు, రామనివాస్.
కింగ్సు సర్కిల్, బొంబాయి - 19.
ఆంధ్రపత్రిక - సచిత్ర వారపత్రిక,

దినపత్రిక, ఆనందవికటం, కల్కి, కుముదం, కలైమగల్ వగైరా తెలుగు, తమిళ, మళయాళ, కన్నడ, హిందీ, మరాటి, గుజరాతీ, ఇంగ్లీషు భాషలలో అన్ని రకములైన దినపత్రికలు వారపత్రికలు మాగజైనులు నవలలు మేము సప్లయి చేయుదుము. ఇంటివద్ద గూడ డెలివరి యిస్తాం. కావలసినవారు మాకు వివరములకు వ్రాయండి.



Printed and Published for Nageswara Rao Estates (Private) Ltd., by S. Radha Krishna at
The Andhra Patrika Press, 6 & 7, Thambu Chetty Street, Madras-1. Editor S. Sambhu Prasad



వాత్సల్యం

ఫోటో: ఎన్. రామకృష్ణ.



# పాండ్స్

## డ్రీమ్‌ఫ్లవర్ టాల్క్

## మిమ్మల్ని రోజంతా హాయిగా మరియు సువాసన వెదజల్లుతూ ఉంచుటలో సాటిలేనిది




నవోత్సాహమునిచ్చే, పరిమళముగల పాండ్స్ డ్రీమ్‌ఫ్లవర్ టాల్కమ్ పౌడరు వాడితే తీక్షణమైన ఎండతో చికాకు కలిగించే వాతావరణములో కూడ మీకు చల్లగా, హాయిగా ఉంటుంది. ఈ మెత్తని పౌడరును ఒళ్లంతా రాసుకొంటే చెమట వలన కలిగే చికాకు లేకుండా మీరు రోజంతా ఉత్సాహముగా మరియు హాయిగా ఉంటారు. రోజంతా హాయిగా ఉండుటకు ఎల్లప్పుడూ పాండ్స్ డ్రీమ్‌ఫ్లవర్ టాల్కమ్ పౌడరునే వాడండి.

చీస్‌బ్రో-పాండ్స్ ఇన్‌కార్పొరేటెడ్
(పరిమితమైన బాధ్యతతో. యు.ఎస్. అమెరికాలో
సంస్థాపితము)